

లాలన

చిత్రకారుడు - కె. శేషయ్య (మిర్యాలగూడ)



* కుమారి మాత్రలు *
బహిష్టు సమయంలో
అనేక బాధలు పడే
స్త్రీలకు బాధలన్నీ తొల
గించును సొదా: రు. 4
స్పెషల్ : రు. 6 అదన స్పెషల్ : 9/-
ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయండి.
P. Devee & Co (M-1) Calcutta-0. 4

ఇంటిల్లిపాదికి
ఆనందంచేకూర్చే
ఆంధ్రసచిత్రవారపత్రిక
తప్పక చదవండి!

మీ అందానికి
గ్లోరియా అనేసౌందర్యపోషక
ద్రవం, ముదిరూపును పోగొట్టి మీ
ముఖానికి, చక్కని లేతదనాన్ని కాంతిని తెచ్చును మొటి
మలు, మచ్చలు ముడుతల్లు, ఎండకువచ్చిననలుపును పోగొ
ట్టి, ముఖాన్ని తెలుపుచేసి మీఅందాన్ని రోజు రోజుకీ
ఎక్కువ చేయును మొదటి పూతలోనే కొంత అందము
వచ్చును వాడిచూస్తే విడువరు అన్నిషాపులలోను దొరకును
జనితా ప్రొడక్ట్సు, ఏలూరు, (ఆంధ్ర).
దుర్గా ప్రాసెస్

అందానికి—
చక్కటి శరీర ఛాయకు









USE RAJA KASTURI SOAP FOR LUXURY BATH
RAJA BAR SOAP FOR EASY WASHING
MANYAM & CO., BANGALORE-20

* ఉగాది *
మా ఖాతాదారులకు, హితులకు, యిదే మా
ఉగాది అభినందనములు.
'రోచ్ రిపెలెంట్ ఫర్ రేడియోస్'
రేడియోలలో వాడండి.
"గార్మెంటోన్" ట్రంకులలో, బీరు
వాలలో మొ॥ వాటిలో వాడండి.
అధికాధికముగా అమ్మడవుతూన్న యీ
కీటక నాశినులను మీరు వాడండి.
సోల్ మార్కెటింగ్ ఏజంట్లు
గంటి అండ్ కంపెనీ,
23, హమామ్ స్ట్రీట్, ఫోర్టు, బొంబాయి-1.
డిస్ట్రిబ్యూటర్లు:
మైసూరు-సుపర్ ట్రేడింగ్ కార్పొరేషన్
ఇన్‌ఫన్ట్రీ రోడ్, బెంగుళూరు-1.
ఆంధ్రప్రదేశ్-రావ్ సన్సు - బర్మా షెల్
A ఏజంట్లు విజయవాడ-2
మదరాసు-ఆర్ వీ అండ్ కంపెనీ,
57, గొడవున్ స్ట్రీట్, మద్రాసు-1

R.S.
DAYAL
INK REGD.
దయాల్ ఇంక్
BEST FOR ALL PENS
DAYALBAGH INK FACTORY
KAKINADA

శ్రేష్టతకు సువర్ణపతకములు పొందినవి
పి.వి.యస్.
మంగుళూరు
బీడీలు
PUTHU VAIKUNT SHET
P.V.S BEEDIES LTD.
MANGALORE 3
P.V.S. BEEDIES PRIVATE LTD
MANGALORE

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

## ఉత్తరాలు

### తెలుగు వెలుగులు

ఈ వారం (8 3-1961) తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 'తెలుగు వెలుగులు' చూడగానే నా అనందం అవధులు దాటింది. కాని పూర్తిగా చదివిన తర్వాత కొంత నిరుత్సాహం కూడా కల్గింది. ఎందుకంటే సి. నారాయణరెడ్డి వంటి అసమాన భావ కుడికి మీరా చిన్న వ్యాసంలో న్యాయాన్ని చేకూర్చ లేకపోయారు. 'నాగార్జునసాగరం', 'కర్పూర వసంత రాయలు'—ఇవి నారాయణరెడ్డి 'చిగిర్చిన కవితా హృదయానికి' మెత్తని 'వూహా చాతురి'కి నిదర్శ నాలు. 'కమనీయ కల్పనలతో కమ్మగా విన్పించే' ఆయన 'కవితాగానం'లో అపశ్రుతులు విన్పించవు, కన్పడవు. "......భావాలకు వ్యాఘాతాలు దొర్లించకుండా చూచుకొని, పాత్రలపై వెలుగు నీడలు ప్రసరింపచేస్తే ....." అన్న వాక్యం నారాయణరెడ్డి గారిలో లేని లోపాలను ఎత్తి చూపడమే.

ఏమైనా 'తెలుగువెలుగులు' ద్వారా ఆంధ్ర కళాకారులలో మణిపూసలనదగిన వారిని పరిచయం చేస్తున్న మీరు నిజంగా అభివందనీయులు. మీ సేవ అనల్పం.

—పి. సోమసుందరరావు (వాల్తేరు.)

*　　*　　*

8 -3—'61 వ తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రికలోని "తెలుగు వెలుగులు" శీర్షిక ద్వారా శ్రీ సి. నారాయణరెడ్డిగారిని పరిచయం చేయటం యువ సాహితీ ప్రియులకు ఎంతో సంతోషకరమైన విషయం.

"....మూడు పదుల నిండని ప్రాయమైనా ముత్తాడి గడుసుదనం గడించిన వివేకవంతుడు...." అన్న వాక్యం ముమ్మాటికి నిజం. ఈ శీర్షిక రచయిత పరిచయం అంతిమ భాగంలో ఇచ్చిన సలహా —కవికి— "....వస్తువుకు లోతులు మరింత సంతరించి, ఉరుకులుతీసే వూహలను ముకుదాడుపట్టి మురిపెంగా నడిపించి, భావాలకు వ్యాఘాతాలు దొర్లకుండా చూచుకొని, పాత్రలపై వెలుగు నీడలు ప్రసరింపజేస్తే, కవులలో పెద్ద సీటు వేసుకొని, తన జన ప్రియత్వాన్ని సుస్థిరం చేసుకుంటాడు."

"తనువు బిగిసిన వీణ
తంత్రివలె త్రుళ్లిపడ
తలపులు గగన పుష్ప
తతులకై ఎగసిపడు"

అని శ్రీ రెడ్డిగారే ఒకానొకచోట తమ గేయాలకు సెలవిచ్చారు.

—పరిమి సాంబశివరావు, (మధ్యప్రదేశ్)

*　　*　　*

1—3—61 వ తేది సంచికలో మీరు ప్రచురించిన తెలుగు వెలుగులలో శ్రీ వరదా వెంకటరత్నం

# ఉత్తరాలు

గారిని గురించి చదివి ఆనందభరితుడనైతిని. ఎందుకనగా ఇన్నినాళ్ళకైనా వెంకటరత్నంగారిని మీ పత్రిక తెలుగు వెలుగులలో చూచినందుకు. వీరు చిత్రలేఖనవునందు మంచి దిట్ట. ఆయన వలచి వచ్చిన పదవులను నిరాకరించి తన జీవిత సర్వస్వాన్ని చిత్ర లేఖనానికి అంకితం చేశారనడము అతిశయోక్తి కానేరదు. ఇంకా యిటువంటి మేధావుల గురించి వేయవలసినదని ప్రార్థించుచున్నాను.

టి. రాంచందర్‌రావు (కామారెడ్డి)

*    *    *

నా అభిమాన వారపత్రికలో వారం, వారం మీరు ప్రచురించే "తెలుగు వెలుగులు" శీర్షికలో మహాపురుషులనుగూర్చి చదివి ఎంతో ఆనందిస్తున్నాము. కాని రాజాజీని గురించి ఇంతకుముందే ప్రచురించారని నేనూ, ప్రచురించలేదని నా స్నేహితుడూ వాదులాడుకుంటున్నాము. ఇంతకుముందు నేను ఆ శీర్షికలో చదివినట్లు జ్ఞాపకం, కాని తేదీ గుర్తు లేదు. ఈ వివాదం మీరే తప్పక పరిష్కరించగలరని ఆశిస్తున్నాను.

—వరం (రాజమండ్రి)

రక్షించారు! డా॥ క్వామే న్కుకుమా గూర్చి చదివామన్నారు కాదు !! ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 28

22-3-61
బుధవారం

ప్లవవత్సర చైత్ర శుద్ధ షష్ఠి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
సంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

'తెలుగు వెలుగులు' పోటీ.
[7 వ పేజీ లో]


| | |
|---|---|
| ఉత్తరాలు | — 3 |
| తెలుగు వెలుగులు | — 7 |
| పెద్ద ఆకారాలూ చిన్న ఆకారాలూ | — 8 |
| న్యూఢిల్లీ లేఖ | — 13 |
| కార్టూన్ | — 15 |
| కథ కాని కథ | — 16 |
| భూప్రదక్షిణం | — 17 |
| మనమూ, మన దేహస్థితీ | — 19 |
| ప్రాచీనఆంధ్ర వాస్తువిశేషము | — 21 |
| బహుమానం | — 25 |
| మనసు నిదరోయింది | — 32 |
| రాశిఫలాలు | — 38 |
| వనితాలోకం | — 40 |
| వనితావాణి | — 45 |
| రాయలరాజ్యంలో | — 47 |
| బిచ్చగాని కుక్క | — 49 |
| వెన్నెల | — 52 |
| సినీమా | — 56 |
| హరివంశము | — 60 |
| గళ్ళనుడికట్టు | — 63 |
| పోటీకథలు | — 64 |


## ఉగాది నవలల పోటీ

పై పోటీకి వచ్చిన నవలలేవీ బహుమతికి తగినవిగా లేనందున పోటీ గడువు **31-5-1961** వరకూ పొడిగించాము. రచయితలు తమ నవలల నీ తేదీకి మా కార్యాలయానికి అందేట్లుగా పంపగోరుతాము.

సంపాదకుడు.

## ముఖచిత్రం కథ

ఉగాది పండుగవచ్చింది. ఎడబాటుసారులైన నూతన దంపతుల పాలిటి వరంలా, అనురాగస్వరంలా వచ్చింది. క్రిందటి మేలో పెళ్ళయిన కొత్త అల్లుడు పట్నంలో రాట్నంలా తిరిగి ప్రాణాలు ఒడిసేసే పనుల బాదరబందీ ఖానాలోంచి బైటపడి హోయిమని, ఆమని బాటలపడి తెలుగు మాగాణంలో తెలుగు మీరిన తన అత్తవారింటికి చేరాడు. అసలుపేరే మాధవరావు. అందులో వచ్చింది వసంతఋతువు. ఎడారి బాటలాంటి ఎడబాటువీడి తన మనస్సుతో పందెం వేసుకునివచ్చిన మాధవరావు, ఆరోజు రాత్రి అలా మొహం ఎందుకు వేలవేశాడో...ఎదురుగా సోఫాలో తాపీగా 'చుట్ట'రికాలు వికరువు పెడుతున్న మామగార్ని అడిగి లాభంలేదు. 'ఇంతలు' కన్నులున్న రాధ కూడా మీకు చెప్పకపోవచ్చు. గవాక్షంలో సవాలక్షు నక్షత్రాలున్నాయి. వాటిని గానీ, 'పదీ ముప్పయ్యేనిమిది' కారణాలు చెప్పగల గడియారాన్ని గానీ అడగండి. ఇహ ఆ కబుర్లు చాలు అంటుంది రాధచేతి ఆకుచిలక. 'అప్పుడే ఎక్కడ నేనింకా బారెడున్నా' అంటుంది మామచేతి పొగాకు చిలక. మరి మరి... ఏమనుకుంటోందో మరుని ర చిలక!

ఆ 'రాధా మాధవానికి' ఉగాది పునాది అయింది, పునర్నవమ్ అయింది.

ముఖచిత్రం: 'రాధామాధవం' చిత్రకారుడు: దశిక రామలింగేశ్వర రావు.

# ఇప్పుడు
## మీకు ప్రియమైన
## ఆరోగ్యముచేకూర్చే
# విటమినులు కలిసిన
## వాటర్‌బరీస్ కాంపౌండ్
## తీసుకోండి

పిల్‌ఫర్-ప్రూఫ్ కేసరి రంగుగల మూత ఉన్నదా అని చూడండి




భారతదేశమందు మిక్కిలి ప్రియమగు. అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్చబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి. కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.

కేసరి రంగు లేబిలు ఉన్నదా అని చూడండి.

# వాటర్‌బరీస్
విటమిన్
# కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.



దగ్గు, జలుబులకు క్రిసోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.

# తెలుగు వెలుగు

"తెలుగు వెలుగులు" శీర్షిక 1959 సెప్టెంబరు 9 వ తేదీ సంచికతో ఆరంభమైనది; 1961 మార్చి 15 వ తేదీ సంచికలో ప్రచురితమైన దానితో 75 మందిని పాఠకులకు పరిచయం చేసినది. ప్రస్తుతానికి ఇంతటితో ఈ శీర్షికను ఉపసంహరించడానికి నిర్ణయించాము.

దీనిని ఏణ్ణర్థంపాటు కొనసాగించాము. 75 మంది ప్రముఖుల స్వభావ స్వరూపాలను రేఖామాత్రంగా చిత్రించి పాఠకలోకానికి అందచేశాము. ఈ శీర్షికలో వెలువడిన తొలి తెలుగు వెలుగు ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి. ఆఖరి తెలుగు వెలుగు తెలంగాణా ఆఖరి ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు.

ఈ శీర్షికను ఏడాదిపాటు మాత్రమే నడపాలని ఆదిలో సంకల్పించాము. కాని, 75 వారాలు నడిచింది. "రానురాను వెలుగులను వదిలి పెట్టి మైనపు వత్తులను వేస్తున్నా"రని పాఠక మహాశయులు కొందరు చమత్కరించారు. తరువాత తరువాత "ఈ మైనపు వత్తులు కూడా కరువు అయ్యేరోజు కనిపిస్తుందేమో!" అన్నారు మరి కొందరు.

కాని, ఈ 75 మంది తెలుగు-వెలుగులు నిజంగా తెలుగు వెలుగులే. "కాదన్న మాదన్న" ఉండడు. వీరిలో కవిసార్వభౌములు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, శ్రీ దేవరకొండ వేంకటసుబ్బారావుగారు తప్ప మిగిలినవా రందరూ తెలుగునాటంతా నేటికీ తమ వెలుగును ప్రసరిస్తున్నారు; తెలుగు నేలను కాంతిమయం చేస్తున్నారు. వీ రందరూ యింకా అనేక కాలాలపాటు జాజ్జ్వల్యమానంగా ప్రకాశిస్తూ, వర్ధిల్లాలని కోరుతున్నాము.

తెలుగు వెలుగుల శీర్షిక అందరిచేత అసాధారణంగా అభినందనలు, ప్రశంసలు అందుకొన్నది. తెనుగుపత్రికామతల్లికకు ఈ రచనలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సమర్పించిన కొత్త పూదండ అనడం సాహసం కాదేమో!

ఈ రచనలు కొందరికి కోపతాపాలను, కొందరికి ఆనందాన్ని కలిగించాయి. దీనిలో విడ్డూరమేమీ లేదు గాని, విచిత్ర మేమిటంటే, ఎవరిని గురించి వ్రాయడం జరిగిందో వారే తమకు రుచించకపోతే, స్వయంగా కోపాన్ని, తాపాన్ని తెలియజేస్తూ సంపాదకునికి నిరసన లేఖలు వ్రాశారు. "దేశోద్ధారకుడు ఉంటే తమ కిలాటి అన్యాయం జరిగేది కా" దని వెనుకటి చుట్టరికాన్ని తిరగేసి, సాధించినవారూ లేకపోలేదు. అలా స్వయంగా వ్రాసుకొనడానికి ధైర్యం లేనివారు ఇతరులమీద వ్రాసిన దానిని నెపంగా పుచ్చుకొని దూషించారు. నచ్చినవారు మెచ్చుకొంటూ వ్రాశారు. ఇది సాధారణ విషయం.

ప్రతి వెలుగు వెంట నీడ ఉంటుంది. అలాగే ప్రతి వ్యక్తి ముఖంలోను సొట్టలూ, మచ్చలూ ఉంటాయి. వాటిని ఉన్న వాళంగా చిత్రించకపోతే అసలు వ్యక్తి కాక మరో వ్యక్తి రూపం తయారవుతుంది. వెనుకటికి మేఘవర్ణుడయిన ఒక మోతుబరి ఫోటోగ్రాఫరుతో అన్నాడట : ఫోటోగ్రాపులో ఎర్రగా పడేటట్లు చూడమని. వెలుగునూ, నీడనూ ప్రక్క ప్రక్కన చూపిస్తేనే రూపం కనబడుతుంది. లేకపోతే అందరూ ఒకే విధంగా కనబడతారు. "తెలుగు వెలుగులు" రచనలు ఈ ధోరణిలో వ్రాయబడినవి. అంతే కాని వేరే దురుద్దేశంతో కాదు. కాబట్టి దూషించినవారూ, భూషించినవారూ మాకు సమాన మిత్రులే అని భావిస్తున్నాము.

ప్రకటితమైన రచనలను పురస్కరించుకొని వచ్చిన విమర్శలు ఆలా ఉండగా, అర్హులైన వారిని కొంతమందిని వదలివేశామని కొంతమంది బాధను వెలిబుచ్చారు; వారి పేర్లను సూచించారు. కొందరు మహాశయులు స్వంతంగానే తమను గురించి వ్రాసికొని, ఇన్నో వెలుగు అని అంకె కూడా వేసి, బొమ్మతో సహా సంపాదకునికి పంపుకున్నారు. స్వంతంగా వ్రాసుకోలేని మహాశయులు ఇంకొకరి చేత వ్రాయించుకొని, ఒక చిన్న డెప్యుటేషన్‌తో సహా వచ్చి వ్రాత ప్రతిని దాఖలు చేసుకున్నారు. అలాటి వాటిని ప్రచురిస్తే, వారికీ మాకూ కూడా గౌరవం కాదని ప్రచురించలేదు. "తెలుగు వెలుగులు" శీర్షికకింద పడటం అంటే వారెంత ఘనతగా భావించారో దానివల్ల ప్రస్ఫుట మవుతున్నది. వెలుగు లేనివారు "తెలుగు వెలుగుల" ద్వారా వెలుగుదా మనుకున్నారని మా భావం కాదు. ఎందరో మహానుభావు లున్నారు. అందరికీ వందనాలు. అంతే కాక ఆల్డస్ హక్స్‌లీ చెప్పినట్లు ఏ వ్యక్తి కా వ్యక్తి ఒక జగత్తు. ఇక సెలవు.

---

ఏప్రిల్ 19-వ తేదీ సంచికలో పేరులేని కేవలం ఊహాజనితమైన తెలుగు వెలుగును గురించి హాస్య, వ్యంగ్యభరితమైన రచనను ప్రకటించదలచాము. ఆ రచనను పాఠకులెవ్వరైనా వ్రాస్తే బాగుండుననే ఉద్దేశంతో ఒక చిన్న పోటీ ఏర్పాటుచేశాము. రచన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఒక పేజీకి మించకూడదు. ఉత్తమరచన అని పేర్కొనబడి, ప్రచురితమైన దానికి రూ 50/—లు బహుమతి ఇవ్వబడుతుంది. వ్రాతప్రతి మాకు మార్చి 31-వ తేదీలోగా చేరాలి.

—సంపాదకుడు



# పెద్ద ఆకారాలూ చిన్న వికారాలూ

భానుమతీ రామకృష్ణ

చిన్నప్పట్నుంచీ నాకు బల్లి అంటే చెప్పడానికి వీల్లేనంత భయం. దాని ఆకారంచూస్తే పరమ అసహ్యం. కొందరికి యిదే విధంగా కప్పన్నా, ఉడతన్నా, బొజ్జెంకెన్నా, తొండన్నా భయమూ—అసహ్యమూ కలగడం కద్దు....కాని ఒకరి భయాన్నీ, అసహ్యాన్నీ మరొకరు అర్థం చేసుకోడానికే ప్రయత్నించకపోగా విడ్డూరంగా చూస్తారు. కొందరికి బల్లి అంటే భయంలేదు గనక ఎదుటి వాళ్లు బల్లిని చూసి భయపడుతున్నారని తెలిస్తే తాటాకులుకట్టి ఏడిపించి ఎగతాళి చేసి గోల చేస్తారు. యిందుకే పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణ సంకటం అన్నారు...

ఈ ప్రాణసంకటంతో బాధపడే ఎలుకల్లో నేనొకదాన్ని.....బల్లి నాకు పరమ శత్రువు.....అది వుంటే గదిలో కాలు పెట్టను. ఒకవేళ అంతగా ఆ గదిలోకి వెళ్లాల్సొస్తే పనివాళ్లను పిలిచి ఆ బల్లిని బయటికి తరిమించి అది వెళ్లిపోయిందో లేదో జాగ్రత్తగా చూసి మరీ లోపలడుగు పెడతాను.....యింక విధిలేని సందర్భాల్లో, పులిబోనులో తల దూర్చినట్లు భయపడుతూ, లోపలికెళ్లి అది వున్న వేపు వెళ్లకుండా అది ఏవైపు తిరుగుతుంటుందో చూసుకుంటూ, అదీ నేనూ రాహు కేతువుల్లాగా ఎదురు బదురుగా తిరుగుతుంటాం..

ఎంత దూరంలో వున్నాసరే దాని కదలిక నా కండ్లు కట్టేస్తుంది....అది కాస్త జరిగితే నాకు తెలీకుండానే నా శరీరం ఆటోమేటిగ్గా యింకో వైపు జరుగుతుంది.....కాని యింత కాన్సన్ట్రేషన్ దానిమీద వుంచినా, నా అవస్థ ఎదుటి వాళ్లు ఓపళంగా పసికట్టకుండా తంటాలు పడుతుంటాను.... ఎవరైనా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుండేప్పుడు, వాళ్ల తలకు సరిగ్గా పైన ఏదంతి మీదనో బల్లి పాకడం నా కంట పడ్డదో (సాధారణంగా నాకంటే పడుతుంది....) యిహ ఆ బల్లి నా నెత్తికి సరిగా పాకుతున్నంత భయమూ కంపరమూ కలిగేది....ఏ క్షణంలో వాళ్ల నెత్తిమీద పడుతుందోనని తల్లడిల్లిపోయేదాన్ని....ఉండబట్టలేక నా భయాన్ని వాళ్లకు తెలీనివ్వకుండా వుండేందుకు పైకి ఆముదం తాగినట్లు నవ్వుతూ.... "మీ నెత్తికి సరిగ్గా బల్లి వుంది"...అనేదాన్ని.... నాలాగే ఎదుట వాళ్లు కూడా చెంగున గంతేసి అవతలకు దూకుతారనే ఆశతో....అబ్బే....ఆలాంటిదేం జరక్కపోగా ఆ కూర్చున్న వాళ్లు అరయించి కూడా జరక్కుండా తలపైకెత్తి సూటిగా బల్లిని చూస్తూ...."అదేం చేస్తుందండీ పాపం! అది మోస్ట్ హారమ్‌లెస్ క్రీచర్" అనేవాళ్లు అలక్ష్యంగా నవ్వుతూ. ఈమాటే చిన్నప్పుడు నే చదివిన గరల్స్ స్కూలు మేష్టరమ్మ కూడా అన్నది.

ఓసారి క్లాసులో ఝాన్సీ లక్ష్మీబాయి ధైర్య సాహసాలను వర్ణించి పాఠం చెబుతోంది మా మేష్టరమ్మ. 'సడన్'గా నా ముందున్న బల్లకింద బల్లి కదులుతున్నట్లు అనుమానం కలిగింది...నా గుండె గతుక్కుమంది. యింక అక్కడ ఒక్క క్షణం కూడా కూర్చోలేక ముళ్లమీదున్నట్లు బాధపడ్డాను. భయంతో వణుకుతున్న నేను మేష్టరమ్మ చూడకుండా పక్క పక్కలకు జరగడం నా వరసలో కూర్చున్న పిల్లలు పసికట్టేశారు.

"ఏమోయ్ బల్లేమైనా కనిపించిందా!" అని రహస్యంగా అడిగి మెల్లిగా నవ్వుకున్నారు. నేను కూర్చున్న వరసలో కలకలం బయల్దేరడం మేష్టరమ్మ కంటబడ్డది...."

"ఏమిటది! పాఠం వినకుండా 'న్యూసెన్స్'



చేస్తున్నారు!..." అంటూ కోప్పడ్డది.

వెంటనే నా వరసలోవున్న ఒకమ్మాయిలేచి నిలబడి "మరే....మరే...మేష్టరమ్మగారండీ...మరే మరుండ్లా" ఆ పిల్లని మేమంతా "మరే" అని పిలుస్తుంటాం.

"ఇంక చాలు....కూర్చో...." అంటూ కోపంతో ఆ అమ్మాయిని కసిరింది మేష్టరమ్మ.

నే చెప్తానంటూ యింకో అమ్మాయి లేచింది.

"అసలే...మేష్టారమ్మగారండీ .... అసలే ... అసలుండ్లా...అసలామ్మాయికే....అసలూ...."

"ఆపు...నీ అసలూ పెసలూ...." కోపంతో అరిచింది మేష్టరమ్మ. క్లాసంతా ఒక్కసారి నిశ్శబ్దం అయిపోయింది.

కాళ్లకు వేసుకున్న 'హై హీల్స్' చెప్పులు టక్ టక్ మనిపించుకుంటూ పెద్ద రథంలాఒచ్చి మా ముందు నిలబడ్డది మేష్టరమ్మ. పిల్లలంతా బిగుసుకు పోయారు. నేను గుటకలు మింగడం మొదలెట్టాను.

"ఎందుకు భయపడ్డావ్ !.. ఏం జరిగింది చెప్పు... !" అంటూ కోపంగావున్న మేష్టరమ్మ నా బెత్తంతో ముందున్న బల్లమీద గట్టిగా బాదింది.

ఆ దెబ్బకు చెంగున మేష్టరమ్మ మీదికిదూకింది... అంతవరకూ నేను బల్లి అనుకుని భయపడ్డ కప్ప.

మేష రమ్మ కెవ్వున కేకేసి భయంతోనూ, అసహ్యంతోనూ కేర్ బార్ మంటూ గెంతడం మొదలెట్టింది. పిల్లలందరం నవ్వు బిగబట్టుకోలేక చచ్చాం. కప్ప మేష్టరమ్మను వదల్లా....ఒక్కసారి హై జంప్ వేసి తపక్కున మేష్టరమ్మ తల మీదికెళ్ళి చతికిల పడ్డది.

"అమ్మో" అంటూ మళ్లీ ఒక్క పొలికేక పెట్టి కంపరంతో ఎగరడం మొదలెట్టింది మాస్టరమ్మ.

ఆ ఎగరడంలో 'బేలెన్స్' తప్పి మేష్టరమ్మ తపక్కున కిందపడ్డది.

మేష్టరమ్మను కింద పడేసిన కప్ప ఒక్క గంతులో వెళ్లి మేష్టరమ్మ కుర్చీలో కూలబడ్డది. కిందబడ్డ మేష్టరమ్మ కాలుబెణికి లేవలేకపోయింది. క్లాసులోవున్న పిల్లలందరం కలిసి సాయంపట్టి లేవదీశాం. ఒకళ్లిద్దరు లేవదీసే శరీరంకాదు, మేష్టరమ్మది. నవ్వు ఆపుకోడానికి అవస్థపడుతున్న మా పిల్ల కోతుల ముఖాలుచూసి కప్పగంతుల్తో అలసిపోయి, ముచ్చెమటలు పట్టిన మేష్టరమ్మ ఒక్కింత సిగ్గుపడ్డది. మరుక్షణం తన సీట్లో కూర్చున్న కప్పను చూసి త్రుళ్లిపడి "అబ్బెబ్బెబ్బె.....ఛాఛాఛా.... ఛూఛూఛూ చూస్తారేం! నాసీట్లోనించి తీసేయండా డర్టీ క్రీచర్ని!" అంటూ కంపరంతో ఒళ్లు విదిలించుకుంది. మేష్టరమ్మ కప్ప దగ్గర కెళ్లడానికి భయపడుతున్న పిల్లలంతా ఒకళ్ల ముఖాలు యింకోళ్ళు చూసుకుంటూ నిలబడ్డారు....

* * *

కప్పంటే భయంలేని నేను వెళ్లి మేష్టరమ్మ సీట్లో కూర్చున్న కప్పను పెన్సిల్ తో బయటికి నెట్టేశాను.....మేష్టరమ్మ నన్ను చూసి ఆశ్చర్యంతో "నీకు కప్పంటే భయంలేదూ" అన్నది.... 'లే'దన్నాను.....

"మరెందుకు యిందాక భయపడి పక్కకు జరిగావు" అని అడిగింది....

"అదే .... అదీ .... మేష్టారమ్మగారండీ అదుండ్లా ఆ మ్మా యి కీ .... అదే...."ఆ 'అది' చెప్పేలోగా నేనే చెప్పేశాను బల్లి అనుకుని భయపడ్డానని.....



"వాట్! నీకు బల్లినిచూస్తే భయమా!...." అన్నది మేష్టరమ్మ నన్ను చూసి ఎగతాళిగా నవ్వుతూ.....

"అవును మేష్టరమ్మగారూ. మీకు కప్పంటే ఎంత బయ్యిమో అంత బయ్యం ఆమ్మాయికి బల్లంటే...." అంది ఓ పిల్ల.

"నాన్సెన్స్....బల్లినిచూసి భయపట్టం ఏమిటీ మీనింగ్ లెస్....పాపం అది మోస్ట్ హారమ్ లెస్ క్రీచర్. యింకా కప్పంటే భయపట్టంలో అర్థం వుంది. డర్టీ క్రీచర్...." అంటూ కుంటుతున్న మేష రమ్మవెళ్లి తనకు బదులు కాసేపు కుర్చీలో కూర్చున్న కప్ప వెళ్లిపోయిందో లేదో జాగ్రత్తగా పరిశీలించి మరీ కుర్చీ ఆక్రమించుకుంది. మళ్లీ పాఠం చెప్పడానికి మేష్టరమ్మ పుస్తకం తీసింది.... కాని దృష్టి పుస్తకంమీద నిలవలేదు.....తన చుట్టుప్రక్కలేవుంది చూపంతా....మళ్లీ ఆ కప్ప ఎక్కడ ఎగిరొచ్చి మీదపడుతుందోనన్న భయంతో పాఠం ముందుకు సాగలేదు. ఏ చిన్న కాగితం కదిలినా మేష్టరమ్మ అదిరిపడి పుస్తకంకింద పడెయ్యడంచూసి నవ్వు ఆపుకోలేక సతమతమయ్యాం....యింక లాభం లేదని గ్రహించిన మేష్టరమ్మ ఆ పూట తన కాలు నొప్పి సాకుతో మమ్మల్ని యిండ్లకు పంపించేసింది.... బ్రతుకుజీవుడా అంటూ బయటబడ్డ పిల్లలందరం ఒక్కసారి గొల్లున పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వాం....ఆ దెబ్బతో వారం రోజులు మా అందరికీ శలవిచ్చింది కప్ప....

యింట్లో యీ సంగతి విన్న నాన్న "ఛాఛా కప్పకు భయపడే టీచరు మీకేం చదువు చెప్తుంది. యింక నువ్వా స్కూలుకు వెళ్లనవసరంలా...." అని మర్నాడే నన్ను తీసికెళ్లి అన్నయ్య వాళ్ళు చదివిన ఎలిమెంటరీ స్కూల్లో చేర్పించాడు.

ఆడపిల్లలూ, మగపిల్లలూ కలిసి చదివే ఆ స్కూలు వాతావరణం అలవాటైందాకా అవస్థపడ్డాను....మేరుపర్వతంలాంటి మా మేష్టరమ్మను చూసివున్న నా కండ్లకు తిరగలి పిడిలాగా వున్న మా కొత్త మేష్టరు నలుసులా కనిపించాడు.

ఆస్కూల్లో చేరిన కొత్తల్లో ఒకరోజు మా క్లాసుకు హెడ్ మాష్టరొచ్చాడు. ఏనుగు పక్కన ఎర్రచీమలాగా కనిపించాడు హెడ్ మాస్టర్ పక్కన మా మాస్టరు....యిద్దరూ కొత్తగా చేరిన పిల్లల చదువు విషయం ఏదో మాట్లాడుతూ మా ముందు కొచ్చారు....

అంతకుముందు చాలాసేపట్నుంచీ నేనున్న వరసలో ఒక కుర్రాడు తన నిక్కరు జేబులోంచి బటానీలు తీసి తన చొక్కా జేబులో ఒక్కొక్కటీ వేస్తున్నాడు. అట్లా ఎందుకేస్తున్నాడో, దేనికేస్తున్నాడో మాకర్థం కాలేదు... యీలోపుగా హెడ్ మాస్టరు దగ్గరికి రావడంచూసి ఆ కుర్రాడు బటానీలు వెయ్యడం ఆపి బిగుసుకుపోయి నిలబడ్డాడు. బటానీలు పడడం ఆగిపోయేసరికి ఆ కుర్రాడి చొక్కా జేబులో ఏదో కదలడం మాతోబాటు హెడ్ మాస్టరు కంట కూడా పడ్డది....

"ఏమిట్రా అదీ!....నీ చొక్కా జేబులో ఏమిటి కదుల్తోంది!... వాటీస్ దట్!" అంటూ హెడ్ మాస్టర్ గర్జించాడు.

భయంతో ఆ కుర్రాడు ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. తక్షణం లాంగ్ జంప్ చేసి చెంగున హెడ్ మాస్టర్ మీదికి దూకింది, అంతవరకూ ఆ కుర్రాడి జేబులో బటానీలు తిన్న ఉడతపిల్ల...

హెడ్ మాస్టర్ ఒక్క వెర్రికేకపెట్టి పక్కనున్న మా తిరగలిపిడిమాస్టర్ని అమాంతంగా వాటేసుకున్నాడు....

చూస్తుండగానే మా మాస్టరు కనిపించలేదు....

కొండంత హెడ్ మాస్టర్ వేసుకున్న హెూల్డాల్లాంటి పెద్ద కోట్లో ఓమూల కదుల్తున్నాడు మా మాస్టరు....ఆ కుర్రాడి జేబులో ఉడతపిల్ల కదిలినట్లు..... అంతవరకూ హెడ్ మాస్టర్ ఒంటిమీద చెడా మడా ఎగిరి గంతు లేసిన ఉడతపిల్ల టింగురంగా అంటూ హెడ్ మాస్టర్ బట్టతలమీది కెగిరి కూర్చుని బటాణీలకోసం గీకడం మొదలెట్టింది....

యింక పిచ్చెత్తినట్టు కేకలు పెడుతూ, మా మాస్టర్ని పట్టుకుని కుప్పిగంతులెయ్యడం మొదలెట్టారు హెడ్ మాస్టర్.....

ఆ గంతుల్లో కూరగాయలుతెచ్చే సంచుల్లాగా



వున్న హెడ్‌మాస్టర్ కోటు జేబుల్లో ఏ జేబులోనో మా మాస్టర్ తల స్టకప్పయింది....

వూపిరాడక కీక్.....కీక్...అంటం మొదలెట్టాడు మా మాస్టరు .... నెత్తిమీద గంగలాగా కూర్చున్న ఉడత పిల్లతో వెర్రులెత్తి శివతాండతం చేస్తున్న హెడ్‌మాస్టర్ మా మాస్ట రవస్థ గమనించే స్థితిలో లేడు.

ఏం చేయాలో తెలీక అంతవరకూ గుడ్లప్పజెప్పి మాస్టర్ల దురవస్థ చూస్తూ నిలబడ్డ మా క్లాసు పిల్లల్లో ఎవరో ఒకపిల్లాడు ధైర్యంచేసిముందుకొచ్చి హెడ్‌మాస్టరుతల గోకుతూ కూర్చున్న ఉడత పిల్లనుపట్టి తీసేశాడు....ఆ చేత్తోనే మా మాస్టర్ను కూడా హెడ్‌మాస్టర్ హాల్డాల్ కోటు జేబులోంచి బయటికి లాగేశాడు....

ఆయాసపడుతూ బీభత్సంగా చెమటలు కక్కుతున్న హెడ్‌మాస్టర్ ఒకసారి క్లాసంతా కలయ చూశాడు. పక్కకు తిరిగి నవ్వు ఆపుకోడానికి ప్రయత్నిస్తున్న పిల్లలందర్నీచూసి అవమానంతోనూ, కోపంతోనూ "ఫూల్స్. యిడియట్స్ స్టుపిడ్స్....బుద్ధివుండక్కర్లా ఉడతల్ని తెస్తారా క్లాస్‌కు! ...... ఇకమీద ఎవరైనా ఉడతల్నితెస్తే డిస్మిస్" అని మండిపడుతూ వెళ్లిపోయాడు హెడ్ మాస్టర్....

"చిత్తం చిత్తం...." అంటూ నీరసంగా వాకిలిదాకా నడిచాడు హెడ్‌మాస్టర్ జేబులో నగం చచ్చిపోయిన మా మేష్టరు....

తర్వాత మా మేష్టరే చెప్పాడు. హెడ్‌మాస్టరుకు ఉడతంటే చచ్చేంతభయం అనీ, స్కూల్లో ఉడత లెక్కువగా వున్నాయనే భయంతో ఉడతల్నిబట్టే వాళ్ళను పిలిపించి తన రూముచుట్టూ అంగరక్షకుల్లాగా వుంచాడనీ చెప్పాడు.....యింక హెడ్ మాష్టర్ను కట్టేశారు మా క్లాసు పిల్లలు....హెడ్ మాస్టరు పోతుంటే దూరాన్నుంచే "ఉడతా ఉడతా ఊచ్ సన్నబియ్యం సాచ్" అంటూ గోలచేసేవాళ్లు... నాకు నవ్వొచ్చింది హెడ్‌మాస్టర్ అవస్థకు....కాని హెడ్‌మాస్టర్ నాకంటే ఒక విధంగా అదృష్టవంతుడు..... ఉడతలు యింట్లో మకాం పెట్టవు... వాటిలాగే యీ బల్లులు కూడా ఏ అరణ్యాల్లోనో వుండకుండా మనుషుల్తోబాటు యిండ్లలోవుంటూ అన్ని గదుల్లోనూ నిర్భయంగా తిరగడమే నా ప్రాణానికి సంకటంగా తయారయింది....

నేను పగలంతా బల్లుల్ని వేటాడితే, బల్లులు రాత్రుళ్ళు కల్లో నన్ను వేటాడేవి..

కల్లో కనుపించే బల్లులు మామూలు బల్లులు కావు....మనిషి సైజు బల్లులు. నన్ను కొరకొరా చూసేవి...ఏమిటో మాట్లాడుతూ తిట్టేవి నన్ను... ఎగతాళిగా నవ్వుతూ వెక్కిరించేవి....చివరకు కోపంతో నామీద దూకడానికి ప్రయత్నించినప్పుడు కెవ్వుమని అరిచేదాన్ని.....నా కేకలకు యింటిల్లిపాదీ నిద్ర లేవడమే గాకుండా యిరుగు పొరుగు వాండ్లు కూడా లేచి లైట్లేసుకుని పరుగెత్తుకొచ్చేవాళ్ళు మా యింట్లో దొంగలు పడ్డారేమోని....

అసలు సంగతి అమ్మా నాన్నా వాళ్ళ చెప్పగానే "భలే పిల్లే" అని నవ్వుకుంటూ వెళ్లిపోయేవాళ్ళు.

యింక ఆ రాత్రి నాకు నిద్రపట్టేదికాదు— కన్ను మూస్తే దూకుతామంటూ కాచుకోనుండేవి నా కల్లో బల్లులు....

"నిద్ర పోకుండా ఏమిటీ అవస్థ....పోనీ బల్లిని తీసుకొచ్చి ఒకసారి దాని నెత్తిన పడేస్తే భయం పోతుందేమో" అనేవాడు విసుగెత్తిన నాన్న.... "అయ్యయ్యో యింకేమైనా వుందా! భయంతో గుండె ఆగిపోదూ!....అదేపోతుంది పెద్దయ్యేకొద్దీ" అనేది అమ్మ....

అమ్మ చెప్పినట్టు పెద్దయ్యాను. పెళ్లయింది. పిల్లవాడు కూడా పుట్టాడు....కాని నా బల్లి భయం మాత్రం పోలేదు....

ఒకరోజు మామూలుగా పూజకు కూర్చున్నాను. ఎప్పుడు చేరిందో నా కెదురుగావున్న గోడమీద బల్లి.....గుండె జల్లుమంది. అది పూజగది. లోపలికి పనివాళ్ళ రాకూడదని మా అత్తగారి శాసనం ఏం చేసేది!.....ఆపూట పూజ 'సింపుల్'గా చేసి మా అత్తగారు ఆరగింపు తెచ్చేలోగానే బయట బడ్డాను.

"ఏమిటే యీ పూట అంత తొందరగా ముగించావు పూజ! షూటింగ్ ఏమైనా వుందా" అని అడిగారు మా అత్తగారు.

"అబ్బేలేదు....రేపు శుక్రవారం ఎటూ చాలాసేపు చేయాలిగా పూజ! యీ పూట మిగతా పన్లు చూద్దామని..." అంటూ తప్పుకున్నాను..... మర్నాడు ప్రొద్దుటే పూజగదికొచ్చి ఒకసారి నాలుగు వైపులా పరకాయించి చూశాను. బల్లి కనిపించలేదు....పోయింది. అబ్బ ప్రాణం కుదటపడ్డది... అయినా పూజ గదిలో ఎలుకలు తిరగడం చూశాను గాని బల్లిని ఎప్పుడూ చూళ్లేదు. బల్లి కనిపించక పోయేసరికి నిర్భయంగా పూజకు సన్నాహాలు చేసుకుని కూర్చున్నాను....మా అత్తగారు కూడా నాకు కొంచం దగ్గర్లో తలుపు కానుకుని కూర్చున్నారు.

గణపతికో టెంకాయకొట్టి, అమ్మవారికి కూడా





ఆరగింపుపెట్టి కుంకుమార్చనకు కూర్చున్నాను.

'ఓం శ్రీమాత్రే నమః ఓం శ్రీ మహారాజ్ఞైన మః, ఓం శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః. ఓం చిదగ్ని కుండ సంభూతా....భూ...తా' నా ముందున్న మీనాక్షి అమ్మవారికి ముద్దుగా కట్టిన పట్టుపావడా లోంచి తొంగిచూసింది బల్లి.....పై ప్రాణం పైన్నేపోయింది.

పీటతోసహా ఎక్స్‌ప్రెస్ స్పీడ్‌లో జర్రున వెనక్కి జరిగివెళ్లి మా అత్తగారిమీద పడ్డాను.....''ఓయమ్మ ఏమిటే.... ఏమైందే...'' అంటూ ఖంగారుపడుతూ మా అత్తగారు భయంతో వణుకుతున్న నా భుజాలుపట్టి కుదిపారు. యింక చెప్పక తప్పలేదు... అమ్మవారి పావడమీదున్న బల్లిని చూపించాను.

ఓసి నీయింట వాన గురవా. బల్లిని చూశా యింతసేటు భయపడ్డావ్'' అంటూ పడీ పడీ నవ్వారు మా అత్తగారు...

ఈ లోపుగా ఆఫీసుకు బయల్దేరిన మావారు దేవుడికి నమస్కరించుకోడానికొచ్చారు.

''ఏం బల్లేనా! హతోస్మి...యిక్కడా చేరాయా! చేరకేంజేస్తాయ్! యీ పూజగదిలో ఒక్క మగదేవుడు కూడా లేకపోయే...అంతా ఆడ గేంగుతోనే నిండి పోయింది. అందుకే మగదేవుళ్లకు కోపంవచ్చి బల్లుల్ని ఒదిలారు... ఆడవాళ్లు కూడా దేవుళ్లే! ఆడవాళ్లే దేవుళ్లైతే బల్లులెందుకు వస్తాయి'' అంటూ పాడి.

''ఓ వెంకటేశ్వరా శంభో శంకరా బల్లులు రాకుండా చేసే శక్తి మీ భార్యల దగ్గర లేదని తేలిపోయింది. మీరైనా యీ బల్లుల్ని యికమీద యీ గదికి రాకుండా చూస్తేనే మీ భార్యలకు ఎప్పుడైనా ఓ టెంకాయ చిప్ప దొరుకుతుంది...లేదంటే పూజా గది బంద్'' అని మా వారు నన్ను కాసేపు ఏడిపించి అమ్మవారి పావడామీదున్న బల్లిని బయటికి తరిమేసి, ''యింక నీ పూజ స్తిమితంగా కానీ....'' అంటూ ఆఫీసు కెళ్లిపోయారు.

''ఓసి నీ భయం బంగారంగానూ....ఎంత భయమే....'' అంటూ మళ్లీ ముందుకుపడి నవ్వారు మా అత్తగారు...ఏ మూలనుంచో 'మ్యావ్' మని సన్నగా వినిపించింది....

'సడన్' గా మా అత్తగారి నవ్వు ఆగిపోయింది. ... ఉన్నట్లుండి మా అత్తగారి ముఖం ఎందు కల్లా సీరియస్‌గా మారిపోయిందో నా కర్థం కాలేదు. . . మళ్లీ పూజకు కూర్చున్నాను.

కిచకిచమంటూ అటకమీద శబ్దం వినిపించింది .... మరుక్షణం రెండు ఎలుకలు క్రిందికి దూకాయి. వాటి వెనకాలే మా అత్తగారి ముందుకు దూకింది వో గిండుపిల్లి ..

''వోయమ్మ చచ్చానేవ్ ! .... '' అంటూ ఒక్క వెర్రికేక పెట్టి అమాంతంగా వచ్చి నామీద పడ్డది భయంతో కండ్లు గట్టిగా మూసుకున్న మా అత్తగారు .... మా అత్తగారికి పిల్లి అంటే అంత భయమని నా కంతవరకూ తెలీదు ...... నవ్వాపుకోడానికి అవస్థ పడ్డాను .... పిల్లి వెళ్లి పోయి అరగంటయినా మా అత్తగారు ఆ భయంతో నన్ను వదల్లా .... అందుకే కాబోలు వంటింట్లో ఆవిడ చుట్టూ ఎలకబోన్లుండేవి. ప్రతిరోజూ గది కొక ఎలకబోను పెడుతుండేది ...

ఆరోజు నా పూజకు అన్నీ విఘ్నాలే .... నేను బల్లిని చూసినరోజు ఏదో ఒక హడావిడి జరిగి చేస్తున్న పనికి 'బ్రేక్' పడేది.

ఒకసారి రికార్డింగ్ జరుగుతోంది. మైక్ ముందు కూర్చుని పాడుతున్నాను. ఎప్పుడొచ్చిందో, ఎట్లా వచ్చిందో నా ముందున్న మైక్ వెనక నుంచి తొంగిచూసింది, బల్లి .... గుండె ఝల్లు మంది. పాడుతున్న నా గొంతు భయంతో బిగుసుకుపోయి 'కీక్‌కీక్' అంటం విన్న సౌండ్ యింజనీర్ 'కట్‌కట్' అంటూ గోలెత్తేడు. బలం అంతా కూడగట్టుకుని ప్రాణం అరచేతిలో పెట్టుకుని ఒక్క దూకులో ఆ కుర్చీలోంచి బయటపడ్డాను. నాతోబాటే బల్లి కూడా అవతలికి దూకి వెళ్లిపోయింది .....

''ఎన్నమ్మా ఎన్న ఆచ్చి!''.... అంటూ ఖంగారు పడుతూ వచ్చిన సౌండ్ యింజనీర్‌కు ఏం చెప్పాలో తెలీక అలాంటి సందర్భాల్లో నా మామూలు 'ఆముదం నవ్వు' తో 'ఒణ్ణుమిల్లె' 'ఒణ్ణుమిల్లె' అన్నాను.

''ఏమిటి ! బల్లేనా !'' అంటూ వచ్చారు మా వారు కూడా. చచ్చాను. ఈ లో గా ఏమిటేమిటంటూ ఆర్కెస్ట్రావాళ్లంతా కూడా చుట్టూ చేరారు.

చెప్పొద్దని కండ్లతో బ్రతిమాలుకున్నాను మావార్ని. అబ్బే .... ధర్మరాజును చంపి పుట్టారు మావారు. అబద్ధం చెప్పరు. ధర్మరాజైనా సంస్కృతంలో సగం చెప్పాడు. కాని మావారు అచ్చ తెలుగులో నా భయం సంగతి పూర్తి నిజం చెప్పారు. అంతా ఒక్కసారి గొల్లున నవ్వారు. నా ప్రాణం చచ్చిపోయింది.

''అడెడే .... ! పల్లి అన్నా యివ్వళవు భయమా ! అదెన్నపణ్ణాం అమ్మా ! 'మోస్ట్ హారబుల్ లెస్ క్రీచర్ ....'' అని మా సౌండ్ యింజనీరు తేలిగ్గా నవ్వుతూ మైక్ దగ్గరికెళ్లి కర్చీఫ్‌తో మైక్ మీద మన్ను దులిపాడు. తక్షణం జటాయువు లాంటి రెక్కలొత్తి 'ఏరోప్లేన్' లాగా ఎగిరి సౌండ్ యింజనీరు రెండెకరాల నుదురుమీద 'సేఫ్' గా 'లేండ్' అయింది వో బొద్దెంక.

కెవ్వున కేకేసి భయంతోనూ, అసహ్యంతోనూ మెలికలు తిరిగి వెల్లెకిలా పడ్డాడు సౌండ్ యింజనీరు.

'కెకెకెకె .... తెతెతెతె .... అడి .... పుడి ....కడి' యిత్యాది సంధిమాటల్తో కాళ్లు చేతులు తపతప కొట్టుకుంటున్న సౌండ్ యింజనీరు అవస్థ ఏమిటో తెలీక స్టన్నయి చూస్తూ వుండిపోయాం.

చటుక్కున మావారు తన చేతులో ఉన్న కర్చీఫ్‌తో సౌండ్ యింజనీరు నుదురు ఎద్దులా దున్నుతున్న బుజ్జెంకను తరిమేశారు. అప్పుడు నా కర్థమైంది. ఆ బొజ్జెంకెను మైక్‌మీదే చూసే బల్లి పరుగెత్తుకొచ్చి ఉంటుంది. ఒళ్లు జలదరించింది. చెమటలు కారుతున్న సౌండ్ యింజనీర్ను చూసి నవ్వు ఆపుకోలేక ఆర్కెస్ట్రా వాళ్లంతా రికార్డింగ్ రూము బయటికి పరుగెత్తారు. తర్వాత తెలిసింది. సౌండ్ యింజనీరుకు బొజ్జెంకంటే చచ్చేంత భయం అనీ, దాన్ని తమిళంలో ''కరుప్పాంబూచి'' అంటారనీ, దానిపేరు చెబితేనే అదిరిపడతాడనీ, అందుకే ఆ సౌండ్ యింజనీర్ను అంతా ''కరుప్పాంబూచి'' అంటూ చాటుగా గోల చేస్తూంటారనీ . . . . . పాపం, అతన్ని చూసి నాకు జాలివేసింది. అలాంటి వాళ్ల అవస్థ నే నొక్కదాన్నే అర్థం చేసుకోగలనేమో అనిపించింది.

ఒకసారి ఎవరిదో పిక్చరు షూటింగుకు వెళ్లాను.

అది ఒక బ్రహ్మండమైన అరణ్యం సెట్టు. ఒట్టి అరణ్యం మాత్రమే కాదు. వో పాడుబడ్డ దేవాలయ మంటపం దాని చుట్టూ అరణ్యం. ఆ సెట్టు నేను పనిచేసే ఆ పిక్చరుకోసం వేసింది కాదు. అయినా ఆ సెట్టు ఆ సంవత్సరం ప్రొడ్యూసర్ల పాలిటి కామధేనువూ, కల్పవృక్షమూ అయి కూర్చుంది. ఆ సెట్లో షూట్ చేయని ప్రొడ్యూసర్ లేడు. ఆ సంవత్సరం తయారయిన అన్ని పిక్చర్లలోనూ, అరణ్యరోదన ఘట్టాలన్నీ అక్కడే తీశారు. ఒకవేళ ఎవరి పిక్చర్లోనైనా అరణ్యం సీను లేకపోతే కొత్తగా కల్పించి సీన్సు వ్రాయించి మరీ షూట్ చేశారా అరణ్యంలో. యిండస్ట్రీలో ఉన్న ఆర్టిస్టులంతా ఆ అరణ్యంలో ఏ కొమ్మో పట్టుకుని కాసేపు ఏడ్చి వెళ్లారు.

ధర్మరాజును యక్షుడు ప్రశ్న లడిగింది

ఆ అరణ్యంలోనే—రాముడు సీతకోసం వాపోయింది ఆ దండకారణ్యంలోనే. వ్యాసులు భారతం వ్రాసిందీ ఋషులు తపస్సు చేసిందీ కూడా ఆ నైమిశారణ్యంలోనే. అదే కథానాయకి కష్టాలకు కాకులు దూరని కారడవి. అదే దార్లుకొట్టే దొంగలకు చీమలు దూరని చిట్టడవి అయింది. ఆ అరణ్యమే స్టూడియోలో లేకుండా ఎక్కడైనా బయటున్నట్లయితే దలైలామా కూడా ఆ అరణ్యంలోంచే వచ్చేవాడు ఇండియాకు.

ఆ అరణ్యం యింకా కొంతకాలం ఆ స్టూడియోలో ఉంటే దాని ప్రతిభ స్థలపురాణంలో కెక్కేదే. కాని పాములు, తేళ్ళు, ఎలకలు, పంది కొక్కులు యిత్యాది స్టుడియో అడివిమృగాలు చేరుతున్నాయనీ, యింక కొన్నాళ్ళు ఉంచితే పులులూ, సింహాలూ కూడా చేరవచ్చని భయపడ్డ ఆ స్టుడియో యజమాని ఒక సంవత్సరంగా ఉన్న ఆ అరణ్యానికి పుట్టినరోజు పండగ చేసి ఆ సెట్టు పీకేయించాడు

అది తీసేసేముందు ఆ చరిత్ర ప్రసిద్ధిగాంచిన అరణ్యానికి నేనూ వెళ్ళాను—కాస్సేపు ఏడ్చి రావ డా ఒరోజు నాతోబాటు నా ఇష్టసఖి పాత్ర ధారి ఒరో అమ్మాయి కూడా ఉంది. ఒక సం ్రంగా పాతుకుపోయిన ఆ అరణ్యం చిన్న చిన్న వరాసుల్తో సజీవంగా కనిపించింది.

బడ్డ దేవాలయమంటపంలో మొదటి షాటుకు ఏర్పాటు చేశారు. 'రెడీ .... సైలెన్స్' అంటూ అరిచాడు డైరెక్టర్.

'షాట్' కోసం నా ఇష్టసఖి మేకప్ సరిజేసుకుంటుంటే మామూలు ప్రకారం నా కండ్లు మంటపం స్తంభాలమీది కెళ్ళాయి ఏదో పురుక్కోసం చరచర వస్తోంది నేనున్న వైపుకే పెద్ద బల్లి. ప్రాణం ఎగిరిపోయింది. 'యాక్షన్' అంటూ అరిచాడు డైరెక్టరు. యాక్షన్ లేదూ, పాడూ లేదు, ఒక్కదూకులో వచ్చి అరణ్యంలో పడ్డాను.

''కట్ కట్ కట్ ఏమిటమ్మా ఏమైంది'' అంటూ పరుగెత్తుకొచ్చాడు డైరెక్టర్. ఇంతలో ఎవరో ''పాము ఏమో'' అన్నారు. అంతా 'పాము పాము ఎక్కడ, ఎక్కడ వెదకండి'' అంటూ మంటపములోకి పరుగెత్తారు డైరెక్టర్‌తో సహా.

''ఏమమ్మా, పామును చూశారా ! ఏవైపు వెళ్ళింది'' అంటూ నా ఇష్టసఖి వణుకుతున్న నన్ను చూసి ఆతృతగా అడిగింది.

అటూ, యిటూ చూసి మెల్లిగా ''పాము కాదు బల్లి . . '' అన్నాను

ఒక్కసారి గొల్లుమని నవ్వింది నా ఇష్టసఖి.

ఆ అమ్మాయి నవ్వు విని పాముకోసం వెతికే వాళ్ళంతా పరుగెత్తుకు వచ్చారు.

''ఆమెకు బల్లిని చూస్తే భయంలాగుందండీ. అందుకే అట్లా పరుగెత్తుకొచ్చారు'' అంటూ మళ్ళీ ంగబడి నవ్వింది. అందరూ ఆ అమ్మాయితో తి కలిపారు నా ళ్ళు మండింది. ఎవరి భయం వాళ్ళది ళ్ళకెం తెలుసు !

మూతి ముడుచుకున్న నన్ను చూసి డైరెక్టర్ ''అబ్బే అదేం చేస్తుందమ్మా. మోస్ట్ హారమ్‌లెస్ క్రీచర్ .... ఉండండి. దాన్ని అక్కణ్ణుంచి తరిమేయిస్తాను'' అంటూ అందరూ ఆ బల్లి వెనకాల పడి దాన్ని అరణ్యంలోకి తరివారు.



# పెద్ద ఆకారాలూ చిన్న వికారాలూ

యింకా భయపడుతూనే మంటపం దగ్గరికెళ్ళాను.

''ఫర్వాలేదు రండి, బల్లి వెళ్ళిపోయింది. నేనున్నానుగా, భయంలేదు రండి'' అంటూ నా ఇష్టసఖి నా చేయి పట్టుకుని మంటపం దగ్గరికి లాక్కెళ్ళింది. అంతవరకూ నా దగ్గర మాట్లాట్టానికి భయపడ్డ ఆ అమ్మాయికి బల్లి భయంతో నేను ఒక్కసారిగా లోకువైపోయాను. చీ చీ యీ బల్లి నా పరువు తీస్తోంది అనుకుని మనసులో బాధ పడ్డాను.

''ఎస్, రెడీ .... స్టార్ట్'' అంటూ కేకేశాడు డైరెక్టర్. చుట్టూ నోసారి కలియచూసి కుదుట పడ్డ మనసుతో 'యాక్షన్' ఏమిటో అప్పుడాలో చించడం మొదలెట్టాను.

నా ఇష్టసఖి కష్టాల్లో ఉన్న నాకు (కథానాయిక) ధైర్యం చెప్పే షాటు అది.

''యాక్షన్'' అరిచాడు డైరెక్టర్. విచారంగా కూర్చున్నాను. నా ఇష్టసఖి డైలాగ్ మొదలెట్టింది.

''అమ్మా అధైర్యపడకండి .... మీకు అండగా నేను . .'' యింకా డైలాగ్ పూర్తికాలేదు. ఉన్నట్లుండి ఏవైపునుండి దూకిందో బ్రహ్మాండమైన పోతులాంటి తొండ .... ఒక్క దూకు దూకి నా ఇష్టసఖి జడ పట్టుకుంది గట్టిగా

''బాబోయ్'' అని ఒక్క గావుకేక పెట్టి భయంతో నన్నొచ్చి కావలించుకో బోయింది నా ఇష్టసఖి. బల్లి గాభరాలో వున్న నేను తుళ్ళిపడి వెనక్కు జరిగాను. అంతా 'కట్ కట్ కట్' అని కోరస్ పాడుకుంటూ మా దగ్గరికి పరుగెత్తుకొచ్చారు.

భయంతోనూ, అసహ్యంతోనూ చెమటలు కక్కుతున్న నా ఇష్టసఖి రెండు చేతులూ బార

ఎవరు పట్టుకున్నా నిలవకుండా ఎగరడ లెట్టింది.

''అరెరె ! తొండ పట్టుకుంటె ఏడువాళ్ళ గాడిదలు ఒక్కసారి అరవాలంటారే ! యిప్పుడెట్లా ! 'చుట్టుపక్క లెక్కడైనా ఉన్నాయా' గాడిదలు ? .... '' అన్నాడు హడావిడి పడుతున్న అసిస్టెంట్ డైరెక్టర్ అవతారం.

''ఆ .... ఉన్నాంగా ! మనం అంతా ఒక్కసారి అరిస్తే సరి'' అన్నాడు షూటింగ్ జరుగలేదని ఒళ్ళు మంటగా ఉన్న డైరెక్టర్ విరాకు పడుతూ.

''లేదు సార్ .. యిది నేననటం కాదు. పెద్దవాళ్ళన్నదే .... '' అంటూ సమర్థించుకున్నాడు అవతారం. ముచ్చెమటలు పోసి మూర్ఛపోవడానికి సిద్ధంగా ఉన్న నా ఇష్టసఖి జడ తొండ విడిచి పెట్టలేదు యింకోవైపు కూతురు అవస్థకు ఏడుపులూ, పెడబొబ్బలూ పెడుతూ ఎగురుతోంది నా యిష్టసఖి తల్లి .... జడను పైకెత్తి పట్టుకున్న డైరెక్టరు జడ నొకసారి గట్టిగా విదిలించాడు . . తొండ వదల్లా. కర్రతో అదిలించారు. కదల్లా.

''నేను చెప్పలేదా సార్ ! లాభంలేదు. జడ కత్తిరించాల్సిందే'' అన్నాడు అతివాగుడు అవతారం.

''నీ మొఖం యీడ్చ .... ఎంతమాటన్నావ్ ! ... నీ జుట్టే కత్తిరించుకో, నీ తలే బోడి కొట్టించుకో'' అంటూ అవతారంమీద విరుచుకు పడ్డది నా ఇష్టసఖి తల్లి. తక్షణం వెనక్కు తగ్గి గుంపులో కలిసిపోయాడు అవతారం

ఆవిడ గొడవకు నాకు నవ్వుతోపాటు పటుక్కున స్ఫురణ కొచ్చింది.

''ఆ అమ్మాయి జడమీద పూలకు బదులుగా పెట్టుకున్న సీతాకోక చిలకను తీసిపారేయండి'' అన్నాను. వెంటనే ఆ అమ్మాయి జడమీదున్న ప్లాస్టిక్ సీతాకోకచిలుకను పిన్నుతో సహా లాగి అవతల పారేశాడు డైరెక్టర్. తక్షణం ఆ చిలకతో పాటే జడ వదలిపెట్టి కిందికి దూకింది తొండ.

''అరె !'' అంటూ అందరూ ఆశ్చర్యంగా నావైపు చూశారు.

(64 వ పేజీ చూడండి)

న్యూ ఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణ

# మేరునగధీరుడు పండితపంత్ చరమయాత్ర: సజలనయనాలతో ప్రజల వీడ్కోలు



మేరు నగధీరుడు పండిత గోవింద వల్లభ పంత్ కన్ను మూయడంతో భారతదేశం దుఃఖసాగరంలో మునిగిపోయింది. నిజాయితీ, సత్ప్రవర్తన, నిస్వార్థ దేశసేవ వారిని అంతటి మహా నాయకుణ్ణి చేశాయి.

పండిత పంత్ దక్షతగల పరిపాలకుడు; పెద్ద మనిషి. అంతస్తు మారినా, పూర్వపు మిత్రులను జ్ఞాపకం ఉంచుకొనడంలోనే వారి సద్గుణ సంపత్తి ద్యోతకమయ్యేది.

పంతుజీ మహా రాష్ట్రుడు. వారి పూర్వీకులు అల్మోరా పర్వత ప్రాంతాలకు తరలి వచ్చారు. హిందూ ముస్లిం సమష్టి సంస్కృతికి గంగా మైదానంలో ఢిల్లీ—లక్నో మండలం పట్టుకొమ్మ. ఆ సంస్కృతికి పంత్ చిహ్నంగా వుండేవారు.

"నైనిటాల్‌కు చెందిన యువక న్యాయవాది" ఒకరు కాంగ్రెసులో చేరటం ఈ నాటికి కొందరికి జ్ఞాపకం ఉన్నది. ఇది జరిగి అప్పుడే 37 సంవత్సరాలైంది. శాసన నిర్మాణ సంస్థలలో ప్రవేశించవచ్చునా, లేదా అనే విషయమై గాంధీజీతో అభిప్రాయ భేదంవచ్చి పండిత మోతీలాల్ నెహ్రూ 1924 లో ఆయనతో తెగతెంపులు చేసుకుని స్వరాజ్య పార్టీని నెలకొల్పిన రోజులవి. స్వరాజ్యపార్టీ వారు చేసే పనులనుగాని, చెప్పే మాటలనుగాని పట్టించుకోనవసరంలేదని గాంధీజీ "మార్పు కూడదనే వారికి" సలహా యిచ్చారు. "ప్రశాంతంగా, నిజాయతీతో, నిరాడంబరంగా పని చేయడంలో విశ్వాసం ఉన్న కార్యకర్తలందరికి ఖద్దరు, జాతీయ పాఠశాలలు చాలని" గాంధీజీ అన్నారు. వ్యర్థమైన చర్చలకు స్వస్తిచెప్పి "శాసన సభలలో ప్రవేశించటం సహకార నిరాకరణ సిద్ధాంతానికి ఏమాత్రం విరుద్ధం కానట్లు నిరూపించనున్నా"మని పండిత మోతీలాల్ నెహ్రూ వేరొక వంక ప్రకటించారు.

స్వరాజ్యపార్టీని ఏర్పాటు చేసిన తరువాత లక్నోలో తమ తరఫున పని చేయగలిగిన వారొకరు పండిత మోతీలాల్‌కు కావలసి వచ్చారు. చిరు నవ్వు చిందిస్తూ నును సిగ్గుతోఉన్న పండిత పంత్ ను ఆయన పసిగట్టారు. పంత్ అప్పటికే వాదనలో దెబ్బకు దెబ్బ తియ్యటంలో దిట్ట అనిపించుకున్నారు. స్వరాజ్యపార్టీ కార్యకర్తల సమావేశంలో తమకు తోడుగా ప్రసంగించవలసిందని పండిత మోతీలాల్ ఆయనను కోరారు. పండిత పంత్ ప్రసంగించటమేమి, నాయకుడుగా ఎన్నిక కావటమేమి ఒక్క సారిగానే జరిగాయి. ఇది 1924 సంవత్సరంలో మాట. అప్పటినుంచి పండిత పంత్ ఆఏటి కాయేడు బలం పుంజుకున్నారు. ఉత్తరప్రదేశ్ శాసన సభలో తమ సామర్థ్యాన్ని నిరూపించుకొని స్వర్గీయ భూలాభాయ్ దేశాయ్‌తోపాటు కేంద్రంలో అడుగుపెట్టారు. ప్రభుత్వ ఆర్థిక విధానంపై ఆయన మండిపడేవారు. నాటి ఆర్థిక మంత్రి సర్ జేమ్స్ గ్రిగ్స్ ఆయనంటే హడలెత్తిపోయేవారు. సర్ జేమ్స్ తమ స్వీయ చరిత్రలో ఇలా వ్రాసుకున్నారు. "కేంద్ర శాసన సభలో కాంగ్రెసు పార్టీతో మంచిగానే నెట్టుకు రాగలగాను. అందునా విభిన్న పంథాలలో నాయకులైన త్రిమూర్తులు భూలాభాయ్ దేశాయ్, పండిత గోవింద వల్లభ పంత్, సత్యమూర్తి గారలతో ఇబ్బంది లేకుండానే వ్యవహరించగలిగాను."

భారత ప్రభుత్వం 1935 సంవత్సరం చట్టాన్ని అమలులోకి తెచ్చిన తరువాత పండిత పంత్ అప్పటి సంయుక్త రాష్ట్రాలకు (ఇప్పటి ఉత్తర ప్రదేశ్) తిరిగివెళ్ళి, ముఖ్యమంత్రి అయ్యారు. వారినిగూర్చి సర్ జేమ్సు మరొకచోట ఇంకా ఇట్లా వ్రాశారు: "ఆర్థిక వ్యవహారాలలో, రాష్ట్ర ప్రభుత్వాలతో. ముఖ్యంగా పెద్ద రాష్ట్రాలతో నాకు చాలా పని ఉండేది. కాంగ్రెసునాయకు లందరిలోను శ్రీ రాజగోపాలాచారి, పండిత పంతు ఆర్థిక మంత్రులుగా చూపిన సామర్థ్యం అనుపమానమైనది."

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగాఉండి అధికారంలోను, ప్రతిష్ఠలోను పండిత పంత్ ఉన్నతశిఖరాన్ని అందుకున్న తరుణంలో న్యూఢిల్లీ వచ్చి తమ మంత్రివర్గంలో దేశీయ వ్యవహారాలమంత్రిగా చేరవలసిందని ప్రధానమంత్రి ఆయనను అర్థించారు. పంత్ జీ ఉత్తరప్రదేశ్ విడిచివచ్చిన తరువాతగాని, పరస్పర విరోధభావంతో తలపట్లు పట్టుకొనే వివిధ వర్గాలను ఏకోన్ముఖంగా నడిపించటంలో ఆయన చూపిన సామర్థ్యం స్పష్టం కాలేదు.

పండిత పంత్ అస్తమయంతో ప్రజ్ఞాశాలి, అసమానబుద్ధి వైభవంగల పార్లమెంటేరియన్ ఒకరు పార్లమెంటుకు కరువయ్యారు. ప్రధానమంత్రి వలెకాక, ఆయన ఎప్పుడూ నిగ్రహంతోనే వ్యవహరించేవారు. అయితే దెబ్బకు దెబ్బ తీయటంలో ఆయనకు ఎప్పుడూ వెనుకంజ వేసేవారుకాదు. కమ్యూనిస్టులను తట్టుకొని నిలువగలిగిన సామర్థ్యం ఆయన ఒక్కరికే ఉన్నది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును పార్లమెంటుచేత ఆమోదింపచేయడానికి ఆయన ఎదుర్కోవలసివచ్చిన చిక్కులు బహుకొద్దిమందికి మాత్రమే తెలుసు. అయినా ఆయన ఆ పనిని బహు దక్షతతో నిర్వహించుకు రాగలిగారు.

"భారతదేశం నాయకులు, రాజకీయ సంస్థలు" అనే పేరుతో ఇటీవల వెలువడిన ఒక గ్రంథంలోని కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదహరించటం అప్రస్తుతంకాదు: "భారతదేశం రాజకీయాలలో విశిష్టమైన నాయకత్వం అభివృద్ధి చెందటం కంటికి నదురుగా కనిపిస్తుంది. ప్రాచీన సంప్రదాయాలనుంచి విడివడంతో ఒకరకం నాయకులను, అనుసరించాలనే వైఖరి బలవత్తరమవుతుంది. సంస్థానాధీశుల, భాగ్యవంతుల, అధికారం, ప్రభావం త్వరితగతిని క్షీణిస్తున్నాయి. సంప్రదాయసిద్ధమైన ఆధిపత్యమందు గౌరవం నశించటంవల్ల నూతన అనుబంధాలను ఏర్పాటు చేసుకునే ప్రయత్నం జరగటం సహజం. ఇలాంటి సంధికాలంలో ఈ నాయకులు ఆ లోటును భర్తీ చేయవచ్చు. ఇది నాయకులకు అనుయాయులకు మధ్యగల ఒక విశిష్టమైన సంబంధం. గాంధీజీ, కొంతవరకు శ్రీ నెహ్రూ ఈ విధమైన నాయకులుగానే వెలుగులోకి వచ్చారు. పంత్, ప్రసాద్, రాజగోపాలాచారి, పటేల్ ఆచరణ యోగ్యమైన వినూత్న ప్రమాణాలను సృష్టించారు."

దేశాన్ని స్వర్గీయ సుభాస్‌బోస్‌నుంచి ఆయన

విధానంనుంచి రక్షించి పండిత పంత్ ఉత్కృష్టమైన సేవ చేశారు.

సుబాస్‌బోస్ 1938 లో కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. కాని ఆ సంవత్సరాంతంలోగానే మహాత్మాగాంధితో ఆయనకుగల సంబంధం బాగా దెబ్బతిన్నది. ఆకాలంలో సుబాస్ బోస్ ఇలా వ్రాశారు: "సుపరిచితమైన పంథాను వదలి అజ్ఞాత మార్గాన్ని వెదకటమే పరమార్థంగాగల జీవితం ఆకర్షిస్తున్నంతగా మరొకటేదీ నన్నీనాడు ఆకర్షించటం లేదు. అమార్గం బాధామయమైనప్పటికీ, దానిలో ఆనందం కూడా ఉన్నది. దానిని కటిక చీకట్లు ఆవరించినా, ఉషస్సు కూడా లేకపోలేదు. ఈ మార్గములో అడుగిడవలసిందిగా నేను నా దేశ ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను."

బోస్ 1939 లో మళ్లీ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీ చేసి, కొద్దిపాటి వోట్ల ఆధిక్యతతో మహాత్ముని అభ్యర్థిని ఓడించారు. బోస్ ఎన్నిక తమ ఓటమి అని గాంధిజీ ప్రకటించారు. ఈ ఓటమిని విజయంగా మార్చినవారు పండిత పంత్.

గాంధిజీ అనుయాయులు, బోస్ అనుయాయులు తమ తమ బలాబలాలు తేల్చుకునేందుకు త్రిపురి కాంగ్రెసు అవకాశం కల్పించింది. ప్రథమ దశ పోరాటం కార్యదర్శినివేదికపై జరిగింది. ఈ నివేదిక అఖిల భారత కాంగ్రెస్‌సంఘం ముందు చర్చకు వచ్చినప్పుడు, ముందుగా కాంగ్రెసు కార్యవర్గం దీనిని ఆమోదించనిదే కాంగ్రెసు సంఘం ఆమోదించ

# న్యూఢిల్లీ లేఖ

వచ్చునా అనే అధిక్షేపణ వచ్చింది. నివేదికను అఖిల భారత కాంగ్రెసు సంఘం ముందు ఉంచవచ్చునని అధ్యక్షుడు బోస్ నిర్ణయించారు. తదుపరి సంఘం నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించింది. రెండవదశ పోరాటం పండిత పంత్, మరో 160 మంది సభ్యులు తాము ఒక తీర్మానాన్ని ప్రతిపాదించదలచినట్లు అధ్యక్షునకు తెలియజేయటంతో ప్రారంభమైంది. "రానున్న సంవత్సరంలో క్లిష్ట పరిస్థితి ఏర్పడే అవకాశం కన్పిస్తున్నందున, ఈ పరిస్థితినుంచి కాంగ్రెసు సంస్థను, దేశాన్ని కాపాడి విజయాన్ని సాధించగలవారు గాంధిజీ ఒక్కరే కనుక, కాంగ్రెసు కార్యవర్గం, వారి విశ్వాసాన్ని సంపూర్ణంగా పొందగలిగిందిగా ఉండాలి. ఈ కారణంచేత గాంధిజీ ఇష్టాన్ని అనుసరించి, కార్యవర్గాన్ని నియమించవలసిందిగా అధ్యక్షునకు విజ్ఞప్తి చేయడమైనది."

ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టేందుకు అనుమతించాలా? అక్కరలేదా? అనే సమస్య ఏర్పడింది. ఒక వర్గంవారు అసలీ తీర్మానాన్ని పరిశీలించే అధికారం అఖిల భారత కాంగ్రెసు సంఘానికి లేదన్నారు. అధ్యక్షుడు ఈ వాదాన్ని బలపరుస్తూ, తీర్పు చెప్పారు. అయితే తీర్మానాన్ని విషయ నిర్ణయ సంఘం పరిశీలనకు అనుమతించేందుకు ఆయన సంసిద్ధత వెల్లడించారు.

మహా సభలో ఇంతకంటే పెద్ద తుఫాను చెలరేగింది. కాని చివరకు ఎలాగైతేనేమి తీర్మానం నెగ్గింది. దీని పర్యవసానంగానే సుబాస్ బోస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేయటం జరిగింది.

గతాన్ని పరికించిచూస్తే, దేశాన్ని సుబాస్ బోస్ నుంచి ఆయన అనుయాయులనుంచి కాపాడింది పండిత పంత్ తీర్మానమేననే విషయం స్పష్టమవుతుంది. పంత్ భారత దేశాన్ని కాపాడి గాంధిజీ ప్రతిష్ఠను పునరుద్ధరించారు.

పండిత పంత్‌కు న్యూఢిల్లీ సముచితమైన "వీడ్కోలు" ఇచ్చింది. పార్లమెంటు ఉభయ సభల కార్యక్రమాలను వాయిదా వేశారు. ప్రభుత్వ కార్యాలయాలన్నీ మూసివేయబడినవి. బ్యాంకులు సైతం పని చేయలేదు. విదేశీ దౌత్య ప్రతినిధులు తమ కార్యాలయాలపైన పతాకలను సగానికిదించి, ప్రప్రథమంగా నూతన దౌత్య మర్యాదను సృష్టించారు. విందులు, వేడుకలు రద్దు చేయబడినవి.

వేలాదిప్రజలు రోడ్డుకు ఇరుప్రక్కలా బారులుతీరి నిల్చుని ఆ మహా నాయకునకు శ్రద్ధాంజలి సమర్పించారు. ఆయన నిష్క్రమణంతో ఏర్పడిన ఖాళీని భర్తీ చేయటం దుస్సాధ్యమైన పని. ★


పగఘారను విషనాగుల
పొగరణగించినగజమ్ము


మేరు నగధీరుడూ-స
ర్దారువలెకడుపూజ్యుడూ


అసిచే బట్టని సేనలు నడిపిన
అసలు సిసలు గాంధేయ పాంథుడు


"ఆపదగడువంబెట్టుగ
నోపిశుభంబయినదాని
నొడగూర్పగ...


భారతీయ
గోవింద
వల్లభుని
స్మారకార్థ
మిజాతి
కై మోడ్పు



## బావిలోపడి అలెగ్జాండర్ మృతి

### (మొదటి బహుమతి రు. 10 లు)

మోహన్ ఒక్కరోజు సెలవుపెట్టి మరునాడు బడికి వచ్చాడు. అతను రాని రోజు మేష్టారు అలెగ్జాండరు దండయాత్రను గురించి మా కందరికీ బోధించారు. మరుసటి దినము (అంటే మోహన్ బడికి వచ్చిన రోజు) ప్రశ్న అడుగ ప్రారంభించారు. మా అందరి వంతు అయిపోయినది. ఇక మిగిలినది మోహన్ ఒక్కడే! అతనిని మేష్టారీ ప్రశ్న అడిగాడు: "అలెగ్జాండరు స్వదేశానికి తిరిగి పోతూ ఎచ్చట చనిపోయెను?" మోహన్ ప్రక్కన నేను ఉన్నాను కాబట్టి నా కాళ్లను నొక్కాడు సమాధానం చెప్పమని. నేను చెప్పేది మేష్టారు వింటే తంతాడని మెల్లగా తల వంచుకొని "బా... బి .... లోన్" అని అన్నాను. పాపం మోహన్‌కు సరిగ్గా వినబడనందున, నేను చెప్పినది తనకు బాగా తెలిసినదని ధైర్యముగా "అలెగ్జాండరు స్వదేశమునకు తిరిగి పోతూ ఒక బావిలో పడి చనిపోయెను" అన్నాడు. ఎప్పుడూ సీరియస్‌గా ఉండే మేష్టారు ఫొల్లుమని నవ్వారు. మేము మా నవ్వును మేష్టారుగారి నవ్వుతో కలిపేశాం.

—ఎం. ఎం. రత్నం (తిరుపతి)

* * *

## "అంతా అనుకోవడంలో ఉంది"

### (రెండవ బహుమతి రు. 5 లు)

నేను, మా "కిచ్చి"గాడు సాయంత్రము తిరిగి తిరిగి వచ్చి, భోజనం చేయగానే నిద్రపోయాము. అర్ధరాత్రి మెళకువ వచ్చి, ఉక్కగా ఉండడము చేత మావాడిని కిటికీ తలుపులు తెరవమని చెప్పాను. మావాడు నిద్ర బద్ధకముతో కొంతసేపు విసుగుకొని లేచివెళ్లి, ...తెరిచాడు. 'అమ్మయ్య!! ఇప్పుడు ప్రాణం హాయిగా ఉందిరా" అనుకొని ఇద్దరం నిద్రపోయాము.

తెల్లవారి లేచి చూస్తినిగదా కిటికీ తలుపు తెరిచినట్లు లేదు. అనుమానం వచ్చి మా వాడ్ని కూడా లేపాను. వాడికి గూడా సందేహం వచ్చింది. కాని మరో క్షణంలో వాడు "హారిని!" అంటూ గొల్లుమని నవ్వాడు. "ఏమిటిరా?" అంటే మావాడు, "రాత్రి తెరిచింది కిటికీ కాదురా, ప్రక్కనున్న అలమారు తలుపురా" అన్నాడు. రాత్రి ఉక్కతోనే గాలి వీచిన ట్లనుకొని నిద్రపోయామని మాకు తెలిసి వచ్చింది.

—పొదిల రామచంద్రరావు.

## అంతా ఆడువారేనా?

### (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము కాలేజీలో పి. యు. సి. చదివే రోజులు. ఆ సంవత్సరమే మా కాలేజీ సమీపమున గల హైస్కూలు గ్రౌండ్సులో 'రీజినల్ గేమ్సు' జరుగుతున్నవి. ఆరోజే ఫైనల్ గేమ్సు. మా సెక్షనులో చాలమంది విద్యార్థులు గేమ్సు చూడటానికీ వెళ్లారు. మా తెలుగు లెక్చరర్ గారు క్లాసుకు వచ్చారు. క్లాసు చాలా పలుచగా ఉన్నది. క్లాసుకు రాని విద్యార్థు లందరు గేమ్సు చూడటానికి వెళ్లినారని లెక్చరర్‌కు తెలుకు. అందువల్ల లెక్చరర్‌గారు హాస్యముగా 'వీరంతా ఆడువారేనా?' అని పలికినారు. అంతలో ఒక విద్యార్థి లేచి 'ఆడువారు కాదు సార్. ఆడువారిని చూచువారుసార్' యని పల్కినాడు. ఆ మాటకు క్లాసంతా ఒక్కసారి ఫొల్లుమంది. మా లెక్చరర్ గారు కూడ విద్యార్థులతో శ్రుతి కలిపినారు.

—వి. నాంచారరావు (బందరు)

* * *

## నారదుని మతిమరుపు

### (రెండవ బహుమతి రు. 5 లు)

మేము హైస్కూలులో థర్డుఫారం చదివే రోజులవి. మా స్కూలు వార్షికోత్సవాలలో స్కూలులోని పిల్లలు డ్రామా వేస్తున్నారు. ఆ నాటకం "శ్రీ కృష్ణతులాభారం". ఆ నాటకంలోని పాత్రలకు సరైనవారిని ఎన్నుకొని, చాలా బాగా వేయించాలని హెడ్‌మాస్టరుగారు చాలా హంగామాగా డ్రామా మొదలు పెట్టించారు. సరే స్టేజి అరేంజిమెంటు మొదలగునవి బాగా చూచి, "నారద" వేషధారిని స్టేజిమీదకు పంపించి తను పుస్తకం పుచ్చుకుని వెనుక నిలబడ్డారు. నారదుడు "కృష్ణంభజే రాధా?" అని రాగం తీస్తూ తరువాత పాడవలసినది మర్చిపోయి స్టేజి మీద పచార్లు చేయటం మొదలుపెట్టాడు. వీడు, అడుగులోనే హంసపాదు అన్నట్లు, మొదట్లోనే మర్చిపోయినాడనే విసుగుతో, మేష్టరు "ఓరి వెధవా! విష్ణుస్వరూపారా అని అందించారు. వెంటనే వారదుడు ఓరి వెధవ విష్ణుస్వరూపాయదు కృష్ణంభజే ...... అని పాడేసరికి హాలంతా ఒక్కసారి నవ్వులతో ఆటంబాంబుపడ్డంత శబ్దం వచ్చింది.

—బి. లలిత (గుంటూరు

* * *

## 'కుక్కలేదు, జాగ్రత్త!'

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఒకసారి నేను, నా స్నేహితుడు సూర్యం కలిసి మా మామయ్యను చూడ్డానికిబయల్దేరాం. ఆయనకో 10 ఏళ్ల కొడుకున్నాడు. వాళ్ల ఇంటిగేటు మీద 'కుక్క లేదు, జాగ్రత్త!' అని వ్రాసిన బోర్డు చూడగానే మాకు నవ్వు వచ్చింది. లోనికి వెళ్లగానే పెద్ద కుక్క ఒకటి అరుస్తూ మమ్మల్ని తరిమింది. మేము భయంతో పరుగెత్తాము. అది ఆగకుండా తరిమింది. నేను గబగబా మా మామయ్య గదిలోకి పారిపోయాను. సూర్యం పరుగెత్తుతూ పాపం, తోటలో కెళ్లి చిన్న గోతిలో పడ్డాడు. అప్పుడు కుక్క వెంబడించటం మాని వెళ్లిపోయింది. బురదలో కూరుకు పోయిన వాణ్ణి చూడగానే నాకు నవ్వొచ్చి గట్టిగా నవ్వాను. ఇంతలో మా మామయ్య వచ్చారు. ఆయన కథతా చెప్పాను. ఆయన కొడుకును పిలిచి అడిగితే వాడు "కుక్క ఉన్నది జాగ్రత్త!" అని వ్రాస్తే మా స్నేహితులు నాతో ఆడుకోవడానికి రావటంలేదు. అందుచేత "కుక్క లేదు జాగ్రత్త! అని వ్రాశాను" అన్నాడు కొంచెం భయంగా.

శిష్ట్లా కాళీకుమార్ (విజయనగరం)

## "అవుట్ ఆఫ్ స్టాక"

### (రెండవ బహుమతి రు. 5 లు)

నేను మా స్నేహితుడు బజారు కెళ్తున్నాము. మా స్నేహితుడికి ఇంగ్లీషు తెలియకపోయినా పిచ్చెక్కువ కావున వాడు ఏదో ఇంగ్లీషునవల కావాలంటే బుక్‌షాప్ కెళ్లినాము. మావాడు ఇంగ్లీషు నవల 'టామ్ సాయర్' ఉందా అని అడిగాడు. కాని ఆ దుకాణదారు 'అవుట్ ఆఫ్ స్టాక్ ప్లీజ్' అన్నాడు. నేను బయటికి వచ్చిన తరువాత మావాడు దాని అర్థ మేమిటని అడిగినాడు. దాని అర్థము 'లేదు' అని నేను చెప్పాను. వాడు ఇంటికి వెళ్లినాడు. అప్పుడు వాడి తల్లి దండ్రులు ఇంట్లో లేరు. ఆ సమయములో ఒక పెద్దమనిషి వచ్చి 'మీ తల్లిదండ్రులు ఇంట్లో ఉన్నారా' అని అడిగాడు. వాడు 'అవుట్ ఆఫ్ స్టాక్ ప్లీజ్' అని అన్నాడు. అది విని ఆ వచ్చినాయన నవ్వుకుంటూ వెళ్లిపోయాడు.

ఆదూరి పార్థసారథి (గుంటూరు) ★




వాతావరణం పరిస్థితి నానాటికి ఓసికట్టుగా ఉంది. గాలి పెనుభూతమై పీడించసాగింది. ఓడను. వాయువ్యంనుంచి జోరుగా ఎదురువచ్చి అటకాయించి ముందుకు నడవకుండా అల్లరి పెట్ట సాగింది. సముద్రం అతలా కుతలంగావుంది. తప్ప తాగినవాడిలా తూలుతూ, తెప్పలా ఎగిరెగిరిపడుతూ ఊపోతూ నడుస్తోంది రంగూను. ప్రయాణికుల క్షోభ, కోపం ఇంతంతన రాకుండా ఉంది.

నవంబరు 3, 4 తేదీలలో గాలివానలాటిది ముంచుకు వచ్చేసింది. గాలి హోరునవీచి, సముద్రాన్ని అల్లకల్లోలంచేసివేసింది. కల్లోలిని ఆ ధాటిని ఓడమీద చూపించింది. 'రంగూన్' తలవంచుకుని పరిస్థితులకు అనువుగా నడుచుకుంది. ఒక పూట పూటంతా బహు నెమ్మదిగా నడిచింది. (చోదక చక్రం స్క్రూ)) గంటకి పది చక్రాలకన్న ఎక్కువ తిరగలేదు. తెరచాపలన్నీ ముడుచుకున్నాయి. గాలి వాలుకు తల ఒగ్గుతూ, కెరటాల తాకిడికి తవ ఒగ్గుతూ ఒడుపుగా నడకసాగించింది ఓడ. గాలి వాన ఇదే వరసలోఉండి ఓడ యిదే తీరులో పడిస్తే హాంకాంగ్‌కు అనుకున్న దానికన్న 20 గంటలు ఆలస్యంగా చేరడం జరుగుతుందని అంచనాలు కట్టారు.

మహోద్ధృతంగా ఎగిరి పడుతున్న మహా సముద్రంకేసి రెప్పవాల్చకుండా చూస్తూ నిల్చున్నాడు ఫిలియాస్ ఫాగ్. ఆ సముద్రం, గాలి, ఆ వర్షం అన్నీ కూడ బలుక్కుని అతనిమీద, అతనికి సవాలుగా తమ ప్రతిభ చూపిస్తున్నట్టున్నాయి. ఇవి ఇలా సాగి ఓడ 20 గంటలు ఆలస్యంగావెళ్తే హాంకాంగ్‌లో 'యోక హామా' నౌక తప్పిపోతుంది. దాంతోపాటే 20 వేల పౌండ్ల పందెం కూడా పోతుంది. అంతా సముద్రంలో కలిసిపోతుంది.

కాని ఆ క్షణంలో ఫిలియాస్ ఫాగ్ ముఖం చూస్తే అతను ఇంత కథకి నాయికుడనిగాని, ఇంతటి ప్రమాదంలోఉన్నాడనిగాని ఎవరికీ తట్టదు. ఎప్పటిలాగే అప్పుడూ అతను నిశ్చింతగా ఉన్నాడు. ఆవంత కూడా చింత ఉన్నట్టులేదు. భ్రుకుటి వెంట్రుకవాసి కూడా ముడుచుకోలేదు. ఈ ఉత్పాతం, ఈ ప్రళయం అన్నీ అతని కార్యక్రమంలో ముందే రాసుకున్నవన్నట్టూ, వేళ ప్రకారం తిరిగే అతని జీవితంలో అవీ వేళ ప్రకారం జరిగిపోతున్నట్టూ ఉంది. అతన్ని పలకరించి సానుభూతి చూపబోయిన అయూదా, ఆ మనిషి స్థిమితంగా ఉండడంచూసి తెల్లబోయింది.

ఆ తుపానుచూసి ఆనందంతో ఉప్పొంగిపోతున్న పెద్ద మనిషి ఆ ఓడమీద డిటెక్టివ్ ఫిక్స్ ఒక్కడే ఈ వుత్పాతాల ధర్మమా అని ప్రయాణం ఆలస్యంఅయి ఫిలియాస్ ఫాగ్‌కు అవతల ఓడ తప్పిపోయి హాంకాంగ్‌లో ఆగిపోతే అతనికి అంతకన్న కావలసిందిలేదు. ఆలోగా వారంటు వచ్చేస్తుంది. అందువల్ల తుపాను, ప్రళయం ఇవన్నీ అతనికి ఆప్త మిత్రులు అయిపోయాయి. ఓపక్క వోడ ఊపువల్ల తలతిరిగి దైహికంగా బాధపడుతున్నా, మరోవంక తన కోరిక తీరుతున్నందుకు ఆ మనసు ఆనందంతో గంతులు వేస్తోంది.

పాస్పార్తు కోపం, ఆవేశం, రోషం వేరే చెప్ప [illegible] ఇంతవరకూ అంతా సాఫీగా చక్కగా సాగిపోయిందే! భూమి, సముద్రం కూడా తన యజమాని పట్ల భక్తి విశ్వాసాలతో మెలిగి ప్రయాణం చక్కగా జరిపించాయి. ఓడలూ రైళ్ళూ, అతని మాట శిరసావహించి పరుగెత్తాయి. గాలి, ఆవిరి కలసి శాయశక్తులా సేవ చేశాయి. ఇప్పుడు అన్నీ హటాత్తుగా ఎదురు తిరుగుతున్నాయి. ఇంక అంతా ఇంతేనా? తుక్కెదురయ్యే ఘడియ వచ్చేసిందా?... పాస్పార్తు బుర్ర తిరిగిపోయింది. పందెం డబ్బు ఇరవై వేలూ తనే తన ముల్లెలోంచి తీసి అచ్చుకోబోతున్నట్టు బాధపడిపోయాడు. హోరుగాలినీ, పొగరెత్తి కొట్టుకుంటున్న కెరటాలనూ చూస్తే అతనికి ఒళ్ళు మండిపోతూంది. వీల్లేదుగాని కుదిరితే కొరడాపెట్టి చావగొట్టేసును వాటిని. కనీసం డిటెక్టివ్ ఫిక్స్ మనసులో ఎగిరెగిరి పడుతున్న ఆనంద తరంగాల సంగతి తెలిసినా ఆ పని చేసేవాడే. ఫిక్స్‌కి రోజు బాగుండబట్టి పాస్పార్తు ఎదుట పడ్డప్పుడు సంతోషం దాచుకున్నాడు.

గాలి ఉధృతంగా ఉన్నంతసేపూ పాస్పార్తు కాలు గాలిన పిల్లిలా తిరుగుతూనే ఉన్నాడు. ఉండుండి పరుగెడుతున్నాడు. తెరచాప కొయ్య ఎక్కిపోతాడు. దూకి ఇంజను గదిలోకి పరిగెడతాడు. తుపాను ఇంకా ఎన్ని నిమిషాలుంటుందో చెప్పమని నావికులను బతిమాలుతాడు. పోట్లాడతాడు. ఇతని ఆదుర్దా, కంగారు చూసి నావికులు నవ్వుకున్నారు. వెళ్ళి బరామీటరు చూడండి అని చెప్పి పంపారు. పాస్పార్తు బరామీటరును చూశాడు. పైకి తుపాను తగ్గిందని చెప్పు అని దాన్ని కుదపాయించాడు. తిట్టిపోశాడు. అది చాలా పొగరుపోతు రకం. బాధ్యతా రహితంగా బేఖాతరీగా వూరుకుంది పాస్పార్తు చేష్టలు చూస్తూ.

# 80 రోజుల్లో భూ ప్రదక్షిణం

నవంబరు నాలుగున వాన వెలిసింది. గాలి శాంతించింది. వాలు దక్షిణానికి రెండు పాయింట్లు తిరిగి ఓడకు మద్దతునిచ్చి ముందుకు తోసింది. పాస్పోర్టు స్థిమితపడ్డాడు. తెరచాప లెత్తారు. రంగూన్ మహా వేగంగా ప్రయాణం సాగించింది, వాలుగాలిలో.

ఎంత చేసినా, ఏమి చేసినా పోయిన కాలం తిరిగి రాదు. అయిన ఆలస్యం చెరిగిపోదు. దానికి తల ఒగ్గవలసిందే. ఆరవ తేదీ ఉదయం ఐదు గంటలవరకూ భూమి జాడలేకపోయింది. 5 వ తేదీన హాంకాంగ్‌లో ఉండాలని ఫిలియాస్ ఫాగ్ డైరీలో వ్రాసుకున్నాడు. అంచనాల ప్రకారం ఓడ చేరింది ఆరో తారీఖున. కాబట్టి ఇరవైనాలుగు గంటల కాలం నష్టం. యోకొహామా స్టీమరు ఇక అందదు.

ఆరు గంటలకు రేవునుంచి పైలట్ ఎదురొచ్చి, రంగూన్ నౌక బ్రిడ్జిమీద ఎక్కి రేవులోకి మార్గదర్శకత్వం చేస్తున్నాడు.

యోకహామా వెళ్లిపోయిందా ఇంకా ఉందా అని ఆ పైలట్‌ను అడిగితే తెలుస్తుంది. అడగాలని పాస్పోర్టు మహా ఉబలాటపడిపోయాడు. కాని సాహసం చాలలేదు. అడగడానికికాదు. జవాబు వినడానికి. వినకుండాఉంటే, ఇంకాస్సేపైనా ఆశ పడొచ్చు—ఏమో యోకహామా ఇంకా ఆగివుండ కూడదా అని. బాధ, ఆతృత భరించలేక ఫిక్స్ దగ్గర వెళ్లబోసుకున్నాడు పాస్పోర్టు. ఫిక్స్ ఓరగా చూసి నవ్వి, దానికేం అదిపోతే దాంతరవాతది దొరుకుతుందిగా అన్నాడు. పాస్పోర్టు మండిపడ్డాడు.

పైలట్‌ను అడిగే సాహసం పాస్పోర్టుకు లేకపోయిందిగాని, ఫాగ్ మాత్రం తాపీగానే, తన దగ్గర 'బ్రాడ్ షా' (యాత్రా మార్గదర్శిని) మరోసారి చూసుకుని పైలట్ దగ్గరకువెళ్లి యథాలాపంగానే అడిగాడు—'యోకహామా వెళ్లే ఓడ మళ్లీ ఎప్పుడు బయల్దేరుతుందో మీకు తెలుసా' అని.

"రేపు ఉదయం పోటువదలగానే" అన్నాడు పైలట్.

"అలాగా" అన్నాడు ఫాగ్ — ఎగిరి గంతులు వెయ్యకుండానే.

ఆ మాట విన్న పాస్పోర్టుకు మాత్రం అమాంతం ఆ పైలట్‌ను కౌగలించుకోవాలనిపించింది ఆనందాతిరేకంతో. ఆ మాట విన్న ఫిక్స్‌కు కూడా అదే ఉద్దేశం కలిగింది. ఎటొచ్చి కౌగలించుకుని వాడి పీక నులిమేదామన్న భావం కలిగింది.

"ఆ ఓడ పేరేమిటి?" అన్నాడు ఫాగ్.

"కర్నాటిక్" అన్నాడు పైలట్.

"అది నిన్ననే వెళ్లవలసింది కదూ?"

"అవునండి. బాయిలర్ ఒకటి చెడింది. మరమ్మతు పని పడింది. అందుకని ప్రయాణం రేపటిదాకా వాయిదా వేశారు."

పైలట్‌కు అభివందనాలు తెలిపి ఫాగ్ అక్కడి నుండి యాంత్రికంగా అడుగులు వేసుకుంటూ కిందకు వెళ్లిపోయాడు.

పాస్పోర్టు పైలట్ చెయ్యి పట్టుకుని గాఢంగా అదిమాడు. "పైలట్! నువ్వు చాలా మంచివాడివి" అనేసి పరుగెత్తి వెళ్లిపోయాడు.

ఈ హటాత్తు సన్మానానికి కారణ మేమిటో పైలట్‌కు బోధపడలేదు. క్షణంసేపు తెల్లబోయి చూసి, తిరిగి తన పనిలో పడ్డాడు. ఓడ మెల్లిగా రేవు సమీపించింది. పెద్దాచిన్నా ఓడలు, పడవలూ, తెప్పలూ అన్నీ తప్పించుకుంటూ ఒక గంట సేపటిలో అడంగుచేరి లంగరు వేసింది. జనం దిగారు.

ఫిలియాస్ ఫాగ్‌కు ఈ ఘట్టంలో అనుకోని వసతి — అతనికోసం అన్నట్టు ఏర్పడిందని చెప్పక తప్పదు. "కర్నాటిక్" నౌకలో బాయిలర్ చెడకపోతే అది 5 వ తేదీనేకదిలి వెళ్ళిపోయేది. జపానువెళ్లే ప్రయాణికులకు, అది తప్పితే తరవాత వారం రోజులదాకా మళ్లీ ఓడ లేదు. ఇంతవరకూ ఫిలియాస్ ఫాగ్ 24 గంటలు నష్టపోయినా, అది అతని ప్రయాణం ధ్వంసం చేసేంత పెద్ద నష్టం కాదు.

కర్నాటిక్ దొరకడం సంగతివేరు. యోకహామా నించి బయల్దేరి అట్లాంటిక్ సముద్రందాటి శాన్ ఫ్రాన్సిస్కో వెళ్లే నౌకను "కర్నాటిక్" అందుకుంటుంది. హాంకాంగ్‌నుంచి ఇది వెళ్లి యోకహామా చేరే వరకూ శాన్‌ఫ్రాన్సిస్కో నౌక ఆగివుంటుంది. అందువల్ల ఫాగ్ ఇక్కడ 24 గంటలు వెనకబడినా శాన్ ఫ్రాన్సిస్కో నౌకని గనక అందుకొంటే—అట్లాంటిక్ సముద్రయానం 22 రోజులు కాబట్టి — అందులో ఈ నష్టాన్ని కమ్ముకు రావచ్చు.

ఈ విధంగా లండన్‌నుంచి బయల్దేరిన తరువాత 35 రోజులలో జరగవలసిన ప్రయాణం 36 రోజులలో జరిగింది. ఒక్క రోజు వార ఇప్పటికి.

హాంకాంగ్‌నుంచి "కర్నాటిక్" మర్నాడు ఉదయం 5 గంటలవరకు బయల్దేరదన్నారు. కాబట్టి ఫాగ్‌కు ఇక్కడ 16 గంటల సేపు విరామం దొరికింది. ఈ వ్యవధిలో, అతను ఇక్కడ అయుదా బంధువు ఇల్లెక్కడో తెలుసుకొని ఆమెను ఒప్పగించి చక్కారావచ్చు. ఓడ దిగగానే ఆమెకు చేయి అందించి ఒక పల్లకీ దగ్గరకు తీసుకు వెళ్లాడు. ఏదైనా హోటలుకు తీసుకువెళ్ళమన్నాడు. వాళ్లు క్లబ్ హోటల్ మంచి దన్నారు. 20 నిముషాలలో ఫాగ్, అయుదా, ఆ వెనక పాస్పోర్టు హోటల్‌లో బస తీసుకు దిగారు.

అయుదాకు ఒక గది కేటాయించి సౌకర్యాలన్నీ ఏర్పాటు చేశారు. తరువాత హాంకాంగ్‌లోఉన్న ఆమె బంధువు గృహం తెలుసుకు వస్తానని చెప్పి బయల్దేరాడు. అంతవరకూ, ఆమెను ఒంటరిగా ఉంచడం క్షేమం కాదని, పాస్పోర్టును కాపుదలగా ఉంచాడు.

ఫాగ్ తిన్నగా ఎక్స్ఛేంజి కార్యాలయానికి వెళ్లాడు. అయుదా బంధువు పేరు మోసిన వణిజుడు కాబట్టి అక్కడ ఆయన చిరునామా సులభంగా తెలుస్తుంది.

అక్కడ ఒక బ్రోకర్‌ను అడిగాడు. అతను సర్ జీజీని ఎరిగిఉన్నవాడే ఆయన రెండేళ్లయిందిట ఈ దేశం వదలి వెళ్లిపోయి. ఇక్కడ బాగా డబ్బు గడించి తరవాత యూరప్‌లో స్థిరపడతానని చెప్పి వెళ్లిపోయాడు. హాలెండ్‌లో కాబోలు ఉంటున్నాడు....

ఫాగ్‌క్లబ్ హోటల్‌కు తిరిగి వచ్చాడు. అయుదాకు కబురంపి ఆమె గదిలోకి వెళ్లాడు. ఉపోద్ఘాతం ఏమీ లేకుండా ఉన్న సంగతి చెప్పేశాడు ముక్తసరిగా.

అయుదా మాట్లాడలేదు. నెమ్మదిగా నెన్నుదురు చేత్తో తుడుచుకొని ఒక క్షణం ఆలోచించి, "ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి?" అంది.

"ఏముంది. యూరప్ వెళ్లడం" అన్నాడు ఫాగ్.

"అయ్యో. నేను ఇప్పటికే మీకు చాలా శ్రమ ఇచ్చాను. ఇంకా—"

"అదేం కాదు. మీరు రావడంవల్ల నా కొచ్చిన ఇబ్బందేమీ లేదు" అంటూ, "పాస్పోర్టూ" అని పిలిచాడు ఫాగ్ వెంటనే.

"చిత్తం."

"కర్నాటిక్ స్టీమరులో మూడు కాబిన్‌లు తీసుకో."

ముందు ప్రయాణంలో కూడా అయుదా తమ వెంట వస్తుందని తెలిసి పాస్పోర్టు సంబరపడిపోయాడు. ఎంత మంచి మనిషి ఆవిడ! తనంటే ఎంత యిష్టం.

ఉత్సాహంగా బయల్దేరాడు పాస్పోర్టూ.

(ఇంకా వుంది)

### జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెం వేసి సేవకుడు పాస్పార్టుతో బయలుదేరతాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ ఫాగ్ దొరికాడని, అరెస్టుకు బొంబాయికి వారంటు పంపమని లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్ వెంట సూయజునుంచి బొంబాయికి చేరతాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరలేదు. బొంబాయినుంచి కలకత్తాకు రైలుబండిలో ప్రయాణం అవుతాడు ఫాగ్. రోథాల్ వద్ద బండి ఆగిపోగా గత్యంతరం లేక ఏనుగుకొని అలహాబాదు వెళ్ళుతారు. దారిలో బలవంతంగా సహగమనానికి పోతూఉన్న అయూదాను రక్షించి ఆమెతో కలకత్తా చేరుకొంటాడు ఫాగ్. అక్కడ వారిని నిలపడానికి ఫిక్స్ చేసిన యత్నం విఫలమైంది. ఫాగ్ ప్రభృతులు 'రంగూన్' ఓడలో పయనం ప్రారంభించారు. ఆ ఓడలో వే ఉన్నాడు ఫిక్స్. ఫాగ్‌ను అరెస్టుచేయడానికి భోగట్టా సేకరించాలని పాస్పార్టును చేరదీశాడు. పాస్పార్టు వైఖరి ఫిక్సుకు కాని, ఫిక్స్ ధోరణి పాస్పార్టుకు కాని అంతు చిక్కలేదు.

# మనము మన దేహస్థితీ

## నాలుక - ఇతర నిర్మితులు

డా॥ గాలి బాలసుందరరావు

గతవారం నాలుక నిర్మాణాన్నీ, దాని ప్రధాన ధర్మములను క్లుప్తంగా వర్ణించాను నోటిలోఉన్న ఉపాంగములలో నాలుక అతి ప్రధానమైనది. ఇప్పుడు నోటిలో నాలుకను అనుసరించిఉన్న ఇతర నిర్మితులను గురించి కొద్దిగా తెలుసుకుందాము.

నాలుకక్రింద ఉన్న మాంస భాగములలో ఉమ్మి నీటిని(Saliva)స్యందించే గ్రంధులున్నవి. ఇందులో ఒకటి గడ్డమునకు వెనుక, నాలుక క్రిందఉన్నది. దీనిని సబ్‌లింగ్వల్ సెలైవరీగ్లాండ్ అంటారు. ఇన్‌స్పెక్టరు క్రిందివారు సబ్‌యిన్‌స్పెక్టరు అని అందరికీ తెలుసు 'సబ్' అన్న ఉపసర్గకు "క్రింద ఉన్న" అని అర్థము. లింగ్వా (Lingua) అన్న లేటిన్ మాటకు, 'గ్లాసస్' అన్న గ్రీకు మాటకు నాలుక అని అర్థము నాలుక ఇన్‌ఫ్లేం అయితే గ్లాసయిటిస్ అంటారు. ఈ ఉత్పత్తి తెలియకపోతే ఆ మాటలు గడ బిడగా ఉంటవి. నాలుక క్రిందఉన్న ఉమ్మి గ్రంధి గనక దానిని సబ్‌లింగ్వల్‌గ్లాండు అన్నారు. 'లింగ్వా' అన్న మాటను భాషకు మారుపేరుగా వాడుతున్నారు నాలుకవల్ల ఏర్పడ్డది గనకనే, భాషకు ఇంగ్లీషులో 'లేంగ్వేజి' అనే పేరు వచ్చింది శారీరక నిర్మితుల వర్ణనలో 'సబ్' లనే ఉపసర్గ తరచు వస్తూవుంటుంది. నాలుక వెనుకభాగం క్రిందుగా మరొక ఉమ్మి నీటి గ్రంధి ఉన్నది. దానిని సబ్ మేగ్జిలరీగ్లాండు అంటారు. మేగ్జిలా అంటే పై దవడ ఎముక. దాని క్రింద ఉన్నది గనుక ఈ గ్లాండుకు యీ పేరు వచ్చింది. కేవలం నోటిలో ఉండక పోయినా, నోటిలోకిఉమ్మి నీటినిపంపే గ్రంధులు రెండు ఉన్నవి. అవి చెవికి ముందుగాఉన్న గవదలలోఉన్న పెరాటిడ్ సెలైవరీగ్లాండులు(Parotid).ఇవి ఇన్‌ఫ్లేంఅయినప్పుడు గవద బిళ్లలు వచ్చినవి అంటాము ఇవికాక మ్యూకస్‌వంటి జిగురు పదార్థమును స్యందించే గ్రంధులు ఎన్నో నోటిలోనూ నాలుకక్రిందా ఉన్నవి. ఈగ్లాండులు తమ స్యందనమును తమ నాళముల ద్వారా నాలుక క్రిందకు పంపుతవి. "థైరాయిడ్"వంటి కొన్ని గ్లాండులు తమ స్యందనమును సరాసరి రక్తంలోకి వదిలేస్తవి. వీటికి నాళికలు లేవు. వీటిని ఇంగ్లీషులో 'ఎండోక్రైనులు'(Endocrines)అంటారు. ఉమ్మినీటినిస్యందించే గ్రంధులు సనాళికలు అనాళిక గ్రంధులను గురించి యీ మధ్య చాలా పరిశోధనలు జరిగినవి వీటి స్యందనములు ఎంత ముఖ్యములో, వాటి లోపం వల్ల అనేక రోగములకు కారణమవుతుందో చాలావరకు తెలుసుకోబడింది. ఇంకా వీటిని గురించి పరిశోధనలు పూర్తి కాలేదు. శరీర కార్యకమం అంతా రసాయనిక కార్యక్రమము. ఈ రసాయనిక కార్యక్రమం గ్లాండుల స్యందనముల ప్రభావంవల్ల జరుగుతున్నది. అందువల్ల గ్లాండులను గురించి క్లుప్తంగానయినా తెలిసిఉండకపోతే, శరీర ధర్మములు, వ్యాధుల్లో వాటి మార్పులూ అర్థం కావు. కండరం, కండపోగుల సముదాయమైనట్లే గ్లాండు అనేక చిన్న గ్లాండుల సముదాయం. ప్రతి గ్లాండులోనూ ద్రవములను స్యందించే జీవకణములు ఉంటవి ఈ జీవకణములు "ఎపితిలియం"లో జీవకణములలాగా, నాపరాళ్లలాగా, పలకలలాగా ఉండవు. మాంసములై, గుండ్రంగానో పలుకగానో ఉంటవి. సెలైవరి గ్లాండుల నాళములు, నాలుక క్రిందఉన్న ఫ్రీనంకు అటుప్రక్కనా యిటుప్రక్కనా నోటిలోకి తెరుచుకుని ఉమ్మినీరును గుమ్మరిస్తూ ఉంటవి. ఉమ్మినీరు విధులు చాలా ఉన్నవి. అందులో నోటిని తడిగా ఉంచడం, అన్నం నమిలి ముద్ద కావడానికి ఉపయోగ పడడం ఒకటి. మిగతా విధులు ఆహారం జీర్ణంకావడానికి సంబంధించినవి. వాటిని ఆ సందర్భంలో వివరిస్తాను.

నాలుక చివర భాగమును అగ్రమనీ, వెనుక అంగిలిలో హయోగ్లాసస్ అనే శల్య విశేషమునుండి ఆరంభమయిన భాగమును మూలము అని అంటారు. నోటిపై గోడలో ముందు భాగము కఠినంగాఉండి, తరంగములలాగా నిమ్నోన్నతములు కలిగి ఉంటుంది. పై అంగిలి వెనుక భాగము చాలా మృదువుగా మాంసలమై ఉంటుంది. ఈ ప్రదేశ మధ్యంనుంచి జెండాలాగా కొండ నాలుక వ్రాలి ఆడుతూ ఉంటుంది.

నాలుక మూలానికి అటూ, యిటూ మ్యూకస్ మెంబ్రేను మడతలు నాటక రంగంలో సైడ్ కర్టెనలలాగా నిలబడి ఉంటవనీ, వాటిమధ్య "టాన్సిల్సు" (Tonsil) అనే నిర్మితివున్నదని యిదివరకే చెప్పేను లింఫుగ్లాండులలోఉండే టిష్యూవంటిదే టాన్సిలులోఉండే టిష్యూ కూడా. టాన్సిలు అందరి నోటిలోనూ ఉంటుంది. కాని చిన్న



పిల్లలలో తరుచుగాను, అప్పుడప్పుడు పెద్దవారి లోనూ, యిది ఇన్‌ఫ్లేం అవుతూఉంటుంది. ఈ స్థితిని టాన్సిలైటిస్ (Tonsillitis) అంటారు. ఈ వ్యాధిని గురించి తర్వాత వివరిస్తాను. టాన్సిలు ఉండే మ్యూకస్ పొరలతో ఏర్పడిన తడికలకు వెనుక ఉన్నభాగాన్ని ఫేరింక్సు(Pharynx) అంటారు. ఇది గరాయి ఆకారం కలదని ఇదివరకే చెప్పాను. ఈ ఫేరింక్సు పై భాగం ముందు వైపున ముక్కు రంధ్రముల వెనుక నోరులు తెరుచుకుని ఉంటవి. ఈ భాగమును, అందువల్ల నేసో-ఫేరింక్సు(Naso-Pharynx) 'నేసో' అంటే నాశికా సంబంధమైన అని అర్థం. ఇక్కడ కూడా శబ్ద సామ్యం గమనించ దగినది. నాసికను సంబంధించిన ఫారింక్సు భాగము గనక దీనిని నేసోఫేరింక్సు అన్నారు. నాశికా రంధ్రాంతములు, కొండ నాలుక వెనుక ప్రక్కన ఫేరింక్సు లోకి తెరుచుకుని ఉంటవి. వీటి ముఖ ద్వారంలో టాన్సిలువంటి నిర్మితులు ఉన్నవి. వీటిని 'ఎడినాయిడ్సు (Edinoids) అంటారు. టాన్సిల్సు లాగే ఎడినాయిడ్సు కూడా అందరిలోనూ ఉంటవి. అయితే ఇవి 5 వ సంవత్సరంనుండి 20 వ సంవత్సరంవరకు పెరిగి, ఆ తర్వాత క్రమంగా క్షీణించిపోతవి. కాని కొన్ని పరిస్థితులలో యివి ఇన్‌ఫ్లేం కావడం, పెద్దవి కావడం జరిగి ముక్కుతో వూపిరి పీల్చడం కష్టమూ, దుస్సాధ్యమూ కూడా అవుతుంది. టాన్‌సిలైటిస్ వర్ణించేటప్పుడు యీ విషయం విపులంగా వర్ణిస్తాను.

ఫేరింక్సు క్రిందిభాగం రెండు నోరులున్న గరాటు గొట్టం వంటిది. ఇందులో ముందున్న ప్రక్కనవున్న నోరు, కంఠం ముందు భాగంలోఉన్న శ్వాసనాళంలోకి తెరుచుకొని ఉంటుంది. ఈ శ్వాస నాళం ముఖద్వారమును గ్లాటిస్ (Glottis) అంటారు. నాలుక మూలమునకు వెనుక ప్రక్కన పాము పడగవంటి ఒక నిర్మితి ఈ ద్వారమును, మూస్తూ, తెరుస్తూ ఉంటుంది. ఈ నిర్మితి 'ఎపిగ్లాటిస్' (Epiglatis) 'ఎపి' అంటే పైన ఉన్నది అని అర్థమని పూర్వ వ్యాసములలో తెలియ జేశాను. గ్లాటిస్‌పైన ఉండేది గనక దీనిని ఎపి గ్లాటిస్ అన్నారు. శ్వాసనాళం ముఖ ద్వారం వెనుక జీర్ణకోశమును, నోటినీ కలిపే ఈ సాఫెగస్ (Oesaphaegers) అనేనాళముయొక్కముఖద్వారం ఉన్నది. ఆహారం నోటిలో నమలబడి ముద్దఅయి, యీ యీసాఫెగస్ నాళంలోకి పోతున్నప్పుడు ఎపిగ్లాటిస్, గ్లాటిస్ నోటిని మూసి ఆహార పదార్థములు శ్వాసనాళంలోకి పోకుండా కాపాడుతుంది.

# మనమూ-మనదేహస్థితి

అయినా నవ్వుతూ మ్రింగినప్పుడు, తొందరగా నీరు త్రాగినప్పుడు, త్రాగుతూ మాట్లాడినప్పుడూ, కొన్ని వ్యాధులలోనూ, ఆహారం, నీరు శ్వాసనాళం లోకిపోయి, విపరీతమైన దగ్గు వస్తుంది. ఆ స్థితిని "సలక మారింది" అంటారు.

చెవిలో మూడు భాగములున్నవి. (1) బహిర్భాగము, (2) మధ్య భాగము, (3) అంతర్భాగము అని. వాటిని సందర్భం వచ్చినప్పుడు వర్ణిస్తాను. ఈ భాగములలో మధ్యభాగంనుంచి ఒక నాళము. టాన్సిల్సు వెనక ప్రక్కన నేసోఫేరింక్సు'లో తెరుచుకుంటోంది. ఈనాళమును యూస్టాస్ (Eustace) అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టేడు. అందుకని ఆ నాళమునకు యూస్టాషియన్‌నాళము అని పేరు వచ్చింది. ఈ నాళం ద్వారా చెవి మధ్య భాగానికీ, నోటి వెనక భాగానికీ సరాసరి సంబంధం ఏర్పడి ఉన్నది. చెవి బహిర్భాగమునకు, మధ్య భాగమునకు మధ్య డోలుమీద తోలువంటి పొర ఉన్నది. దీనిని టింపన్నం (Tympannam) అంటారు. బయట జరిగే శబ్దములు, గాలిలో ఏర్పరచే స్పందనములను ఇది స్వీకరించి, కొన్ని సూక్ష్మ శల్యముల ద్వారా శ్రవణేంద్రియానికి చేరుస్తుంది. కాని, ఆచర్మ స్పందనం మరీ అధికమైతే చెవి మధ్య భాగంలో నిర్మితులు తికమకఅయిపోతవి. అందుకని ఆ అధిక పీడన శక్తిని తగ్గించడానికి భగవంతుడు నోటిలోకి ద్వారం ఏర్పరచేడు. ఈ గొట్టం లోపల మ్యూకస్ మెంబ్రేను హత్తుకుని ఖాళీయే ఉండదు. కాని తరుచు యీ నాళం నోటిలో ఏర్పడిన క్రిమి దోషానికి గురిఅయినందున, ఇన్‌ఫ్లేం అవుతుంది. అప్పుడు చెవులో "గుంయ్" మని శబ్దం వస్తుంది. జిములు శబ్దములు వినిపిస్తవి. నోటిలో మెరప కాయ నమిలినప్పుడు గూబ గుంయ్ మంటానికి కూడా ఇదే కారణం. ముక్కులోనుండి కంటి నీరును స్యందించే గ్రంధికి ఒక ద్వారం ఉన్నది. ఘాటయిన వాసన చూచినప్పుడు కంటి వెంట నీర వస్తుంది. ఆ వివరాలు ఆ యా భాగములను చర్చించినప్పుడు విపులీకరిస్తాను. ఇప్పుడు చెప్ప వచ్చిందేమిటంటే నోటికీ, చెవుకూ, ముక్కుకూ గొంతుకలోఉన్న భాగాలకు, గొంతుకనుంచిపోయే శ్వాస అన్న నాళములకూ సన్నిహిత సంబంధం ఉన్నది. ఇక్కడ క్రిమిదోషం ఏర్పడితే సన్నిహితత్వం వల్ల, రక్తనాళములవల్ల, లింఫాటిక్సువల్ల ఆ క్రిములు యీ పరిసరావం ములలో ఇన్‌ఫెక్షన్ యేర్పరుస్తవి. ఇందువల్లనే, ముక్కు, నోరు, చెవి వ్యాధులు; వాటి నిరూపణ, పరిశీలన, పరిశోధన నివారణ ఒక ప్రత్యేక నైపుణ్యంగా పరిణమించడం జరిగింది. నోటిలోఉన్న దంతములు చిగుళ్లు, నాలుక, టాన్సిల్సు, ఎడినాయిడ్సు ఇటువంటివి క్రిమి దోషానికి గురిఅయితే ఎంత ప్రమాదమో పై విషయములు గ్రహిస్తే తెలుస్తుంది.

పై విషయములు గమనిస్తే నాలుక అతి చిన్న ఉపాంగమైనా, ఎన్నో ధర్మములు నిర్వహించే అతి ముఖ్యమైన ఉపాంగమని తెలుస్తుంది. (1) బుగ్గలకూ, దంతములకూ నోటిలో ఇతర భాగములలోను ఉన్న పరాయి పదార్థములను తొలగించి నోటిని పరిశుభ్రంగా ఉంచడం, (2) ఆహారం నములుతున్నప్పుడు, ఆ ఆహారమును దంతముల క్రిందికి తోయడం (3) నమలగా తయారయిన ముద్దను ఈసాఫెగస్‌లోకి దొర్లించడం (4) రుచి భేదములను నిర్ణయించి, ఆకలిని రేకెత్తించి, అన్న యిష్టత కలిగించడం, (5) శబ్దోచ్చారణలో పాల్గొని మానవ సంఘ జీవితానికే ప్రధాన కారణం కావడం. ఇట్లా నాలుక యెన్నో పనులను నిర్వహించే అతి ముఖ్యమైన ఉపాంగం.

పై విధులన్నింటిలోనూ శబ్దోచ్చారణ అతి ముఖ్యమైనది. సంఘ విజ్ఞాన దృష్టితో చూచినా, మత దృష్టితో చూచినా, మానవ నాగరకత అంతా శబ్ద ప్రధానమైనదిగానే కనిపిస్తుంది. శుకపిక మధురారవములు, సింహ గర్జనము, గజఘీంకారములు అన్నీ నాలుక సహాయంతో ఉద్భవించేవే.

ఇంతేకాదు. నాలుకక్రింద ఉన్న మ్యూకస్ మెంబ్రేను కొన్ని ఔషధములను ఆహరించుకునే శక్తి కలది. అందుకని అతి స్వల్ప పరిమాణములలో అవసరమైన మందులను నాలికక్రింద ఉంచుతారు. ఈ విధంగాఉంచే ఔషధ వస్తువులను 'లింగ్వెట్సు' అంటారు.

ఇన్ని ముఖ్యవిధులను నిర్వర్తిస్తూ, శరీరాంతర్గతములయిన వ్యాధులనెన్నింటినో తన స్థితితో వెల్లడిస్తూ, ఉండే నాలుకే స్వయంగా వ్యాధిగ్రస్తమవుతుంది. ఆవిషయాలను వచ్చేవారం చర్చిస్తాను.

పాఠకులు డా॥ బాలసుందరరావును ఏవైనా ప్రశ్నలు అడుగదలిస్తే, తమ చిరునామాలు కల కవర్లను (పోస్టు బిళ్ళలు అతికించినవి) జతపరుస్తూ సంపాదకులకు లేఖలు వ్రాయవచ్చు. ఉచితమని తోచిన ప్రశ్నలకు డాక్టరుగారు సమాధానాలు ఇస్తారు.

ప్రశ్నలు స్థూలంగా ఉండాలి.

# వాస్తు విశేషము

నేడు మనకు లభ్యమయి ఉన్నవి. అంతకు పూర్వము ఆంధ్ర శిల్పము, వాస్తువు, ఇతర చిత్రకళా విశేషములు ఎట్లుండెడివో మనకు తెలియదు. బహుశ, పురాతత్వశాఖవారి శోధనలవలన, భూగర్భమున దాగి ఉన్న అతి ప్రాచీన ఆంధ్ర శిల్ప కళాఖండములు ఏవయిన మనకు లభించునంతవరకు ప్రాచీన ఆంధ్ర శిల్పచరిత్రను, నేడు మనకు లభ్యమయిన ప్రాచీన ఆంధ్ర శిల్ప కళాఖండముల నాటినుండియే మనము గణింపగలము. చిత్రమయిన విశేషమేమి యన, మనము నేడు ఎరుగ గలిగిన ఆంధ్రుల చరిత్ర కూడ, దరిదాపు ఆనాటినుండియే పండితులచే గణింపబడుచున్నది.

నేడు మనమెరుగగలిగిన అతి ప్రాచీనమయిన ఆంధ్ర వాస్తు విశేషములు, శాంచి స్థూప తోరణములు, కార్లిగుహ, అజంతా గుహలలో కొన్ని గుహలు మాత్రమే. అమరావతీ, జగ్గయ్యపేట మొదలయిన ఆంధ్ర స్థూపములు కొన్ని అంత ప్రాచీన కాలమునకు చెందినవే. కాని వాటియందు కాల ప్రసారము ననుసరించి ఆంధ్రులు చేసిన మార్పులవలన అవన్నియు తరువాత శతాబ్దములకు చెందినట్లు, పండితులచే గణనీయములగుచున్నవి. ఏది ఎట్లయినను ప్రాచీన ఆంధ్ర వాస్తు ఖండము లన్నిటియందును. రూపశిల్పము (చిత్రకళ సైతము) వాస్తువునంటికొనియే ప్రస్ఫుటమగుచున్నది. వీటి యందు కానవచ్చు శిల్ప విశేషములన్నియు, వాస్తువు ననుకరించు వాస్తు భాగములేకాని, వాస్తువు నతిక్రమించి, మించి వేరయిన విడి శిల్పములు కావు. శాంచి తోరణములందు కోణములందు నిలచి, విలాసముగా అడ్డ కంబములను నిలుపు యక్షిణీలు కూడ, వాస్తువున కవసరమైన భాగములుగానే నిలిచి యున్నవి. ఆ యక్షిణీలు లేకున్న, ఆ అడ్డ కంబము లెట్లు నిలుచునన్న సందేహము సామాజికుని బాధింపక మానదు. నిజముగా నాటి యాంధ్ర జాతియందు సామూహిక జీవనమే ప్రధానము. వాస్తువులందు రూపొందిన శిల్పముల భావము ననుసరించి, నాటి యాంధ్ర జాతియందు నయితము వ్యక్తులున్న మాట స్పష్టము. కాని యా వ్యక్తులందరు సంఘమందే, సంఘ భాగములుగానే సంచరించుచూ, సంఘము నలంకరించువారైరి. అంతేకాని నాటి వ్యక్తిత్వము, సంఘమునుమించి కాని, వీడి కాని సంచరించలేదు. ఎంతటి ఘనునకైనను సంఘమును అతిక్రమించి స్వేచ్ఛగ నడుచుకొను అభిలాష నాటి ఆంధ్రజాతియందు లేదు. సర్వ ప్రాచీన ఆంధ్ర వాస్తువు నందంతటను ఈ విషయము ప్రస్ఫుటితమగుచునే యుండును. కాని క్రీస్తుకు తరువాత అయిదు, ఆరు శతాబ్దములు గడచుసరికి, ఆంధ్ర శిల్పమందు శిల్ప రూపములు, వాస్తువునుంచి వేరుపడసాగినవి. ఈ అంశము కొంతవరకు ఆఖరున మలచిన అజంతా గుహాలయములందును, ఆ కాలముననూ, అటు తర్వాతనూ, మలచిన కన్హారీ గుహలందును విదితము కాగలదు. ఆ నాటికి వ్యక్తిత్వము, దోషమయి, సంఘమును అతిక్రమించి, మించి సంచరింపసాగినదని మన మూహింపవచ్చును. ప్రబల ఆంధ్ర సామ్రాజ్య మా నాటికే అంతరించి, ముక్కలు ముక్కలయి, చిన్న చిన్న రాజులు, వేర్వేరు ప్రత్యేక సింహాసనములతో, ఆంధ్ర భూమిని అలంకరించి రన్నట్లు నాటి ఆంధ్ర శిల్పమే నిశ్శబ్దముగ పలుకుచున్నది పరిపూర్ణ ఆంధ్ర సామూహిక జీవన మంతరించుట కదియే మొదలు. ఆంధ్ర జాతి నాళములందు నీరస ప్రసార మానాడే ప్రారంభించినదని మన మూహింపవచ్చును.

శాంచి స్థూపములందు, వాస్తువు ననుసరించి ఆంధ్ర ప్రత్యేకత యొకటి స్పష్టముగా కానవచ్చును. స్థూపము చుట్టు పరివేష్టించి ఉన్న ప్రహరీ శిలా ఫలకములతోపాటు, నేటివరకు అద్భుతముగా నిలిచి ఉన్న తోరణ వాస్తువులు, ఆంధ్ర జాతి విశిష్టతను ఎంతగానో అనుభావించుచున్నవి. స్థూపములకు ప్రహరీలు, శిల్పిత ఫలకములతో నిర్మించు అలవాటు నాటికే హిందూ దేశమున పరిపాటి అయినట్లు, అంతకు పూర్వమే నిర్మితమయిన బారహత్ స్థూప ప్రహరీ ఫలకములే తార్కాణములు. కాని శాంచి స్థూపమునకు నలు దిక్కుల నిర్మించిన తోరణములు మాత్రము, ఆంధ్రజాతికి చెందిన ప్రత్యేక వాస్తువనియే చెప్పవలయును. ఈ ప్రత్యేక వాస్తు రూపము ఆంధ్ర జాతి నంటుకుని అనేక శతాబ్దముల వరకు నిలిచిఉన్నమాట కూడ వాస్తవము. ఏలనన అటు తర్వాత పదునాలుగు శతాబ్దములు గడచిన తర్వాత కూడ, అట్టి తోరణ వాస్తువులను కాకతీయుల కాలమునందు కూడ ఆంధ్రులు నిర్మించుచునే ఉండిరి. కాని కాల ప్రసారములో ఆ వాస్తువుయొక్క రూపమునందు, కొన్ని మార్పులు వచ్చినమాట వాస్తవము. అయినప్పటికీ తొలి ఆంధ్ర తోరణమందలి వాస్తు భావముగాని, వాస్తున్యాయములు కాని నిర్మాణక్రమముకాని తొలగక, తొలి యాంధ్ర తోరణ వాస్తుభావములే, కాకతీయుల కాలమున కూడ, ఆంధ్ర తోరణములు ప్రస్ఫుటించుచూనే ఉన్నవి.

తోరణములభావము ఆహ్వానము. లోకమంతయు వచ్చి, తవ ఆతిధ్యమును స్వీకరించి, తమ ప్రతిభా వైభవములలో పాల్గొని, తమ వలెనే సంతోషించవలెనని, నాటినుంచి నేటివరకు ప్రతి ఆంధ్రుని ఆంతర్యమున స్పందించు బలమయిన కోరిక. ఆనందముతో తాము నిర్మించిన దివ్య వాస్తువులు, శిల్పములు లోక కళ్యాణకరములు. ఇవి ప్రత్యేకముగ ఆంధ్రుల కొరకే కాదు. లోకమందలి సర్వ మానవ జాతులు, జీవులు కూడ వీటివలన తరింపవచ్చును. ఇవి లోక కళ్యాణమునకు. ఈ దివ్య ఆహ్వాన భావము నాటి శాంచి తోరణములందును, శతాబ్దములు గడచిన తర్వాత నిర్మితములయిన కాకతీయ తోరణములందును, సమానముగానే స్పందించుచున్నది.

కాని శాంచి తోరణములందును కాకతీయ తోరణములందును స్పందించు అంతర్భావములందు

# ప్రాచీన ఆంధ్ర వాస్తు విశేషము

## ఆమంచర్ల గోపాలరావు

ప్రమానవ చరిత్రయందు పేర్కొనదగిన ప్రాచీన జాతులలో ఆంధ్రజాతి ఒకటి. కీర్తిశేషులయిన పండిత చిలుకూరి వీరభద్రరావుగారన్నట్లు "ఆంధ్రులు ఆదిమ నివాసులో ద్రావిడులో, ఆర్యులో మనము నిశ్చయముగ చెప్పజాలము." నిజముగా అతి ప్రాచీన ఆంధ్ర చరిత్ర కాల గర్భములోనే జీర్ణించుకొని, మసకవారిపోయినట్లనిపించును. ఏలనన, ఐతరేయ బ్రాహ్మణమందు విశ్వామిత్రుడు తన శిష్య బృందమును ఆంధ్రులు కమ్మని శపించిన దాది, శాతవాహనుల కాలము వరకు, మన పురాణములందేమి, ఇతిహాసములందేమి, ఒక్క సుచంద్రుడు, అతని తనయుడు ఆంధ్ర విష్ణువు అను పేర్లు తక్క మరేమియు కానరాదు. ఆంధ్ర విష్ణువాది తొలి ఆంధ్ర రాజులు, శాతవాహనులకు పూర్వము రెండు మూడు శతాబ్దములు ఆంధ్ర దేశమును పాలించియుండ వచ్చునని చిలుకూరి వీరభద్రరావుగారు తమ అభిప్రాయమును సూచించియున్నారు. ఆంధ్ర విష్ణువు మాత్రము, "నిశంభుడను దానవునితో పదమూడు మహా యుగములు, మహా యుద్ధముచేసి, వానిని హతము గావించి, శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరముల నడుమ ప్రాకారముల నిర్మించి, కోటగట్టి, యాత్రి క్షేత్రములను త్రిద్వారములుగ జేసి, త్రిశూలధారియైన ఈశ్వరుని గాపుపెట్టి, ఋషులతో గూడ గోదావరీ తీరమున నివసించె" నను గాథను శ్రీ వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్రలో చెప్పియున్నారు. అటు తర్వాత చంద్రగుప్త మౌర్యునికాలములో మనదేశమునకు రాయబారిగ వచ్చిన మెగస్తనీసు వ్రాతల ననుసరించి, ఆ నాటికి ఆంధ్రులకు దృఢమయిన కోటలు ముప్పది యున్నట్లు, పండితులు, చరిత్రకారులు విపుల మొనర్చినారు. అనగా శాతవాహనుల నాటికి పూర్వమే ఆంధ్రులు వాస్తువునందు అతి ప్రవీణులనియు, దుర్భేద్యములగ కోటలను కూడ వారలకు అప్పటికే రెండు మూడు శతాబ్దములనుండి కట్టు అలవాటు ఉండి ఉండెడిదనియు మనము ఊహించ వచ్చును.

కాని ఆ కాలమున ఆంధ్రులు నిర్మించిన కోటలుకాని, మరి యే ఇతర కట్టడములుకాని నేడు కానరావు. ఇందుకు అనేక కారణములను మనము ఊహింపవచ్చును. అందు ప్రథమ కారణము, నాడు దేశమందు పురాతత్వశాఖ యనునది లేకుండుటయే. భావమును కోల్పోయి, శిథిలావస్థకు వచ్చిన కట్టడములను, వాటి వస్తు సామగ్రిని పూర్వము వీలయినంతవరకు క్రొత్త కట్టడముల కొరకు వినియోగించు అలవాటు అన్ని దేశములందునూ ఉండెడిది. కాలము గడచిన కొలది, మానవ జీవిత వికాసము ననుసరించి ప్రాత కట్టడములు నిరుపయోగము లగుచుండెడివి. ముఖ్యముగా ఆ రోజులలో యుద్ధ రీతులు అతివడిగా మారుతూ వచ్చిన వనుటయందు ఏ సందేహము లేదు. అందుచేత ప్రాతకోటలు నిరుపయోగము లగుటయేగాక, ఒక్కొక్కప్పుడు ప్రతిబంధకములు కూడ అవుచుండి యుండవచ్చును. అందుచేత ప్రాత కోటలను నిర్మూల మొనరించి, క్రొత్త కోటలను కట్టు ఆవశ్యకము కూడ ఆ దినములలో ఉండిఉండవచ్చును. ఇంతేగాక, శత్రురాజుల కార్యములవలన కూడ, అనేక ప్రాచీన దుర్గములు, ఇతర పెద్ద కట్టడములు అన్నియు నిర్మూలము లయి ఉండవచ్చును. ఏలనన, అతి ప్రాచీనమందు, జయమొందిన రాజులు, ఓడిపోయిన వారి కోటలను, ఇతర ముఖ్య కట్టడములను, ముఖ్య పట్టణములను నిర్మూలముచేయు అలవాటు పూర్వము లోకమంతటను ఉండెడిది.

ఏమయిన నేమి ? గత శతాబ్దమునుండి మన దేశమందు ఏర్పడి పని చేయుచున్న పురాతత్వశాఖ వారి కృషి ఫలితముగా, శాతవాహనుల నాటివి అటు తర్వాతవి కొన్ని ఆంధ్ర వాస్తువులు, వాస్తు ఖండములు, శిల్పములు, శిల్ప ఖండములు, ఇతర చిత్ర విశేషములు, శాసనములు మొదలయినవి ఈనాడు మనకు లభ్యమయి ఉన్నవి. ఇవన్నియు సంపూర్ణమయినవికావు. అయినప్పటికిని, నాటి ఆంధ్ర జాతి రూపు రేఖలను, అవి మనకు కొంత వరకయినను తెలియజేయగలిగినవై ఉన్నవి.

మనకు నేడు లభ్యమయి పరీక్షింపగలిగిఉన్న ప్రాచీన ఆంధ్ర వాస్తు కళాఖండములు ఉత్తరమున భోపాలు ప్రాంతమందు శాంచీ స్తూపమాది, దక్షిణమున మద్రాసువద్ద మహాబలిపురము వరకు అనేకములున్నవి. వీటియందు స్తూపములు, ప్రాకారములు, తోరణములు, ఇతర కట్టడములు, అనేక శిల్ప ఖండములు మొదలయిన వెన్నియో కలవు. ఈ ప్రదేశమంతయు నేడు ఆంధ్రభాగము కాదు. కాని ఒకప్పుడు ఆంధ్రులు, ఈ ప్రదేశమందంతటను స్థిర స్థావరముల నేర్పాటు చేసికొని, తమ ఆత్మ శేషమునకు, విజ్ఞాన వైభవమునకు రూప కల్పన లొనరించి, తమ కండ్ల ఎదుట స్థిరముగా నిల పుకొని ఆనందించిరి.

వాస్తువు ఒక సామూహిక కార్యము. జాతి రూపు రేఖల నది నిర్వచించును. సర్వ వ్యక్తిత్వములు, వ్యక్తిత్వ భావములు సంఘ కార్యములందే విలీన మొనర్చి, జాతి యంతయు ఏకభావమున నిర్మించిన మహా వాస్తువులందు, నాటి సంఘ ఆశయములు, కోరికలు, ఆచారములు, అలవాట్లు ఒక టేమిటి, జాతి రూపు రేఖలను నిర్వచింప గలుగు అంశము లన్నియు, విడివిడిగాను, క్రమ సంకలనమైన సంపుటిగాను కూడ గోచరించును. వ్యక్తిత్వ విశేషము లుదయించి, సంఘమును మించి బయల్పడు కాలమున, వాస్తువునందు రూప శిల్పములు అంకురించి, సంఘమందు వ్యక్తులవలె వాస్తువునందు జీవించును. వ్యక్తులు సంఘము నతిక్రమించి సంచరించు కాలమున రూప శిల్పములు కూడ వాస్తువునుంచి వేరయి, తమ స్వంత జీవితములతో ప్రకాశింపదొడగును. వ్యక్తుల ఆత్మానుభూతులు, ఆత్మ విశేషములు అన్నియు చిత్రకళయందు అనుభావింపబడును.

నిజముగా మానవ చరిత్రయందు మన మెరుగ గలిగినది స్వల్ప భాగము మాత్రమే. కాని మనకు నేడు లభ్యమయియున్న మానవ ఆత్మ ఉజ్వలవిశేషములగు శిథిల కళా ఖండములను, వాఙ్మిశేషములను అనుసరించియే, ఆదినుంచి మానవుడు పొందిన అంతర్య వికాసగతులను మనము ఎరుగ గలము. కళాఖండములు, శిథిలములయినను, అవి మానవుడు కాల పథమున తన శేషమును వదలి ఏర్పరచిన జాడలు. ప్రతి కళా ఖండమందును, నాటి మానవుని అంతర్యము స్పందించుచునే ఉండును. ఒకే ఫలము ఆ వృక్ష ప్రకృతిని తెలియ జేయగలుగు రీతిని ఒకే కళాఖండము సైతము నాటి జాతి విశేషముల నన్నింటిని మనకు ప్రస్ఫుటింపచేయగలదు. ప్రతి కళా ఖండమందును మానవుని అంతర్యము స్పందించుచునేయుండుటం జేసి, దానినుంచి మానవుని ఆత్మ విశేషము జ్యోతి వలె ప్రకాశించుచునే యుండును. ఈ శిల్ప భావము రసజ్ఞున కెప్పుడును విదితమే.

మన దేశమున కూడ తొలి వాస్తు రూపములు తెలియజేయు గుహాలయములందు రూప శిల్పములుకాని, చిత్రకళా విశేషములుకాని కానరావు. ఆ కాలమందు జాతియంతయు ఐక్య భావముననే వర్తించుచుండెడిది. జాతి కంతటికి, సామూహికముగా అవసరమయు, జాతి నంతటిని ఏకముఖముగా రంజింపజేయగల్గెడి కోటలు, వంతెనలు, ప్రబల హర్మ్యములు మొదలయినవే నాటి కళా స్వరూపములు. వ్యక్తులులేని యీ సంఘమునకు విడి శిల్పములుకాని, విడి చిత్ర పటములుకాని అనవసరము. సంఘమంతయు నాడు ఏక కదనముననే నడిచెడిది. భిన్న భిన్న భావములతో సంఘమును మించి సంచరించు వ్యక్తులానాడు సంఘమున ఉద యింపలేదు. కొంత కాల మవుసరికి వాస్తువు నలంకరించుచూ, వాస్తువునంటికొని శిల్ప రూపములు ఉదయింపసాగినవి. మరికొంత కాలమవునరికి శిల్ప రూపములు వాస్తువునుంచి వేరుపడి, ప్రత్యేక జీవితమును అందుకొన్నవి. చిత్రకళ సయితము రూపమందుకొని, ప్రత్యేక వ్యక్తుల ఆత్మోజ్వలవిశేషములనుసయిత మనుభావింపదొడగినది. చరిత్రయందు కూడ, మొదట వ్యక్తులు ఉదయించి, సమాజమున కలంకారప్రాయులై, క్రమముగా వ్యక్తిత్వము వృద్ధిఅయి, చివరకు సంఘమునుమించి నడుచుకొను పరిణామములన్నియు, మానవ చరిత్రలో కళ స్పష్టముగా వర్ణించుటయేగాక, నిర్వచించును.

క్రీస్తుకు పూర్వము దాదాపు రెండు శతాబ్దములాది శిల్ప విశేషములు, ఆంధ్రజాతికి చెందినవి

కింత భేదము గోచరించును. శాంచి తోరణములకు అడ్డకంబములు మూడు; నిలువు కంబములు రెండు మాత్రమే. అడ్డ కంబములు కూడ విలాసముగా వంపు నందికొని తరంగరూపము నందికొన్నవి. నాటి ఆంధ్ర జాతి హృదయము ఉత్సాహముతో తరంగాయితము. అపయిన ఆ తోరణములపైన లతలతోడను, మృగముల తోడను, మానవుల తోడను, యక్షయక్షిణీలతోడను, కిన్నెర గంధర్వుల తోడను, బౌద్ధ ధర్మముల తోడను, అతి మనోహరముగాను, అతి వినోదముగాను దివ్య నాట్యమును నాటి ఆంధ్రులు అనుభవించిరి నాడు ఆంధ్రము లోక మకుటము. అజాత శత్రువులమను దృఢ విశ్వాసము నాడు వారి సొమ్ము నాడువారు బౌద్ధమతమునంటి లోక కల్యాణ మొనర్ప సంకల్పించిరి. శాంచి తోరణములందు విదితమవు వాస్తు విలాసము, శిల్ప వికాసములు కూడ, ఆ తోరణముల దివ్య ఆహ్వాన భావమునకు ఉత్సాహ వినోదములను జోడించి ఉత్తేజిత మొనర్చినవి. ఆ తోరణ భాగములే అయిన రూప శిల్పములు, ఆంధ్ర జాతిని నాడు అలంకరించుచున్న వ్యక్తిత్వములను బయలు పెట్టుచునే ఉన్నవి. నాడు జాతి యందలి వ్యక్తిత్వములు ఏమాత్రము మరుగుపడలేదు. కాని ఆ వ్యక్తిత్వములు సంఘమును మించి, సంఘ విచ్ఛిన్న కారణములు కాగల దోషములుగా మాత్రము కాలేదు. సంఘ భాగములేఅయి, సంఘమును అలంకరించు మణి భూషణములుగా నాడు ఆంధ్ర మందు అనేక మంది గొప్ప వ్యక్తులుండిరి. ఆ దివ్య వాస్తువుపై నాట్య మొనర్చుచున్న ప్రతిమల ప్రతిబింబించు పసిపిల్లల నిష్కళంక హృదయములే నాటి ఆంధ్రులవి. నాటి ఆంధ్రుల ఆనందమునందు "లోకమంతయు పాల్గొనవలయును."

కాకతీయ తోరణముఖము కఠినము. దీనిపై విలాసమయ రూప కల్పనలులేవు. శిరోభాగమయిన అడ్డ కంబము విలాసముగ ఏ వంపును అందుకొనలేదు. సూచీవలె బుజువయి, కఠినముగా, చక్కగా ఏర్పడి, పాషాణమువలె దృఢముగా ఈ కంబమున్నది. ఈ కంబము చివరలందు ఏర్పడిన హంస రూపములు కూడ, తమ సహజ విలాసమును కోల్పోయి, యీ కంబమున కేర్పడిన ఆ భరణములను కావలి కాయుచున్న తలారులవలె కఠినముగా కనిపెట్టుచూ నిలచి ఉన్నవి. అడ్డ కంబమయిన మకుటమును అతి జాగ్రత్తగా, నిశ్చలముగా నిలుపుటకయి, నిలువు కంబములు ద్విగుణీకరించి ఇరు ప్రక్కల రెండు రెండుగా నిలచి ఉన్నవి. ఈ తోరణములందు కూడ శాంచి తోరణములందువలెనే, స్పందించు ప్రధాన భావము ఆహ్వానమే. కాని ఆంధ్రమును ఆనాడు ఆవరించిన సామ్రాజ్య తత్వ నీతి, స్వరక్షణకు నాడు అవసరమయిన జాగ్రత్త, కాఠిన్యము, ఈ వాస్తువునందు ప్రస్ఫుటితములగుచున్నవి. నాడు ఆంధ్రమందు కాకతీయ వంశమునకు చెందిన ఒక మనిషియే జాతి మకుటము. ఇతర వ్యక్తుల నవసరము. కాకతీయుల మతమే జాతి మతము. ఇతర మతములనవసరములు. నాడు కాకతీయ సామ్రాజ్య కాలమున కూడ, ఆంధ్రులు ఆహ్వాన భావమును త్యజించలేదు. కాని దురాక్రమణ ఉద్దేశముతో వచ్చిన శత్రువుల నరికట్టు సంకల్పము క్షత్రియు కాఠిన్యము, నిరంకుశతత్వభావమును కూడ ఈ తోరణములు నిశ్శబ్దముగా, స్ఫుటముగా స్పందించుచునే ఉన్నవి. నాడు ఆంధ్రమందు వ్యక్తిత్వమునకు తావులేదు. కాకతీయులు వేరు మతము నవలంబించిన జైనులను అతిక్రూరముగాను, కఠినముగాను హింసించిన విశేషములు, దురుద్దేశముతో ఉత్తరమునుంచి ఆంధ్రదేశము పైకి పలుమార్లు దండయాత్రలు చేసిన శత్రువులను కాకతీయ ఛత్రముక్రింద ఏక ముఖముగా నిలిచి, పలుమార్లు ఆంధ్రులు నిరోధించిన విషయములన్నియు చరిత్రాంశములే. ఈ చరిత్రనంతయు, కాకతీయ తోరణములేగాక, నాటి ఇతర శిల్పములు కూడ సహృదయులకు వినిపించు రీతి స్పందించుచున్న మాట సత్యము.

వాస్తువునందు, ఆంధ్రులు తోరణ రూపమును విదిత మొనర్చిన తర్వాత, ఈ తోరణభావము దేశమందంతటను వ్యాపించిన మాట సత్యము. అయినను నేడు అట్టి కళాఖండములు దేశమందు అంతటను కనుపించుటలేదు. ఇందుకు కారణములుకూడ చారిత్రకములే. కాని రాజస్థానమందు పన్నెండు పదమూడవ శతాబ్దములందు, నిర్మించిన తోరణ శిధిలములు, అబూ పర్వతమువద్ద, చంద్రావతీ ప్రాంతమున కూడ కనుపించును. ఆహ్వాన భావముతో, విలాస భావము, సంఘమును మించుతూ దోషమయిన వ్యక్తిత్వ భావములు కూడ, ఈ తోరణ వాస్తువులందు స్పష్టము. కాని కాకతీయ తోరణములందలి జాగ్రత్త, కాఠిన్యము వీటియందు మృగ్యము. మకుటమైన అడ్డకంబము విలాసముగా వంపునందుకొన్నది. పార్శ్వములందలి నిలువు కంబములు, కఠినములుగా చతురస్రములుగాక, విలాసముతో గుండ్రనయినవి రూపశిల్పములు వాస్తు భాగములుకాక, వట్టి అలంకారప్రాయములై, వాస్తువునుమించి వేరయినవి. నాటి రాజపుత్రస్థాన చరిత్ర నేడు అందరికిని విదితమే. ప్రబలుడయిన చక్రవర్తిలేక, చిన్న చిన్న రాజులనేకులు, వినోదములతో అప్రమత్తులై, అజాగ్రత వహించి, శత్రువుల వాత బడిరి. నాడే రాజస్థానపు ప్రతిభావికాసము అంతరించెను. ఏది ఎట్లయినను, హైందవ వాస్తు రూపములకు తోరణ వాస్తువు ప్రాచీన ఆంధ్ర జాతి ప్రసాదించిన ఒక దివ్య రూపమని మన మనుకొనవచ్చును.

ఆహ్వాన భావమును, శాంచి తోరణములు నిర్మించిన తరువాత రెండు మూడు శతాబ్దములకు, ఆంధ్ర జాతి కన్హరీ గుహలందు కూడ మరొక రూపమున పలికిరి. కన్హరీ గుహలందు సాముదాయక జీవనమునకు వసతినివ్వగలుగు పెద్ద విహారములు లేవు. ఒక మహా చైత్యము, గోష్టి శాల అనేక విడి భిక్షుక గృహములు, ఇక్కడి కొండపయి శిల్పితమయినవి. నాడు బౌద్ధ భిక్షుక సాముదాయక జీవనము, పూజ మొనర్చుటకు చైత్యమున కూడుట, గోష్టి సల్పుటకు శాల యందు కలియుట, మొదలయిన కొన్ని సమయములందు మాత్రమే. తక్కిన జీవిత భాగమంతయు భిక్షువులు విడివిడిగా తమ భిక్షుక గృహములందు గడుపుచుండెడివారని, కన్హరీ గుహలకూటము స్పష్టముగా పలుకుచున్నది. శాంచి తోరణముల నాటికన్న, ఈ గుహలనాటికి వ్యక్తిత్వ భావము మరికొంత ప్రాధాన్యత వహించినట్లు విదితము చేయుచు, విడి భిక్షుక గృహములను ఆంధ్రు లిచ్చోట మలిచిరి. ప్రతి భిక్షుక గృహమునకు ముందు అరుగులు, వసారాలు తీర్చి మలిచిఉన్నవి. వీటికితోడు వాకిట్లవద్దనే మంచి నీటి కుండ్లు, ఆ కుండ్లయందు ఎల్లప్పుడు జలము అతి స్వచ్ఛమయి, తేటనయి, చల్లని అమృతమువలె చేతికందుచుండును. ఈ వాస్తురూపము నయితము శాంచి తోరణములవలెనే ఆహ్వాన భావమును సంపూర్ణముగ స్పందించుచున్నది. దారినపోవు ఏయాత్రికుడయినను, ఎప్పుడయినను, ఎవరి యనుమతినీ పొందకయే, స్వేచ్ఛగ గృహాంగణమునందు ప్రవేశించి, కావలసినట్లు అమృతప్రాయమయిన ఆ జలములను తృప్తిమీర సేవించి, విశ్రమింపవచ్చును. ఆ దారిన పోవువారి నెల్ల ఆ భిక్షుక గృహములు నాటినుంచి నేటివరకు ఆ రీతినే ఆహ్వానించుచునే ఉన్నవి. అవసరమయిన వారికి నాడు అక్కడి భిక్షువులు ధర్మమును ముఖతః బోధించినట్లే, నేడు ఆ భిక్షుక గృహములే తమయందలి శిల్పములతో మౌనవ్యాఖ్యలతో బోధించుచునే ఉన్నవి. నేడు కూడ ప్రతి ఆంధ్ర గ్రామమందును, ఇండ్లకు ముందు అరుగులును, వసారాలును సామాన్యమే. నాటికిని, నేటికిని పరాయి వారికి ఆతిథ్యము ఆంధ్రమందు లభ్యమవురీతిన, హిందూదేశమందు మరే ప్రాంతమందును లభ్యముకాదు. ఆంధ్రులు తమ సహజ ఆహ్వానభావమును, మాటలతోనేగాక, తమ వాస్తువుతో గూడ నాటినుండి నేటి వరకునూ పలుకుచునే ఉన్నారు. ప్రాచీన ఆంధ్ర వాస్తువునందు ఈ దివ్య వాస్తు రూపములు, జాతి ప్రకృతియందలి ప్రత్యేకత ననుసరించి ఏర్పడినవేగాని, ఇతర వాస్తువుల, ఇతర రూపముల ఆభాసములుగా కృత్రిమముగా ఏర్పడినవికావు. —(ఇంకా ఉంది)

## 1961

ఉపాధ్యాయుడు—గోపీ, ఈ ఏడాది విశేషాలేమిటిరా?

గోపి—ఎలిజబెత్ రాణీ రాకసార్.

ఉపా—నీవురా రామూ?

రాము—లుముంబా హత్య సార్.

ఉపా—నీవు చెప్పరా సోమూ.

సోము—ఈ సంవత్సరం తిరగేసినా 1961 ఏ నండి.

ప్రతికాభిమాని.

# బంధుజన ప్రియము




# బ్రూక్ బాండ్ టీ

శ్రేష్ఠమైన తాజా టీ

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

JWTBB 363 S

# బహుమానం

ఎస్. జయరామ రెడ్డి

కాళ్ళీడ్చుకుంటూ రవి ఇల్లుచేరేసరికి, వరండాలో పోలీసు ఇన్‌స్పెక్టరు, సూటువేసుకున్న ఇంకొక పెద్దమనిషి కనిపించారు. వారినీ చూడగానే రవికి భయం వేసింది. తాను ఏదో తప్పు చేసినట్లు ఆ పసివాడు బెదరిపోయాడు.

ఇంతకూ వారు అక్కడకు ఎందుకు వచ్చినట్లు?

"అమ్మా ఈవేళ పదిహేనో తారీఖు. స్కూలు ఫీజు కట్టాలి" అన్నాడు రవి పుస్తకాలసంచి భుజానికి తగిలించుకొంటూ.

కారేజిలో అన్నం పెడతూన్న వాళ్ళమ్మ జవాబు చెప్పకుండా ఒక నిట్టూర్పు విడిచింది. రవి జాలిగా వాళ్లమ్మ వేపు చూస్తూ నిలబడి పోయాడు. రవికి ఇప్పుడిప్పుడే సంసారంలోని కష్ట సుఖాలు అర్థ మవుతున్నాయి. అందువల్ల మళ్లీ అడగటానికి నోరు రాలేదు. కాని ఈవేళ ఫీజు కట్టటానికి ఆఖరు రోజు!

తల్లి అందించిన కారేజి అందుకొంటూ "ఈరోజు చెల్లించకపోతే పేరు తీసేస్తారమ్మా" అన్నాడు.

తల్లి కన్నీరు నింపుకొన్నది. పైట చెంగుతో కళ్ళు తుడుచుకొంటూ "రెండు రోజులుఆగుబాబూ, ఎలాగో సర్దుకొందాం. అన్నయ్య కూడా నీ ఫీజుకు డబ్బు కోసమే తిరుగుతున్నాడు" అన్నది.

రవి మారుమాటాడకండా స్కూలుకు బయలు దేరాడు. రోడ్డు ఎక్కుతుండగా బయటి గది లోంచి వాళ్లన్నయ్య కేక వేశాడు—"రవీ, ఒక సారి యిలా వచ్చిపో" అని.

రవి మళ్లీ లోపలకు వచ్చాడు వాళ్లన్నయ్య ఒక కవరు ఇచ్చి "ఇది కొంచెం రిజిష్టరు చేసి తరువాత స్కూలుకు వెళ్ళు రవీ" అని ఒక కవరు అందించాడు. "ఈ రూపాయి కూడా తీసుకెళ్ళు. మిగిలిన చిల్లర డబ్బుతో సిటీ బస్సు ఎక్కి స్కూలుకు వెళ్ళు" అన్నాడు.

రవి కవరు అందుకొంటూ "మళ్లీ ఏదైనా ఉద్యోగానికి దరఖాస్తు పెడుతున్నావా, అన్నయ్యా?" అన్నాడు.

"అవును రవీ, ఎన్ని ...ంతే మాత్రం ఏంలాభంలే ...నకు అదృష్టం లేదురా" ...న్నాడు బాధగా.

అన్నయ్య బాధ రవికి తెలుసు. ఎన్నాళ్ళనుంచో ఉద్యోగం దొరక్క తెగ తిరుగుతున్నాడు అమ్మ



ఎంతకాలమని ముగ్గుర్నీ ఒక్కతే పోషించగలదు? అన్నయ్య కూడా విసుగు లేకుండా తిరుగుతూనే ఉన్నాడు. కాని ఎక్కడా దొరకలేదు. అన్నయ్యకే గనక ఉద్యోగం వస్తే అమ్మ ఎంత సంతోషిస్తుంది? తనను ప్రతి రోజూ అంత దూరం స్కూలుకు నడవనిస్తాడా? రోజూ సిటీ బస్సుకు డబ్బు లివ్వడూ? అంత అదృష్టం ఎప్పుడు వస్తుందో! రవి ఆలోచిస్తూ పోస్టు ఆఫీసుకు వచ్చాడు. అన్నయ్య యిచ్చిన కవరు రిజిస్టరు చేసి, రసీదు తీసుకొని జాగ్రత్తగా సంచీలో దాచుకొన్నాడు. టైము చూస్తే తొమ్మిదిన్నర కావస్తోంది! స్కూలుకి వేళ మించిపోయేలాగుంది. రవి పరుగెత్తుకుంటూ బస్సు స్టాపు దగ్గరకు వచ్చేశాడు.

రెసిడెన్సీకి వెళ్లే బస్సు వచ్చి అపుడే స్టాపులో ఆగింది. అది ఎక్కి వెళ్తే రెసిడెన్సీ నుంచి వాళ్ల స్కూలుకి ఇంకా కొంచెం దూరం నడవాలి. సరే, ఆ కొంచెం దూరం నడిచి వెళ్లవచ్చు. స్కూలుకు టైము అయిపోయిందిగదా అనుకొని రవి ఆ బస్సే ఎక్కివేశాడు.. వెంటనే బస్సు కదిలింది. రవి ఒక చేత్తో కారియరూ, రెండో చేత్తో సంచీ పట్టుకొని పెద్దవాళ్ల మధ్యని నిలబడ్డాడు.

రవికి ఎదురుగా సీటులో కూర్చుని పేపరు చదువుకొంటూన్న పెద్ద మనిషి రవి పడుతూన్న అవస్థ చూసి "ఇక్కడ కూర్చుందువు గాని రా నాయనా" అని తన పక్కనే కొంచెం చోటు చేశాడు. రవి కూర్చున్నాడు. ఆ మనిషి మళ్లీ పేపరులో తల దూర్చేశాడు. రవి ఏమీ తోచక బస్సులో వాళ్ల మొఖాలు చూస్తూ కూర్చున్నాడు.

ఇంకో స్టాపులో బస్సు ఆగింది. కొంతమంది దిగిపోయారు. మరి కొంతమంది ఎక్కారు. వాళ్లలో నలుగు రైదుగురు పిల్లలు భుజానికి సంచులు తగిలించుకుని బిలబిల లాడుతూ బస్సు ఎక్కి, రవికి ఎదురుగా ఖాళీ ఐన సీట్లో కూర్చున్నారు పెద్దగా అరుస్తూ. వాళ్లలో మరీ చిన్న పిల్లవా డొకడు ఉన్నాడు. వాళ్లంతా ప్రతిరోజూ అదే టైముకి స్కూలుకి వెళ్లేవాళ్ళు కాబోలు, కండక్టరు వాళ్ళ అడగకుండానే టిక్కెట్లు ఇచ్చి ఆ చిన్నపిల్లవాణ్ణి పలకరించి ముద్దెట్టుకున్నాడు. మిగతావాళ్లంతా రవి ఈడు వాళ్లే. నవ్వుతూ, పేలుతూ కండక్టరును అల్లరి చేస్తున్నారు. కండక్టరు కూడా సరదాగా వాళ్లతో కలిసి నవ్వేస్తున్నాడు.

రవి బాధగా వాళ్ల వేపు చూస్తూ ఆలోచనలో పడిపోయాడు. ఆ పిల్లలంతా చక్కగా సిల్కు బుష్ షర్టులు వేసుకొని, బూట్లు, మేజోళ్ళు తొడుక్కుని ఏ చింతా లేకుండా చక్కగా కబుర్లు చెప్పుకొంటున్నారు. వాళ్లకు చాలా డబ్బు ఉన్నట్లుంది. వాళ్ల అన్నయ్యలంతా ఉద్యోగాల్లో ఉండి ఉంటారు. లేకపోతే ప్రతిరోజూ సిటీ బస్సు ఎక్కి రాగలరా!? తనలాగ స్కూలు ఫీజును

గురించి వాళ్లకు బాధ ఉండదు కాబోలు ! స్కూలు ఫీజు గుర్తు కొచ్చేసరికి రవికి ఏడుపొచ్చేసింది. ఇవ్వాళ ఎలాగూ పేరు తీసేస్తారు. ఏం చెయ్యాలో రవికి ఏమీ తోచలేదు.

అంతలో తెలుగు మేష్టారు గుర్తు కొచ్చారు. రవికి క్లాసులో మంచి మార్కులు వస్తాయి. అందుకని మేష్టా ర్లందరికీ రవి అంటే చాలా ప్రేమ. తెలుగు మేష్టారు రవిని మరీ ప్రేమిస్తారు. ఈ సంవత్సరం పుస్తకాలు కూడ ఆయనే కొని యిచ్చారు. ఆయనకు చెప్తే పేరు తీసి వెయ్యకుండా కొన్నాళ్ళు ఆపగలరు. కాని ఇలా ఎన్నాళ్ళు గడుస్తుంది ? అన్నయ్యకు ఉద్యోగం ఎప్పుడొస్తుందో ? ఆ పిల్లల్లాగా తనూ సిల్కు చొక్కాలు, బూట్లు వేసుకుని స్కూలుకి వెళ్ళేది ఎప్పటికో ! ఆలోచించిన కొద్దీ రవికి మరీ నిరుత్సాహం కలిగింది. ఇంతకుముందు అన్నయ్య కొన్ని వందల ఉద్యోగాలకి దరఖాస్తు పెట్టాడు. ఒక్కటి కూడ రాలేదు. ఇప్పుడు మాత్రం వస్తుందని నమ్మక మేమిటి ?

బస్సు రెసిడెన్సీలో ఆగింది. ఎదురుగా కూర్చుని ఉన్న స్కూలు పిల్లలు బస్సు ఆగీ ఆగకముందే ముందు వాళ్లను నెట్టుకుంటూ దిగి వెళ్లిపోయారు. ఆ బస్సు అక్కడ నుంచే మళ్లీ తిరిగి వెనక్కు వెళ్లిపోతుంది. అందుకని అందరూ దిగిపోతున్నారు. బస్సు దిగేప్పుడు గాని, ఎక్కేప్పుడు గాని ఒకళ్ల నొకళ్లు తోసుకోగూడదని సిటిజన్‌షిప్ మాష్టారు చెప్పేవాడు. రవికి అది గుర్తు వచ్చి అందరూ దిగిపోయే వరకూ మర్యాదగా వెనకనే నిలబడి పోయాడు. అందరూ దిగాక మెల్లగా తను దిగుతూఉండగా రవికి ఒక మూల సీట్లో ఏదో సంచి కనుపించింది. ఎవరో అక్కడ కూర్చుని దాన్ని మర్చిపోయి ఉండాలి ! కాని బస్సులో వాళ్లంతా దిగిపోయారు. రవి దాన్ని తీసుకొని బస్సు దిగాడు. అంతకుముందు బస్సు దిగిన వాళ్లంతా అప్పటి కప్పుడే జనంలో కలిసిపోయారు. ఆ సంచిని కండక్టరు కైనా వప్పజెబుదామని రవి కండక్టరు కోసం చూశాడు. కాని కండక్టరు ఏ టీ హోటల్లో దూరాడో గాని రవికి కనిపించలేదు. అవతల స్కూలుకు టైము అయిపోతూంది. సరే తరువాత చూద్దాంలే అనుకొని రవి స్కూలువేపు పరుగెత్తాడు.

స్కూల్లో అడుగు పెట్టేప్పటికి ఇంకా మొదటి గంట కూడా కొట్టలేదు. రవి తెలుగు మాష్టారి కోసం స్టాఫ్ రూము వేపు వెళ్లాడు. ఆయన అప్పటికి ఇంకా స్కూలుకు రాలేదు. రవి నిరాశతో అక్కడే నిలబడి పోయాడు. రవికి అప్పుడు గుర్తొచ్చింది బస్సులో తనకు దొరికిన సంచి. దానిలో ఏముందో నని లోపల చెయ్యి పెట్టేసరికి ఏవో పుస్తకాలు చేతికి తగిలాయి. రవి వాటిని బయటకు తీశాడు. వెంటనే రవికి ముచ్చెమటలు పోశాయి. గుండె జనతా ఎక్స్‌ప్రెస్‌లాగా కొట్టుకోవటం మొదలెట్టింది. అవన్నీ పది రూపాయల నోట్ల కట్టలు. మెరిసిపోతున్న కొత్త కట్టలు ఐదు ఉన్నాయి. రవి అంత డబ్బును ఎప్పుడూ చూడలేదు. కాళ్ళు వణుకుతున్నాయి. ఆ డబ్బును ఏమి చేయాలో రవికి తోచలేదు. పాపం ఎవరు

పారేసుకున్నారో ? అంతలో స్టాఫ్ రూం వేపు ఎవరో రావటం చూసి ఆ నోట్ల కట్టలన్నీ వెంటనే సంచీలో పెట్టివేశాడు. ఆ వచ్చిన మనిషి తెలుగు మేష్టారు.

"ఏంరా రవీ, ఏం జరిగింది ? అలా ఉన్నావేం" అన్నారు ఆయన.

రవి ఈ లోకంలోకి వచ్చాడు. తడబడుతూ "ఏం లేదండీ—" అన్నాడు.

తెలుగు మేష్టారు రవి భుజం మీద చేయి వేసి ప్రేమతో "కాదులే, ఏదో జరిగింది. నాకు చెప్పు నాయనా" అన్నారు.

రవి జంకుతూ ఫీజు సంగతి చెప్పాడు. ఆయన

వచ్చి "అంతే కదా ? ఫీజు నేను కడతానులే. భయపడకు. క్లాసుకు వెళ్లి చదువుకో పో" అన్నారు.

రవి సంతోషంగా రెండడుగులు ముందుకు వేశాడు. అంతలోనే బస్సులో దొరికిన డబ్బు గుర్తుకొచ్చి మేష్టారుకి చెప్పా లనుకుని "సార్" అన్నాడు. ఆయన రూములోకి వెళుతూన్న వాడల్లా వెనక్కు తిరిగి "అదంతా రేపు చెబుదువు గాని లే వెళ్ళు. నేను పేపర్లు దిద్దుకోవాలి' అంటూ ఆయన లోపలికి వెళ్ళిపోయారు.

రవికి ఆయన ధోరణి అర్థంకాక అయోమయంగా క్లాసులోకి వెళ్ళాడు. నోట్లు ఉన్న సంచీని జాగ్రత్తగా పుస్తకాల సంచీలో దాచి ఆలోచనల్లో మునిగిపోయాడు. ప్రస్తుతానికి ఫీజు బాధ తప్పినట్లే. మళ్ళీ నెల వరకూ ఫరవాలేదు. కాని ఆ డబ్బు—ఎవరిదో పాపం ? అది పోయి నందుకు వాళ్ళెంతగా బాధపడుతున్నారో ! అది పోవటంవల్ల ఎన్ని కష్టాలు అనుభవిస్తున్నారో ? రవికిక్లాసులో చెప్పే పాఠాలు బుర్ర కెక్కడం లేదు. ఎలాగైనా ఆ డబ్బు వాళ్ళకు అందజేయాలి! ఎలా ? ఎవరని తెలుసుకొనేట్లు ?

మూడవ పీరియడు డ్రిల్లు. డ్రిల్లు మాస్టారు ఆరోజు రాలేదు. అందువల్ల పిల్లలంతా గ్రౌండులో చెట్టుకింద చేరి కబుర్లు చెప్పుకొంటున్నారు. రవికి వాళ్ళతో కలవాలని అనిపించ లేదు. ఒక్కడే కూర్చొని చాల సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. డబ్బు సంచి ఎక్కడ పోతుందోనని చాల జాగ్రత్తగా పట్టుకొన్నాడు. చివరకు ఒక స్నేహితుడి దగ్గరకు వెళ్లి "ఏంరా, మనం బస్సుల్లో ఏదైనా పారేసుకుంటే ఏం చెయ్యాలి?" అని అడిగాడు.

"ఏముందీ. పోలీసులకి రిపోర్టు ఇస్తే సరి. ఎక్కడైనా దొరికితే మనకు కబురు చేసి యిస్తారు. లేకపోతే లేదు. ఏం, ఏమైనా పోయిందా ?"

"ఆ, కలం పోయింది" అంటూ రవి పోలీసు స్టేషను వేపు పరుగు తీశాడు.

రవి సుల్తాన్ బజారు పోలీసు స్టేషనులోకి వెళ్ళేటప్పటికి ఇన్‌స్పెక్టరు ఏవో వ్రాసుకొంటున్నాడు. పోలీసుల దగ్గరకు వెళ్ళాలంటే రవికి చిన్నప్పటినుంచీ కూడా ఎందుకో చాలా భయం. ఇప్పుడు కూడ భయపడుతూనే లోపల ప్రవేశించాడు. వ్రాసుకొంటున్న ఇన్‌స్పెక్టరు తల పైకెత్తి "ఏం కావాలి ?" అని ఉర్దూలో ప్రశ్నించాడు.

రవి నసుగుతూ "డబ్బు—డబ్బులు దొరికాయండీ" అన్నాడు.

ఇన్‌స్పెక్టరు చిత్రంగా రవి వేపు చూసి "దొరికితే అవి పెట్టి టీ త్రాగు. లేకపోతే చాకొలెట్లు కొనుక్కో" అన్నాడు. అని మళ్లీ కాగితాల్లో మునిగిపోయాడు.

"కాదండీ, చాలా డబ్బు దొరికింది—" అంటూ నోట్ల కట్టలు తీసి చూపించాడు రవి.

ఇన్‌స్పెక్టరు కళ్ళు పెద్దవి చేసుకొని రవి వంక ఆశ్చర్యంగా చూస్తూ కాగితాలు ప్రక్కకు నెట్టి "ఇలా కూర్చో!" అన్నాడు.

రవి ఆ డబ్బు అలాగే చేతులో పట్టుకొని కూర్చున్నాడు

"నీ పేరేమిటి ?"

రవి చెప్పాడు.

"మీ నాన్నగారు ఏం చేస్తారు ?"

"నాన్న లేడు. అన్నయ్య ఉన్నాడు."

"మీ అన్నయ్య ఏం పని చేస్తాడు ?"

## బహుమానం

"ఏమీ లేదు. అన్నయ్యకు ఉద్యోగం దొరక్కనే మేమంతా చాల కష్టపడుతున్నాం" అన్నాడు రవి.

"అలాగా, పాపం!—ఈ డబ్బు ఎప్పుడు దొరికిందో, ఎలా దొరికిందో అన్నీ వివరంగా చెప్పు" అన్నాడు ఇన్‌స్పెక్టరు

రవి అంతా సవిస్తరంగా చెప్పాడు ఇన్‌స్పెక్టరు అన్నీ వ్రాసుకున్నాడు. తరువాత రవి వేపు

చూసి "ఈ డబ్బు ఎవరిదో మేము కనుక్కుంటాం. నువ్వు ఇక్కడే ఉండు" అని ఒక కానిస్టేబులును పిలిచి కాసిని బిస్కెట్లు టీ తెప్పించి రవికి ఇప్పించాడు.

రవి టీ త్రాగుతూండగా ఇన్‌స్పెక్టరు పోలీసు సూపరెంటెంటుకూ, ఇతర పోలీసు స్టేషన్లకూ ఫోనుచేసి ఏదో చెప్పాడు. ఆ పనులన్నీ అయిపోయిన తరువాత రవిని దగ్గరగా కూర్చోబెట్టుకొని అదీ ఇదీ అడుగుతూ ఆప్యాయంగా కబుర్లు చెప్పాడు. అంతలో టెలిఫోను మ్రోగింది. ఇన్‌స్పెక్టరు తీసేవరు అందుకొని చాలసేపు ఏదో మాట్లాడాడు ఇంగ్లీషులో. చివరకు ఫోను పెట్టివేసి "చూడు బాబూ, ఈ డబ్బు ఒక పెద్ద బట్టల మిల్లు వారిది ఆ మిల్లువారు ఖైరతాబాదు పోలీసు స్టేషనులో రిపోర్టు యిచ్చారు. నీవు చాల మంచివాడివి కాబట్టి దొరికిన డబ్బు తిరిగి ఇచ్చివేశావు. ఇంకొకళ్లయితే గప్‌చిప్‌గా వూరుకునే వాళ్ళు. ఆ మిల్లు వాళ్లకు చెప్పి నీకు మంచి బహుమానం ఇచ్చేటట్లు చేస్తాను. ప్రస్తుతానికి నీవు మీ యింటి అడ్రసు ఇచ్చి వెళ్లవచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

రవి అడ్రసు యిచ్చి కాళ్లీడ్చుకొంటూ ఇంటికి బయలుదేరాడు. రెండు మైళ్ళు నడిచి ఇంటికి చేరేప్పటికి ఒక గమ్మత్తు జరిగింది. ఇంటిముందు రోడ్డుమీద ఒక కారు నిలబడి ఉన్నది. వరండాలో కుర్చీల మీద పోలీసు ఇన్‌స్పెక్టరూ, సూటు వేసుకున్న ఇంకొక పెద్దమనిషీ కూర్చుని ఉన్నారు. తనకంటే ముందుగా అక్కడకు వచ్చిన వాళ్లను చూసి రవి ఆశ్చర్యపోయాడు.

అసలు జరిగింది ఇది: రవి పోలీసు స్టేషను నుంచి ఇంటికి బయలుదేరాక కొంచెం సేపటికే బట్టల మిల్లు మానేజరు పోలీసు స్టేషనుకు ఫోను చేశాడు. ఐదువేలు పోయినందుకు వాళ్లకు అంత బాధ లేదు కాని అవి మళ్లీ దొరికినందుకు ఆ మానేజరుకు చాల ఆశ్చర్యం కలిగింది. గొప్ప ధర్మబుద్ధితో ఎక్కడో దొరికిన అంత డబ్బును తిన్నగా పోలీసు స్టేషనులో వప్పజెప్పిన ఆ కుర్రాడిని చూడాలని ఆయనకు అభిలాష కలిగింది. వెంటనే స్వయంగా కారు వేసుకుని పోలీసు స్టేషనుకు వచ్చాడు. కాని అప్పటికే రవి ఇంటిదోవ పట్టాడు. అందువల్ల ఆయన ఇన్‌స్పెక్టరును వెంట బెట్టుకొని రవి ఇచ్చిన అడ్రసు ప్రకారం వాళ్ల యింటికి వచ్చారు.

వరండాలో వారిని చూడగానే రవికి ఎంతో భయం వేసింది. తను ఏదో తప్పు చేయకపోతే వాళ్ళు ఇంటి కెందుకు వస్తారు? ఒకవేళ ఆ డబ్బును తనే దొంగిలించానని అనుకొంటున్నారేమో!

రవిని చూడగానే వాళ్లమ్మ సంతోషంతో "అడుగో వాడే బాబూ మా రవి" అన్నది. కుర్చీలో కూర్చున్న మిల్లు మానేజరు లేచి వచ్చి, ప్రేమగా రవి చేయి పట్టుకొని ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

"చూడమ్మా, నీవు చాల అదృష్టవంతురాలవు. ఇటువంటి కుమారు డుండటం నీ భాగ్యమనే చెప్పాలి. ఈ కుర్రవాణ్ణి చూస్తుంటే నాకు చాల సంతోషంగా ఉంది." రవిని ఉద్దేశించి "బాబూ!, నీవు చక్కగా చదువుకొని గొప్పవాడివి కావాలి సుమా! నీ మంచితనానికి బహుమానంగా ఇదిగో ఐదు వందల రూపాయలు ఇస్తున్నాను" అంటూ డబ్బు తీసి రవికి ఇవ్వబోయాడు. కాని రవి తీసుకోలేదు. వాళ్లమ్మవేపు చూశాడు.

అది చూసి ఇన్‌స్పెక్టరు ఆవిడ నుద్దేశించి "మీరు చెప్పండి. తీసుకుంటాడు" అన్నాడు. ఆవిడ సమాధానం చెప్పకముందే బలవంతంగా ఆ డబ్బును రవి జేబులో పెట్టాడు. ఆవిడ నవ్వింది. రవిని లోపలకు పిలిచి వాళ్ళకు కాఫీ పట్టుకు రమ్మని చెప్పింది. రవి ఉత్సాహంగా ఫ్లాస్కు పట్టుకొని హోటలుకు పరుగెత్తాడు.

ఈ లోపున ఆయన వాళ్ల కుటుంబ పరిస్థితులన్నీ తెలుసుకున్నాడు. కాఫీ త్రాగుతూన్నంత సేపూ రవిని పొగుడుతూనే ఉన్నాడు. రవికి ఎంతో సిగ్గు వేసింది.

కాఫీలు త్రాగటం అయ్యాక వాళ్లిద్దరూ వెళ్లిపోవటానికి బయలుదేరారు. వారిని సాగ నంపటానికి రవీ, వాళ్లమ్మా గుమ్మం వరకూ వెళ్లారు. మానేజరు కారులో ఎక్కబోతూ "చూడమ్మా, మీ కుటుంబ పరిస్థితులన్నీ తెలుసుకున్నాక మీకు ఇంకొక సహాయం చెయ్యాలని అనిపిస్తూంది. మీ పెద్ద అబ్బాయిని రేపు మా మిల్లు వద్దకు పంపించండి. ప్రస్తుతానికి నేను వంద రూపాయల ఉద్యోగం యిస్తాను. అతను కూడ మీ చిన్నబ్బాయి వంటి వాడైతే ఇంకా పెద్ద జీతంలోకి పోతాడు" అంటూ కారెక్కాడు.

రవీ, వాళ్లమ్మా ఆయనకు నమస్కారం చేశారు. కారు కదిలిపోయింది.

"ఏమమ్మా, అన్నయ్యకు ఉద్యోగం ఇస్తామంటున్నారు కదూ?" అని అడిగాడు రవి.

"అవును నాయనా, ఇదంతా నీ వల్లనే బాబూ" అంటూ రవిని ప్రేమగా దగ్గరకు తీసుకొన్నది. ★

---

హిందీ మాస్టారు-రామూ, హిందీలో తెలివిగలవాడిని ఏమంటారురా?

రాము-'అక్లమంద్', సార్.

హిందీ మాస్టారు-సోమూ, 'తెలివిలేనివాడి'ని ఏమంటారురా?

సోము-'నల్లమంద్', సార్.

(ఉండవిల్లి సత్యనారాయణ)
(కాకినాడ)

# పడవ వెళ్ళిపోయింది..

ఏటికి కల చెదిరిపోయినప్పుడు, హరిదాసుకు మనసు నిద్దరోయింది. ఈ వూరికి హరిదాసెప్పుడు వచ్చాడో, ఎవరికీ జ్ఞాపకం లేదు. అయితే అతడు మన్నయిం దిక్కడేనని అందరికీ తెలుసు.

ఇప్పుడా హరిదాసు లేడు. అతని జ్ఞాపకాలే 'హరిదాసు దిబ్బ' మీది మర్రిచెట్టు వూడల్లా వ్రేలాడుతున్నయ్. అతని తంబురాపాట ఇక మ్రోగదు. అయినా వెన్నెల రాత్రిళ్ళ, ఏటిలో తెరచాపెత్తిన రాదారి పడవకు చుక్కానిపట్టే పల్లెశేషాద్రి విప్పిన గొంతులో హరిదాసు పాట యిప్పటికీ మ్రోగుతూనే ఉంటుంది. పాట సవ్వడిలో హరిదాసు బ్రతుకుబాట రూపు కడుతుంది. గాలి ఆ పాటని మోసుకొచ్చి మర్రి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తోంది. మర్రిచెట్టు వూడలు దాని జ్ఞాపకాల్లాగా కదులుతయ్ పాట విని. హరిదాసు దిబ్బమీద ఇన్ని ఎండు ఆకులు రాలిపోతయ్, మర్రి కార్చిన కన్నీళ్ళవలె.

వెన్నెలరాత్రి ఏటిలో తెరచాపెత్తిన పడవ పడగొప్పైకెత్తి, వెర్రున పోయే త్రాచులా పోతోంది వాలుగాలిలో. ఇంతలో అవతలి ఒడ్డునుంచి, కేక విన్పించింది. శేషాద్రిపాటాపి చెవులు నిక్కించి విన్నాడు. 'పోనిరా, శేషాద్రీ! సగందూర మొచ్చాక మళ్ళీ ఏమిటి? చివరి పడవని తెలీదా? ఇప్పటికే పొద్దు పోయింది' అన్నాడు మున్సబు రంగయ్యగారు.

> హరిదాసు పుట్టిందెక్కడో తెలియదు. పోయింది మాత్రం ఆ గ్రామంలోనే. బ్రతికినంత కాలం ముష్టెత్తాడు. తన పొట్ట కోసం కాదు. దేవుడు కోసం! కాని మహాజ్ఞానులు, పెద్దలు హర్షించలేకపోయారు. ఎందుచేతనో!
>
> హరిదాసు శ్రమ...

'కాదు బాబూ! చివరి పడవే అయినా, ఒక్కొక్కప్పుడు వేళ మించిపోతుంది. కొత్తవాళ్ళకీ సంగతి తెలీ'దంటూ పడవ మళ్ళించాడు శేషాద్రి. మునసబుగారు గొణుక్కుంటున్నారు ఆలస్యమవుతోందని.

వచ్చిన కొత్తమనిషి మున్సబుగారి ప్రక్కనే బెడ్డింగ్ వేసి ఠీవిగా కూర్చున్నాడు. మున్సబుగారు తలపాగా సర్దుకుంటూ ఒక్కసారి అతడిని చూస్తూ 'ఈ వూరికి కొత్తవాళ్ళలాగా కన్పిస్తున్నారు. ఆఖరి పడవ ఎన్నింటికో తెలీదనుకుంటా' అన్నాడు.

'ఎబ్బె బొత్తిగా! ఇదే ఇటువైపు రావటం' అన్నాడా క్రొత్తమనిషి.

'ఎవరింటికి' అన్నాడు మున్సబ్‌గారు.

'దేవిడీకి' అన్నాడు కొత్తమనిషి.

'అయితే మీరు సాములారికే మవుతారు ?' అన్నాడు మున్సబ్.

'మనుమణ్ణి.'

'అంటే కూతురుబిడ్డా.'

'అవును.'

'పేరూ ?'

'రాజశేఖరం' అన్నాడు.

ఇంతలో శేషాద్రి దిబ్బెన పట్టుకొచ్చాడు రాజశేఖరం దగ్గరికి. 'బాబూ! హరిదాసు దిబ్బెనలో మీకు తోచిన కానుక వెయ్యండి' అన్నాడు.

'ఎందుకూ ?' అన్నాడు రాజశేఖరం.

మున్సబు కోఅగా నవ్వుతూ 'వెనుకటికి రాములారికి వారధి కట్టేందుకు ఉడత సాయం చేసిందంటారులే. అట్లాగే ఇదంతా పోగుజేసి, ఈ వూరిలో శేషాద్రి పడిపోయిన గుడిని కట్టిస్తాడులే. వేయండ మీకు తోచింది' అన్నాడు వెటకారంగా.



# తెలిసిరాని విశ్వాని

*శాద్రి కళ్లల్లో ఏదో తెలీని గతం తొంగిచూచింది ఎర్రగా. వుడిసొమ్ము తిని బాగుపడ్డవాడెవడులే. అట్లాగే నేనూను' న్నాడు శేషాద్రిరోషంగా. ఆ మాటలు ములుకుల్లా తాకినయ్ న్నబ్కు. రాజశేఖరం దిబ్బెనలో కాన్క వేశాడు.మున్నబు హ్యాంతపోయి చూచాడు. ఏదో తెలియని అవమాన భారంతో.

## 2

ఆవూరి దేవాలయం కట్టవతల ఏటి ఒడ్డునఉంది. శిథిలా ్థలో. ప్రతియేడూ వచ్చే వరదలకు తట్టుకోలేక కట్టవతలి ట్టుకున్నారుకొత్తూరును. దేవుడు మాత్రం ఇక్కడే ఏటిప్రక్కన ఏమీ తోచని ఈ వూరికి, అమ్మ బలవంతానవచ్చాడు రాజశేఖరం.. తయ్య పోయింతర్వాత ఇదేరావటం. బొత్తిగా ఈ వూళ్లోఎవళ్లూ కపోవటంవల్ల, ఒక్కడే ఏటిఒడ్డుకు బయల్దేరాడు.నగంపడిపోయిన గోపురం, పుచ్చి నేలకొరిగేధ్వజస్తంభం, కళ్యాణమంటపం అంతా ్గాలనివాసం. అయినా ఒక్కసారి దేవుణ్ణి చూచిపోదామనిపించింది. తకీ పూజారి రావటంలేదు. చేతిలోని పుస్తకంలో అస్తమయ యల్ని పులుముకొన్న దేవాలయాన్ని చిత్రిస్తున్నాడు. బొమ్మ మే పూర్తయింది. చీకటిపడిపోయింది. పూజారినిరీక్షణంతో యం చాల గడచింది. సిగరెట్‌పెట్టె పూర్తయింది. బొమ్మే దు.

ఇంతలో ఎవరో వచ్చి వూడుస్తుం ్డ.అప్పుడే కాల్చేసిన, సిగరెట్ క్రింద శాడురాజశేఖరం. వూడవటానికి వచ్చిన షి 'ఎవరయ్యా! గుళ్లో చుట్టలు ుస్తావ్!' అంది.

'ఎవరు నీవు ?' అన్నాడు రాజా.



'మీ రెవరు ? దేవుడి కలపకు నిప్పెట్టేందు కొచ్చినట్టున్నారే ?' అంటూ రుసరుస లాడుతూ పోతోంది.

'ఏమిటే లచ్చి ! వాగుతున్నావ్ ?' అంటూ పూజారి కోటయ్యగారు వచ్చారు లోపలికి.

'చూడయ్యా ! ఇదివర కోసారి దేవుడి కొత్త కలపకు ముట్టించినట్టుగానే, మళ్లీ యీాయ నెవరో పాత కలపకు ముట్టించేందు కొచ్చిన ట్టున్నాడు' అంటూ వెళ్లిపోయింది.

పూజారి కోటయ్యగారిటే వస్తూ 'ఎవరు బాబూ ! అక్కడ ?' అన్నారు.

'నేనే.'

'నీవా ? బాబూ! ఏం ? ఎలాఉంది మావూరు ?' అన్నారు కోటయ్యగారు.

'ఇలాగే ఉంది' అన్నాడు రాజశేఖర్.

'దాని మాటలు పట్టించుకోకు. అది పిచ్చిది' అన్నారు కోటయ్యగారు.

'నిప్పు ముట్టించటానికి వచ్చాననటుందేమిటి ?' అన్నాడు రాజా.

'దాని మొఖంలే. ఎప్పుడో కర్మంచాలక ప్రమాదము జరిగిందని ఎప్పుడూ జరుగుతుందా ?' అన్నారు ప్రశాంతంగా.

'ఏం జరిగిం దిదివరకు ?' అన్నాడు రాజా.

గుళ్లో హారతి అయింది. విభూతిరేఖలు, కుండలాలు, ఎర్రని కుంకుమబొట్టూ బొద్దయిన శరీరం, కోటయ్యగారికి పెట్టని సొమ్ములు. ఆయన కన్నులు జ్యోతుల్లా వెల్గుతున్నయ్.

'ఆ పిల్లదాని తీరే అంత. ఈ దేవుడికీ దానికీ ఏదో అనుబంధం. ఎవరూ దానికేమీ యివ్వరు. అయినా గుడినీ, దేవుణ్ణీ, కంటికి రెప్పలా కాపాడుతుంది. వాళ్లమ్మ నల్లగా చేరెడంత బొట్టుతో, సోదె బుర్ర పుచ్చుకొని వస్తూఉంటే 'దుర్గ' వస్తోందా ? అనిపించేది. ఇదిగో ! ఈ పిచ్చిదానికీ వాళ్లమ్మకూ పోలికేలేదు. సోదె చెప్పే మంగి దేవూరో ఇక్కడివాళ్ల కెవరికీ తెలీదు. మంచి వయస్సులో, ఈ పిచ్చిది పుట్టగానే, దాన్ని మొగుడు వదిలిపెట్టి మరోదాన్ని చేసుకున్నాడు. బతికేందుకు దారిలేక సోదెబుర్ర పుచ్చుకుని ఈ వూరు చేరింది. అప్పటినుంచీ ఈ వూరే దానిదై పోయింది.'

'హరిదాసు దిబ్బైన అని నా దగ్గర కానుక గుంజా డా పల్లెకారి' అన్నాడు రాజా.

'తొందరపడి అలా అనకు నాయనా !' అన్నాడు పూజారి.

'మున్సబ్‌గారి మాటల్నిబట్టి చూస్తే అందులో ఏదో కొంత మాయ ఉందనిపించింది నాకు' అన్నాడు రాజా.

'మున్సబులోనే మాయ ఉంది బాబూ ! పల్లె శేషాద్రి నేమీ అనకు !' అన్నాడు కోటయ్యగారు.

'అలాగా' అన్నాడు రాజా.

'మీ తాతగారూ, మున్సబ్‌గారూ యీ గుడికి ధర్మకర్తలులే. అంచేతా .... అయినా ఎందుకులే పోనిద్దూ' అన్నాడు కోటయ్యగారు.

'అసలు సంగతి చెప్పండి భయంలేదు. ఇంతకీ శేషాద్రి పోగుచేస్తూ హరిదాసు దిబ్బేనంటా డేమిటి ?' అన్నాడు రాజు.

'అవును ! నాయనా ! ఈ పిచ్చిదీ, ఆ పల్లె శేషాద్రీ యిద్దరూ హరిదాసుకు వారసులు. పాపం బతికిననాళ్లలో ఈ దేవుణ్ణి వూళ్లోకి తరలిద్దామని హరిదాసు ఎంత కలగన్నాడో !' అన్నారు పూజారి.

'ఎవరా హరిదాసు ?' రాజు.

'హరిదాసు హరిదాసే. పుట్టిం దెక్కడో తెలీదు. పోయిం దిక్కడే. అతడు బతికినంత కాలం ముష్టెత్తాడు. తన పొట్టకోసం కాదు. ఈ దేవుడి కోసం' అంటూంటే పూజారి కళ్లల్లో చీకటి తొంగిచూచింది.

'దేవుడిపేరు బెట్టి .... దొంగ సాధువు లెంత మంది పొట్టలు నింపుకోవటంలేదు. అలాగే యీ హరిదాసూ చేసిఉంటాడు. అలా కాకపోతే అతని జీవితంలో దేవుడికి చేసిందేమీ కన్పడదేం ?' అన్నాడు రాజు.

'దేవుడికి అతడు చేసిందేమిటో చూపించేందు కివ్వాళ బహుశా ఏమీ మిగలక పోవచ్చు. దానికి కారణం అతణ్ణి బతికిన కాలంలో, దేవుని పేర ఏం చెయ్యనిచ్చారు గనుక .... యివ్వాళ నీకు చూపించను' అన్నాడు పూజారి కోటయ్యగారు.

'మంచి పనికి పూనుకుని అందరూ చెయ్యలేక పోవచ్చు. అయినా ఎవరన్నా చేస్తుంటే మనదేం పోయిందని చూస్తూ వూరుకునే శక్తి కూడా లేని మూర్ఖు లున్నారన్నమాట యీ వూళ్లో' అన్నాడు రాజశేఖరం.

'మూర్ఖులనకు నాయనా. హరిదాసు ప్రయత్నాన్ని భంగపుచ్చిన ప్రముఖులంతా, లోకం మెచ్చుకొనే జ్ఞానులు. పెద్దలూ' అన్నాడు పూజారి.

'పెద్దలా .... ఈ వూరి వరకేనా ?' అన్నాడు రాజు.

'మీ తాతగారి కీర్తి నీ కేమి తెలుసు. ఈ చుట్టుపట్ల ఆయనకు మహాజ్ఞాని అని ప్రసిద్ధి. అలాగే మున్సబ్‌గారికీ మించిన గౌరవం ఉంది పెద్దలని. వీరే యీ గుడికి ధర్మకర్తలు. అప్పటికీ, యిప్పటికీ'

'మీరేదో చమత్కరిస్తున్నట్లున్నారే ! హరిదాస సంగతి దాటేసి, మా తాతని పొగడుతున్నారు. ఇందులో ఏదో కిటుకు ఉండి ఉండాలి' అన్నాడు రాజశేఖరం తెలివిగా.

'కిటుకేమీ లేదు ! నాయనా ! ఈనాటికీ వృధివీశ్వరస్వామి ఇలా మనకు దర్శన మిస్తున్నాడంటే ఆ చలవంతా వా రిద్దరిదే.'

'ఏమిటీ ? గబ్బిలాలను దేవుడు కరుణించి కాపుర ముండనిస్తున్నది, మా తాతగారి ప్రార్థన వినేనా ? బేష్ !' అన్నాడు రాజు.

'అవును ! నాయనా ! మీ తాతగారు సంకల్ప సిద్ధులు. ఆయన ఏదనుకుంటే అదే జరిగేది. అంత శక్తి ఉండేది ఆయనకు' అన్నాడు కోటయ్యగారు.

ఆయనే మనుకున్నాడు ?'

'ఆయన మహాజ్ఞాని కావటం మూలాన బయటి ఆడంబరా లాయనకు గిట్టేవి కావు. వైభవాలుఅజ్ఞానులైన మనుషులకు గాని, నిర్గుణుడైన దేవుడు వీటి కతీతుడు. దేవుడిది కావాలని ఎవరినన్నా కోరితే మనలాగే మనిషే అవుతాడు కదా ! ఇదంతా దేవునిపేర మనుషులు తమ ముచ్చట్లు తీర్చుకోవటం అంతే. కొందరు తామే ప్రయోజకులమని, దేవునిపేర అది చేస్తామని, ఇది చేస్తామని చందాలు పోగుచేయటం అజ్ఞానం. దేవుడి సంగతి దేవుడే చూచుకోలేకపోతే యీ మనుషులటయ్యా ! ఆయనకు చేయగలది. ఈ వాక్యా లాయన తు. చ. తప్పకుండా ఆచరించేవారు. చివరికి ఆయన చెప్పిన మాటే నిజమైంది. ఈ దేవుడి కిప్పుడు మాత్రం ఏం తక్కువైంది ? నూటపదహా రెకరాల మాన్యం ఉందికదా ! అంత అయివేజి ఉన్నా, ఇది జరగాలని ఎప్పుడూ పట్టుపట్టలేదు. నిర్గుణుడు కనుక' అన్నాడు చిరునవ్వు చిందే మోముతో కోటయ్యగారు.

'కలియుగంలో .... దేవుడు కదూ ! పెట్టితే వద్దనడు. లేకపోతే కావాలనడు. అలాగని ఆస్తి అంతా మింగే మనుషుల్ని ఏమనాలి ?' అన్నాడు రాజు.

'ధర్మకర్తలు నాయనా ! వాళ్లు. ఇప్పటికీ ఈ దీపం వెలుగుతోందంటే వాళ్ల చలవే బాబూ!' అన్నాడు కోటయ్యగారు.

'హరిదాసు సంగతి దాటవెయ్యకండి' అన్నాడు రాజు.

'ఎబ్బే ! లేదు. హరిదాసు వూరూరా తిరిగి యీ దేవునికై డబ్బు పోగు జేస్తున్నాడంటే స్వాములవారు నవ్వేవారు. వట్టి అజ్ఞానమని. మీ తాతగారి మాటను సుగ్రీవాజ్ఞగా భావించి ఆచరించేవాడు మున్సబు రంగయ్యగారు. వారేమని సంకల్పించినా కార్యరూపాన్ని రంగయ్య గారికే యిచ్చేవారు. ఆ నూటపదహా రెకరాల మాన్యాన్నీ చెడకుండా పట్టుకొచ్చిన ఘనత వా రుభయులదే' అన్నారు కోటయ్యగారు.

'అది సరేనండీ ! దీనిపై వచ్చే ఆదాయం ఏమవుతోంది ?' అన్నాడు రాజు.

'దైవకైంకర్యం పేరిట తప్ప కానీ వూరికే ఖర్చుపెట్టనని మీ తాతగారి ప్రతిజ్ఞ. ఇప్పటికీ రంగయ్యగారి చేతులో ఆ మాటే చెల్లుతోంది' అన్నాడు కోటయ్యగారు.

'అయితే హరిదాసు దిబ్బేన శేషాద్రి ఎందుకు పోగుచేస్తున్నాడు' అన్నాడు రాజు.

'పదేళ్లనాడు హరిదాసు, మంగీ, కలిసి ఒక వెయ్యి రూపాయలు దేవుడికి పోగుచేశారు. ఆ డబ్బుతో కలప కొన్నారు. మిగిలిన సంభారాన్ని సమకూర్చేందుకు, వూళ్ల వెంట తిరుగుతూ, రెండు నెలలు వూళ్లో లేరు. అప్పుడే ఒక రాత్రి ఎవరో కలపకు అగ్ని ముట్టించారు. కిట్టనివాళ్లు' అన్నారాయన విచారంగా.

'ఈ రహస్యం ఇప్పటికీ తెలీదా ?'

'వారం రోజులకు మరికొంత సంభారంతో హరిదాసూ, మంగీ తిరిగి వచ్చారు. వూరిలో కలరా ముమ్మరంగా సోకింది. జ్ఞానులూ, పెద్దలూ కలపకు ప్రమాదం జరగటానికి ముందే శ్రీశైల యాత్రకు వెళ్లారు శివరాత్రికని. హరిదాసు జరి

గిన. పనికేమీ నొచ్చుకోలేదు. గూడేల్లో అక్కడా తిరిగి, ఓపినంత సాయం చేస్తున్నారు. మున్నబు గారి మోతాదు కాటడికి కూడా సోకింది జబ్బు. గూడెంలో ఎవరూ ఆ చాయల పోలేదు భయంతో. హరిదాసూ, మంగీ యిద్దరే దిక్కయినారు. పోయే



ముందు కాటడు గ్రుడ్ల నీరు కుక్కుకుంటూ 'దేవుడి సొమ్ముకు అగ్గి పెట్టినందుక శాస్తి జరిగింది. మన్నించు. పోతున్నా దొరా!' అంటూ హరిదాసు చేతుల్లోనే ప్రాణాలు విడిచాడు.

'అయితే మున్నబుగారే యీ పుణ్యం మూట కట్టుకున్నా రన్నమాట!' అన్నాడు రాజు.

'మీ తాతగారికి దివ్యదృష్టి ఉందనేవారు

నాయనా ! దేవుని ఆస్తిమీద వచ్చే ఆదాయానికి తగిన ఖర్చు యిప్పుడు పుస్తకాల్లో తప్ప పైకి ఎవ్వరికీ తెలీదు. పెద్ద ఎత్తున గుడి కట్టించిన దగ్గరినుంచి ఒక రీతిగా వస్తుందా ? ఖర్చు కూడా పెరుగుతుందిగా. ఉత్సవాలని, పూరేగింపులని చెప్పానుగా. మీ తాతగారికీ ఆడంబాలు గిట్టవని' అన్నాడు కోటయ్యగారు.

రాజశేఖరం 'దేవుణ్ణి గూర్చి అంతా తెలిసింది. ఎటొచ్చీ హరిదాసును గూర్చే మీరు దాచేస్తున్నారు' అన్నాడు. 'లేదు నాయనా ! మంగికి కూడా కలరా సోకింది అప్పుడే. హరిదాసే దిక్కయినాడు. పిచ్చి దాన్ని హరిదాసు కప్పగించి మంగి దాటిపోయింది. ఇంతలో కిట్టనివాళ్ళు పిచ్చిదాన్ని చూచి హరిదాసు కూతురని ఎద్దేవ చేసేవాళ్ళు. అయినా పిచ్చి దాన్ని తనే పెంచాడు హరిదాసు. ఎవరినీ ఏమీ అన్న పాపాన పోలేదు. హరిదాసు మనస్సులో ఒకే ఒక్క దిగులు. అనుకున్నట్లు గుడి కట్టలేక పోయానే అని. ఆ దిగులుతోనే మంచ మెక్కాడు. పిచ్చిదంటే హరిదాసు కెంత ప్రేమో, పల్లె శేషాద్రికీ అంతే. హరిదాసు ఎవ్వరినీ శపించలేదు. అజ్ఞాని కనుక గుడి కట్టలేక పోయానే అనే దిగులుతోనే క్రుంగిపోయాడు. పల్లె శేషాద్రి మహా పట్టుదల మనిషి. చివరి ఘడియల్లో 'శేషన్నా ! ఇక పిచ్చిదాని భారం, గుడి భారం నీదే' అంటూన్న హరిదాసుకు 'బాబూ ! నీవు విశ్రాంతగా ఉండు. కట్టదాటి కొత్తూళ్ళోకి దేవుడు వెళ్ళితేనే, నేనూ పోతా. లేదా నీ గుడిసె పట్టునే ఉంటూ పడవతో బతుకుతా. నీ పేరే కానుకలు పోగుచేస్తా. కట్టానా, గుడి నీపేర ఉంటుంది. లేదా ? నీ ప్రక్కనే నేనూ ఉంటా. మళ్ళీ వూరు చాయల పోను. నా మీద ఒట్టు' అన్నాడు శేషాద్రి.

రాజశేఖరం దేవునివైపొకసారి చూచాడు.

'ఈ వూళ్ళో దేవుడ కావాలని ప్రాకులాడుతూన్న వాళ్లం మేం ముగ్గురమే నాయనా !' అన్నాడు. కోటయ్యగారు దేవుడి గుడి తలుపులు మూస్తూ.

హరిదాసుదిబ్బ యిదే బాబూ !' అన్నాడు కోటయ్యగారు మర్రి క్రిందికి వచ్చి. వెన్నెలరాత్రి కావటాన మర్రిగుండెలో ఒదిగిపోయింది గుడిసె. గుడిసెలో పిచ్చిది కునుకుపాట్లు తీస్తోంది గుడ్డిదీపం ముందు. రాజశేఖర్ కాగితంమీద పూర్తికాని బొమ్మ మనసులో పూర్తయింది.

ఇప్పుడు హరిదాస తంబూరా మ్రోగటం లేదు. అయినా చివరి పడవను వదిలిన శేషాద్రి గొంతులో జీవించే హరిదాసు గానం, గాలిలో తేలి బరువుగా వచ్చి, జ్ఞాపకాల్లాగా మర్రి వూడల్ని కదిలిస్తున్నది. హరిదాసు దిబ్బమీద ఇన్ని ఎండుటాకులు రాలాయి మర్రి కారుసున్న కన్నీళ్లవలె.

పాట ఆగిపోయింది. ఏటికి కల చెదరిపోయింది. హరిదాసు మనసు నిద్దరోయింది. 




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**22-3-61** బుధవారం మొదలు
**28-3-61** మంగళవారం వరకు

### మేషం.

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈవారం ప్రతి పనిలోను ఉత్సాహంతో ప్రవేశించగలుగుతారు. ధనాదాయం విషయంలో మధ్య మధ్య కుంటుపడుతున్నట్లు తోస్తుంది. కాని మొత్తం మీద చిక్కు పడకుండా కార్యక్రమాలు సాగించుకుంటారు. శుభకార్యాలలో పాల్గొంటారు. చిన్న చిన్న ప్రయాణాలు చేయవలసి వస్తుంది. కుటుంబ విషయాలలో అభిప్రాయ భేదాలు రావటంవల్ల తాత్కాలికంగా అశాంతి తోచగల అవకాశాలున్నవి. వృత్తి ఉద్యోగాలలో మీ కోర్కెలు అనుకూలిస్తవి. స్నేహితులకు ధన సహాయం చేయవలసిన అవసరం కలుగుతుంది. ఇంతకుముందు మీరు తొందరపడి చేసిన పనులు పెద్ద మనుష్యులతో కలహాలకు దారి తీయవచ్చు. ఖర్చులు కూడా పెరుగుతవి. వారాంతంలో శుభ వార్తలు తెలుస్తవి. 22, 23 లలో శుభవార్తలు, ఆదాయవృద్ధి, క్రొత్తవారితో స్నేహము.

* *

### వృషభం.

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ప్రస్తుతం ఇతరుల విషయాలలో జోక్యం కలిగించుకోకుండా ఉండటం అవసరం. వృత్తి ఉద్యోగాలలో కార్యభారం అధికంగా ఉంటుంది. సంఘంలో గౌరవం పొందగలుగుతారు. ఆడంబరం నిమిత్తం కొన్ని ఖర్చులను భరించవలసి వస్తుంది. మామూలు మాటలలోనే కలహాలురాగల అవకాశాలున్నవి. వ్యవహార రంగంలో మీరు అనుకున్న ప్రకారం స్నేహితుల సహాయం లభించక స్వశక్తితో నిర్వహించుకొనవలసి వస్తుంది. స్థిరాస్తులు కొనటం మార్పులు చేయటంవంటి ప్రయత్నాలు సుముఖంగా జరుగుతవి. పనుల వత్తిడివల్ల నరముల యందు బాధ కలుపిస్తుంది. పనులయందు అశ్రద్ధ తోస్తుంది. 24, 27 లలో ప్రయాణాలు, ఇష్ట వస్తు ప్రాప్తి.

#### గ్రహస్థితి

మేషంలో శుక్రుడు, మిథునంలో అంగారకుడు, సింహంలో రాహువు, మకరంలో గురు శనులు కుంభంలో బుధ, కేతువులు, మీనంలో సూర్యుడు, వృషభ, మిథున, కటక సింహాలలో చంద్రుడు.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ సమయంలో ఓర్పుతో జయం పొందగలుగుతారు. ఆరంభంలో తోటివారు మిమ్ములను తేలికగా చూస్తారు. కాని, క్రమ క్రమంగా వారే మిమ్ములను గౌరవించి సహాయం చేస్తారు. తీర్థ యాత్రలు మొదలయిన పుణ్య కార్యాలు సుఖంగా జరుగుతవి. బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. మానసికమైన ఆందోళన, భయము క్రమంగా తొలగిపోయి ఉత్సాహంతో కార్యరంగంలో ప్రవేశించ గలుగుతారు. పిల్లల మూలంగా సుఖ సంతోషాలు లభిస్తవి. తలవని తలంపుగా నౌకరులతో కలహాలు రాగల అవకాశాలున్నవి. ముందు ముందు ఉపయోగించగల పనుల నిమిత్తం డబ్బు పెట్టుబడి పెట్టవలసి వస్తుంది. బంధు మిత్రులకు వ్రాసే ఉత్తరాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. 22, 23 లలో శుభకార్యాల నిమిత్తం ఖర్చులు, ప్రయాణాలు, బంధుదర్శనం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

మీరు ఒక ప్రక్కనుంచి కార్యభారం తొలగించుకొనటానికి ప్రయత్నిస్తారు. కాని, స్నేహితుల వత్తిడివల్ల ఖర్చులు అధికంగా పైనవేసుకొనవలసివస్తుంది. ముందు ఎప్పుడో విశేషంగా లభిస్తుందనే ఆశతో ప్రస్తుతం లభించిన స్వల్ప ఆదాయాన్ని వదులుకుంటారు. అనేక సందర్భాలలో ఇతరుల సలహా లేనిదే ధైర్యంతో ముందుకురాలేకపోతారు. పిల్లల మూలంగా ఖర్చులు పెరుగుతవి కోర్టు కచేరీలలో సహనంతో ప్రవర్తించవద్దు లోగడ ఆశవదలుకున్న ఫలితం ఈ సమయంలో చేతికి వస్తుంది. ప్రయాణాలలో ధన సంబంధమైన ఫలితం సామాన్యంగానే ఉంటుంది. కాని, కార్యసిద్ధి పొందగలుగుతారు. గౌరవం లభిస్తుంది. 24, 25 లలో సంఘంలో గౌరవం, రాజకీయాలలో స్పర్థలు వచ్చినా జయం లభిస్తుంది.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మీ ఆరోగ్యాన్ని గురించి జాగ్రత్తగా ఉండవలసిన సమయం. శిరోబాధ, జీర్ణకోశములయందు బాధ కనుపిస్తుంది. అధికారులవల్ల నెరవేరవలసిన పనులు ఎటూ తేలవు. అత్యవసర పరిస్థితులలో చేసిన పనులు ఈ సమయంలో ఆందోళనను కలిగిస్తవి. బంధువర్గంలో మీయందు ఆదరభావం ఏర్పడుతుంది. వృత్తి, వ్యాపారాలలో ప్రతి చిన్న పని నిమిత్తమున్ను, శ్రమ అధికంగా కనుపిస్తుంది. కొన్ని సమయాలలో ప్రతికూలభావం కనుపించి, పర్యవసానంలో కార్యసిద్ధి పొందగలుగుతారు. మిమ్ములను భయపెట్టి తమ పనిని నెరవేర్చుకొనే రకం మనుష్యులు తటస్థపడుతారు. విలువగల వస్తువులు కొంటారు కాని తగినంత ఉపయోగం పొందలేక పోతారు. 27, 28 లలో త్రిప్పట అధికం, బంధు విరోధం, వృధా ఆలోచనలు.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1 2 పా)**

వృత్తి ఉద్యోగాలలో పోటీపడి జయించ కొనగలుగుతారు. సాధ్యమైనంతవరకు వృధా ప్రసంగాలకు అవకాశం లేకుండా చూచుకొనండి. ఆదాయం మామూలుగా ఉంటుంది. భారమైన పనులు తల పెట్టటంవల్ల ఇతరులవద్దనుంచి ధన సహాయం ఎదురు చూడవలసి వస్తుంది. అధికారులవల్ల మాట రాకుండా చూచుకొనటం అవసరం. కుటుంబ సుఖసంతోషాలు లభిస్తవి. బంధువులవద్దనుంచి ఎదురు చూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి. మీవద్దనుంచి రహస్యాలను తెలుసుకుని మీకే అపకారం చేయటానికి ప్రయత్నించేవారుంటారు. జాగ్రత్తగా ఉండండి. వారాంతంలో దైవ కార్యాలలో పాల్గొంటారు. సంఘంలో గౌరవం పొందగలుగుతారు. 26, 27 లలో ఆదాయవృద్ధి, ప్రయాణాలు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

మీ మాటను చెలామణి చేసుకోగల అవకాశాలు లభిస్తవి. కొన్ని సమయాలలో వెంటనే ఫలితం లభిస్తుందనుకుని చేసిన పనులు నిరుప

యోగం కావచ్చు. సంఘంలో గౌరవం బాగుంటుంది. కుటుంబములో సుఖము, ఆనందము లభిస్తవి. మీ ఆరోగ్యం బాగుంటుంది. దూరమందున్న మిత్రులవద్దనుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. మీదినసరి కార్యక్రమాలలో ఇంతకు ముందున్నటువంటి ప్రతిబంధకాలు తొలగిపోతవి. ఇతరుల చేతికి పోయిన వస్తువులు డబ్బు ఈ సమయంలో సక్రమంగా తిరిగివస్తవి. నూతన ప్రయత్నాలు సంపూర్ణంగా నెరవేరకుండా నిరుత్సాహం తోస్తుంది. మీ క్షేమం విచారిస్తున్నట్లు నటిస్తూ మిమ్మలను నిరుత్సాహపరచేవారు ఉంటారు జాగ్రత్తగా ఉండండి. 22, 23 లలో హోదా పెరుగుతుంది. మానసికంగా ఆందోళన, శ్రమకు చాలని ఫలితం.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ముందుగా నిర్ణయించుకుంటేగాని, చురుకుగా ఏ పనీ చేయలేకపోతారు. కారణం కనుపించని ఆందోళన, అనుకున్న పనులు మరచిపోవటం, అంచనాకుమించిన ఖర్చులు. వీటివల్ల అంది వచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకోలేకపోతారు. స్నేహితులవల్ల ప్రోత్సాహం లభిస్తుంది. స్థిరాస్తుల వల్ల ఆదాయం బాగుంటుంది. సమయంలో సలహా చెప్పి మిమ్మలను ముందుకు తీసుకునిపోగల మనుష్యులు లభిస్తారు. కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి. వ్యవహార విషయాలలో ఇంతకు ముందున్న నిరుత్సాహం తొలగిపోతుంది. వృత్తికి సంబంధించిన అభివృద్ధి ప్రయత్నాలు ఫలిస్తవి. సాటివారిలో గౌరవం పొందగలుగుతారు. 26, 27 లలో పుణ్యకార్యాలు, అకస్మాద్ధనలాభం, శుభ వార్తలు.

* * *

## ధనుస్సు :

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

క్రమ క్రమంగా మీ గొప్పదనం పెరిగే సమయం, బంధువులవల్ల ఆదరణ, సహాయము లభిస్తవి. సంఘంలో మీ పేరు ప్రతిష్ఠ పెరుగుతున్న సమయంలో భంగం కలిగించే ప్రయత్నాలుచేసేవారు తటస్థపడతారు. సాహస కార్యాలలో ధనం విశేషంగా ఖర్చు అవుతుంది. ఒక నిర్ణయానికి వచ్చిన పనులు మధ్యలో నిలపటంవల్ల తిరిగి ఆరంభించవలసిన అవసరం కలుగుతుంది. ధనాదాయం సంతృప్తికరంగా ఉంటుంది. అల్పులతో కలహాలు రాగలవు. బంధువుల ఇండ్లకు ప్రయాణాలు చేస్తారు. ముఖ్యంగా ఈ సమయంలో ఏ సందర్భంలోను మనస్సులోని మాటను బయటకు రానీయవద్దు. ఇతరుల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. 24 25 లలో పనులలో పొరపాట్లు, కలహ ప్రసంగాలు.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)**

ప్రస్తుతం ఒకరిద్దరు మిత్రులు మీ సహాయంపొంది మీ మీద అధికారం చెలాయించటానికి చూస్తారు. ఇతరుల పని నిమిత్తం అధికారులతో ప్రసంగించవలసి వస్తుంది. అనుకున్న ప్రయాణాలు నిలిచిపోతవి. ఋణభారం తగ్గించుకుందామని ప్రయత్నిస్తారు. కాని దైవబలం కలసిరాదు. కోర్టు కచేరీలలో స్నేహితుల సహాయం లభిస్తుంది. వృత్తి వ్యాపారాలలో సంతృప్తికరంగా ధన సహాయం లభించగలదు. శ్రమ కనుపించినా పనులు నెరవేరుతవి. బంధువులవద్దనుంచి రావలసిన ధనం వస్తుంది. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. పుణ్యకార్యాలకు ఆటంకాలు వస్తవి. వారాంతంలో వస్తువులు పోగొట్టుకుంటారు. 27, 28 లలో లాభ వార్తలు, మిత్ర విరోధం.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, *పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఈవారం అనేక విషయాలలో సంతృప్తికరంగా కనిపిస్తుంది. మాటలతో అవతలివారిని మంచి చేసుకుని ముఖ్యమైన పనులు సులభంగా నెరవేర్చుకోగలుగుతారు. దుబారా ఖర్చులు తగ్గుతవి. విలువగల వస్తువులు కొంటారు. ప్రతి పనిలోను సాధక బాధకాలు ఆలోచించి ప్రవేశించగల అవకాశాలు లభిస్తవి. మనసులోని మాట విప్పి చెప్పుకోతగిన మిత్రులు లభిస్తారు. వృత్తి, ఉద్యోగాలలో మనశ్శాంతి లభిస్తుంది. అధికారులవల్ల ప్రస్తుతం ఉపకారం పొందలేకపోతారు. వ్యవహార పరిష్కార సందర్భాలలో మీరు అనుకున్నంత ప్రయోజనం కనుపించదు. 24, 25 తేదులలో కోప ప్రసంగాలు, ఇతరులతో పోటి.

* * *

## ఈవారము ధరలు

బంగారు ధర ఈ వారాంతంలో పెరుగుతుంది. వెండి ధర వారం ఆరంభంలో తగ్గినా, వారాంతంలో యధాప్రకారంగా వుంటుంది. పసుపుధర క్రమక్రమంగా పెరిగే అవకాశాలున్నవి. నూలు ధర వారాంతంలో తగ్గుతుంది. కాని, నిలవకపోవచ్చు ప్రత్తి ధర మందీ వస్తుంది.

పెసల ధరలో తగ్గుదల వస్తుంది. మిరిధర తాత్కాలికంగా తగ్గి వారాంతంనుంచి తిరిగి పెరుగుతుంది. బెల్లం ధర పెరిగే అవకాశాలున్నవి. చింతపండు ధరలో మందీ కనుపిస్తుంది.

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

మీ నిరుత్సాహం తొలగుతుంది. సమయానుకూలత, కార్యనిర్వహణ శక్తి బాగుంటవి. ఇతరుల వ్యవహార విషయాలలో జోక్యం కలిగించుకోంటారు. కుటుంబంలో శుభ కార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి. స్నేహితులవద్దనుంచి లాభ వార్తలు తెలుస్తవి. ఇతరుల చేతికి పోయిన ధనం ఈ సమయంలో చేతికి వస్తుంది. సాధ్యమైనంతవరకు ఉద్రేకాన్ని తగ్గించుకొనటం అవసరం. పిల్లల ఆరోగ్యాన్ని గురించి జాగ్రత్తగా ఉండండి. వృత్తి ఉద్యోగాలలో సాటివారితో కలహ ప్రసంగాలు రాగల అవకాశాలున్నవి. లాటరీవంటి పనులలో ప్రవేశించతగిన సమయంకాదు. మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా బాగుంటుంది. 22, 23 లో మనో వికాసం బాగుంటుంది. శుభ వార్తలు.

చిత్రకారుడు — గణేష్ జి. (కాకినాడ)



# వనితాలోకం

# స్త్రీ ధర్మం. స్వాతంత్ర్యం

'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అని నానుడి. స్త్రీ స్వాతంత్ర్యం కోరుతుందా ? అయితే ఏలాంటి స్వాతంత్ర్యం, ఎంత మట్టుకు అనేవి చర్చనీయాంశాలు. తగునా తగదా అన్నది వేరు. కేవలం స్వాతంత్ర్యంకోసమే స్వాతంత్ర్యం కోరడం అసంభవం. స్వాతంత్ర్యం మాట అటు ఉంచి, స్త్రీ నాటికి నేటికి ఏమైనా పురోగమనించినదా లేదా అని ఎప్పటి కప్పుడు పునర్విమర్శించుకొనడం మాత్రం అత్యంతావశ్యకం. స్త్రీలమీదనే జాతి పురోభివృద్ధి ఆధారపడి ఉన్నది. ఇందుకు స్త్రీలు ఎంత మట్టుకు కృషి చేస్తున్నారనేదీ పరిశీలనార్హమే.

## మతుకుమల్లి సుశీల

నేను పిల్లలతో సహా సెప్టెంబరు ఆఖరిలో యిక్కడకువచ్చాను (మా వారికి ఇక్కడ అమెరికా పని కనుక). ప్రయాణపు హడావుడివల్ల, ఆంధ్ర పచిత్ర వారపత్రిక నిర్వహించిన దీపావళి వనితాలోకం పోటీలో కుతూహలంగా ఉన్నా పాల్గొన లేక పోయాను. దీపావళి సంచిక నేను యీ మధ్యనే చదవగలిగాను. అందులో వనితాలోకం వ్యాసాలు సహేతుకంగా, సంప్రదాయానికి అనుకూలంగా బాగానే ఉన్నా, నేను ఆశించినంత పురోగమించలేదని పించింది. 'స్త్రీ స్వాతంత్ర్యం' అంటూ వేదికల మీదనుంచి యిచ్చే ఉపన్యాసాల ఫక్కీ లో ఒక వ్యాసం వ్రాయటం నా ఉద్దేశం కాదు. కాని, యీవిధమైన దృక్పథం కొంతవరకైనా మారితే గాని మనం—అంటే స్త్రీజాతే కాదు, మొత్తం దేశమే బాగుపడదేమోననే బాధ, సనాతనధర్మ సముద్ధరణకు కంకణం కట్టుకున్నా మనుకుంటూ ఆత్మవంచన చేసుకునే సోదరీమణుల పట్ల సాను భూతి యీ వ్యాసం వ్రాయటానికి నన్ను పురి కొల్పాయి.

సాధారణంగా ప్రతివారికీ స్త్రీధర్మం అనగానే గృహిణిగా, మాతగా, స్త్రీ నిర్వహించవలసిన పాత్ర గుర్తుకు వస్తుంది. సహజమే ! దేశ కాల భేదాలు లేకుండా యీ నిర్వచనం వర్తిస్తుంది. అయితే యిక్కడ రెండు ప్రశ్నలు ఉదయిస్తాయి. (1) స్త్రీ ధర్మం గృహిణీత్వానికి మాత్రమే పరిమిత మైనదా ? (2) స్త్రీ ఆదర్శ గృహిణిగా రూపొందేందుకు అవసరమైన శిక్షణ ఎక్కడ ఏవిధంగా లభిస్తుంది ?

పై రెండు ప్రశ్నలలో మొదటిది ముఖ్యమైనా, రెండవ ప్రశ్న సులభమైనది కనుకా, కొంతవరకూ దాని జవాబుమీద మొదటి ప్రశ్న ఆధారపడిఉన్నది కనుకా ముందు రెండవ ప్రశ్నకు జవాబు వ్రాస్తాను.

పోటీ వ్యాసాలలో ఒక సోదరి "వివిధ మనస్తత్వాల మధ్య, ఎదుటివారిని నొప్పించకుండా . . . . మంచీ మర్యాదా అలవర్చడం తల్లియొక్క బాధ్యతలు. కానీ డబ్బుపెట్టి కాలేజీలో నేర్చుకొనడం శోచనీయం" అని శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ యిచ్చిన ఉపన్యాసాన్ని గురించి ప్రస్తావించారు. అప్పుడు నేను ఇండియాలోనే ఉండటం వలన ఆ ఉపన్యాసం వినే అదృష్టం కలిగింది. ఇందులో ఎంతైనా నిజం ఉన్నది. క్రొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకున్న మన దేశంలో ప్రతి నయాపైసా విలువైనది. మనం డబ్బు ఖర్చుపెడితే తప్ప నేర్చుకోలేని విజ్ఞానం ఎంతో ఉంది. ఇదికాక యింకా అనేక ప్రణాళికలకు ఇతర ముఖ్యమైన అభ్యుదయ కార్యకలాపాలకూ ఎంతో ధనం అవసరం ఉంది. అటువంటి సందర్భాలలో ఎదుటివారిని అర్థం చేసుకునేందుకు, గృహకృత్యాలు నేర్చుకునేందుకు ధన వ్యయం చేయుటం వాంఛనీయం గాకపోగా దుర్వ్యయం క్రిందకు వస్తుంది. వివిధ మనస్తత్వాలను అర్థం చేసుకునేందుకు మన అమ్మమ్మలు, వారి అమ్మమ్మలు ఏ సైకాలజీ కోర్సులు చదివారు ? ఇంటిని శుభ్రంగా, ఆరోగ్యవంతంగా ఉంచేందుకు ఏ డొమెస్టిక్ సైన్సు కోర్సు చదివారు ?

ఇది యిలా ఉండగా, ఆదర్శ మనేది స్త్రీలకు మాత్రమేనా అవసరం ? పురుషులకు అక్కర లేదా ? ఆదర్శపుత్రుడుగా, భర్తగా, తండ్రిగా మాత్రమే కాక, కుటుంబ నిర్వహణకు అవసరమైన ధనసముపార్జన చేసేప్పుడు—సాధారణంగా కుటుంబంలో స్త్రీ మెలగవలసిన వ్యక్తుల కన్న—ఎక్కువ విభిన్న మనస్తత్వాలు గల వ్యక్తుల మధ్య సంచరిస్తూ, జయప్రదంగా జీవితాన్ని నిర్వహిస్తారే పురుషులు ? ఇందుకు అవసరమైన విజ్ఞానాన్ని వారు ఏ కళాశాలలో, ఏ విశ్వ విద్యాలయాలలో ఎంత ధనం వ్యయంచేసి నేర్చుకుంటున్నారు ? పురుషులకు ఆదర్శజీవిత నిర్వహణకు అవసరంలేని కోర్సులు స్త్రీలకు ఎందుకు ?

ఈ విషయాలన్నీ ఎక్కడికీ వెళ్లి నేర్చుకోనక్కరలేదు. వయస్సు పెరుగుతున్నకొద్దీ తమ పరిసరాలను గమనించే శక్తి సహజంగానే బాలబాలికలకు వస్తుంది. ఈ శక్తే జీవితం సక్రమంగా సాగించేందుకు అవసరమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. వారు స్వయంగా విషయగ్రహణ చేయలేనప్పుడు, వారి బుద్ధిని సక్రమమైన గాడిలో నడిపించే బాధ్యత తల్లిదండ్రులది. ముఖ్యంగా తల్లిది. అంతేకాని ప్రతి చిన్న విషయానికీ విద్యాలయాలమీద ఆధారపడకూడదు.

విద్యావతులైన స్త్రీలు నలుగురితో కలసి మెలసి ఉండలేకపోవటానికీ, గృహనిర్వహణలో నేర్పరులు కాకపోవటానికీ, యింకా ఏ విధ్యుక్త ధర్మనిర్వహణలోనైనా పొరబాటు పడటానికీ విద్యావిధానం బాధ్యత ఎంతమాత్రం లేదు. ఈ బాధ్యత నూటికి 99 పాళ్లు తల్లిదే. చాలామంది తల్లులు తాము ఎక్కువ చదువుకోలేదు గనుక, తమ పిల్లలు చదువుతూవుంటే, అదేదో పెద్ద ఘన కార్య మైనట్లు వారిని నలుగురిలో ప్రత్యేకంగా చూస్తారు. ఈవిధంగా ఒకవిధమైన దురభిమానం, అహంకారం పిల్లలలో పెరుగుతాయి. ఈ భావమే వారి తరువాత జీవితంలో అడుగడుగునా ప్రస్ఫుటమవుతుంది. సాధారణంగా 12—13 ఏళ్ల వయస్సునుంచి 18—20 ఏళ్ల వయస్సు













వరకూ పిల్లలలో అర్ధవికసిత విజ్ఞాన ఫలితంగా అనేక విషయాలలో అపోహాలు ఏర్పడే అవకాశం ఉంది. ఈ అపోహాలు తొలగించి, యీ అహం కారాన్ని అణచివేయని తల్లి తన విధిని సరిగా నిర్వర్తించలేదన్నమాట. ఈ సందర్భంలో తల్లి విద్యావతి అయితే మంచిదే. కాకపోయినా ఆత్మ విశ్వాసం (మొండి పట్టుదల కాదు. వుండాలి. ఆమెకు సర్వవిధాలా సంపూర్ణ సహకారం యివ్వటం తండ్రి బాధ్యత.

"చదువుకున్న భార్యలు, భర్త అలసి సొలసి ఆఫీసునుంచి రాగానే ఉదయం న్యూస్ పేపర్లో చదివిన రష్యన్ స్పుత్నిక్‌ను గురించీ, అమెరికన్ రాకెట్‌ను గురించీ ప్రస్తావిస్తూ, అతడి అన్న పానాదుల విషయంలో శ్రద్ధ వహించరేమో" అని ఒక సోదరి భయపడ్డారు. నాకు తెలిసినంత వరకూ యీ భయం చదువుకున్న భార్యలను, గురించీ, వారి భర్తల అవసరాలను గురించీ అపోహ మీద ఆధారపడి ఉంది. 'చదువుకున్న భార్య' ను పెండ్లాడేందుకు సాహసించిన భర్త కూడా సాధారణంగా చదున్నవాడే అయివుంటాడు. కాబట్టి నా రిద్దరికీ యింటరెస్ట్ ఉన్న విషయాలు న్యూస్ పేపరులో కూడా ఉంటాయి. లేవగానే నిత్య కృత్యాలలో, ఆఫీసు పనులలో మునిగిపోతూ, ప్రపంచంలో తమ ఎరిక లేకుండా ఏమి జరుగు తోందో తెలుసుకోవాలని ఆతురత ఉన్నా అవ కాశంలేక బాధపడే భర్తలు, సాయంత్రం యింటికి రాగానే బట్టలు మార్చుకుంటూ పేపర్లో విశేషా లేమిటని భార్యలను అడిగేవారు ఎందరో ఉన్నారు. వారికి అన్నపానాదులకన్నా అంతర్జాతీయ రాజ కీయాలే ముఖ్యం.

కాగా కొంచెం ఇమాజినేటివ్ (Imaginative) గా ఉండే భర్తలు, భార్యలు చదువుకోనివారైతే, వారితో ఏ కంది పచ్చడి గురించో, వంకాయ బజ్జీలను గురించో మాట్లాడవలసిందే గాని దేశ కాల పరిస్థితులను గురించి చర్చించేందుకు వీలు లేదు కదా అని బాధపడేవారు ఎందరో ఉన్నారు. ఇంతతో పూరుకోక—యింటికి రాగానే ఏ పేపరో పట్టుకు కూర్చోవటం, లేకపోతే తనకు తగిన స్నేహితులనో, స్నేహితురాండ్రనో సంపాదించటం—అదేమని భార్య అడిగితే 'నీతో ఏం మాట్లాడను నా మొహం' అని చీదరించుకోవటం—యిలాంటి కుటుంబాలు సాధారణంగా ప్రతివారూ ఎరిగినవే.

స్త్రీ విద్యావతి అయితే ఆమె కుటుంబ నిర్వహణలో, కుటుంబంలోని వాతావరణంలో ఒక ప్రత్యేక సంస్కారం కనిపిస్తుంది. ఇది కళాశాల విద్యే కానక్కరలేదు. చదివిన విషయం యితరుల సహాయం లేకుండా అర్థం చేసుకోవటానికీ, క్రమ బద్ధంగా ఆలోచించటానికీ అవసరమైన విజ్ఞానం ఏవిధంగా వీలైతే ఆవిధంగా (యింట్లో గానీ, విద్యాలయాల్లో గానీ) సాధించవచ్చు.

"స్త్రీకి ఎటువంటి విద్య కావాలి ?" అనే ప్రశ్న ఆలోచిస్తున్నప్పుడు అసలు యీ సందేహం సంపాదకులకు నిజంగా కలిగిందా ? లేక కేవలం మన స్త్రీల మనస్తత్వాలు ఎంతవరకు మారాయో కనిపెట్టేందుకు ఇది ఒక పరీక్షగా పెట్టారా ? అని నాకు సందేహం కలిగింది. నా మట్టుకు నాకు యీ ప్రశ్నకు అవసరం కనిపించ లేదు.

"ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్" అనే సూక్తి విన్నా మొన్నటిదీ

# ప్లాస్టిక్ దారాలతో బెల్ట్

ఇప్పుడువచ్చే ప్లాస్టిక్ దారాలు చాల రకాలుగా ఉపయోగపడుతున్నాయి. హాండ్‌బాగ్స్, పువ్వులే గాకుండా మగపిల్లలు నిత్యం వాడుకునే బెల్ట్‌లు లాటివి కూడా ఈ ప్లాస్టిక్ దారాలతో తయారు చేయువచ్చు. ఈ ప్లాస్టిక్ దారాలు బజార్లో విరివిగా దొరుకుతున్నాయి. మొత్తంమీద తీసుకుంటే రూపాయకు ఏభైగజాలు కూడ ఇస్తున్నారు. విడిగా కొంటేమట్టుకు చాల నష్టం. ఏ యే రంగు ప్లాస్టిక్ దారం ఎంతెంత కావలసినది చెబుతాను. దారాలు ఎలా అల్లుకుంటూ పోవాలన్న సంగతి బొమ్మనుబట్టి తేలిగ్గా గ్రహించవచ్చు. దీనికి రెండు రంగుల ప్లాస్టిక్ దారాలు కావాలి. నే నిక్కడిస్తున్న కొలతల ప్రకారం అల్లితే సుమారు గజం పొడుగున బెల్ట్ వస్తుంది. ఈ బెల్ట్ 15, 16 సం. వయస్సుగల మగపిల్లలకయితే సరిపోతుంది. ఇంకా చిన్న పిల్లలకయితే ప్లాస్టిక్ దారాల కొలత తగ్గించి తీసుకోవాలి.

ఇకపోతే దారాలు ఎంతెంత కావాలన్న సంగతి చూదాం. రంగులు ఎవరికి నచ్చినవి వారు ఎన్నుకోవచ్చు. నేను వాడిన రంగులే ఇక్కడ తెలియబరుస్తున్నాను. గజం పొడుగున బెల్ట్ కావాలనుకుంటే రోజారంగు ప్లాస్టిక్ దారం 24 గ. వైలెట్ రంగు ప్లాస్టిక్ దారం 12 గ. 8 అంగుళములు, ఒక బకుల్ కావాలి.

ముందు 24 గ. రోజా రంగు ప్లాస్టిక్ దారాన్ని తీసుకుని సమానంగా 8 ముక్కలుగా కత్తిరించాలి. అంటే ఒక్కొక్క పోగు పొడుపు 3 గ. వుంటుందన్నమాట. అలాగే 12 గ. 8. అం. వైలెట్ రంగు ప్లాస్టిక్ దారాన్ని కూడ సమానంగా 4 ముక్కలుగా కట్ చేయాలి. ఈ వైలెట్ రంగు ప్లాస్టిక్ దారం ఒక్కొక్క పోగు పొడవు 3 గ. 2 అం. వుంటుందన్నమాట మనం అల్లేటప్పుడు రోజారంగులో కత్తిరించిన 8 పోగులలో 4 పోగుల చొప్పున రెండు భాగాలుగా తీసుకోవాలి. అలాగే వైలెట్ రంగు దారం 4 పోగులను విడిగా తీసుకోవాలి. ఇప్పుడు రెండు రంగులలోని నాల్గేసి పోగులను సమానంగా మధ్య గుర్తించుకోవాలి. ముందు వైలెట్ రంగు పోగులను నాల్గిటినీ తీసుకుని మధ్య గుర్తు పెట్టుకుని, రోజారంగులో నాల్గు పోగుల మధ్యను దీని మీదుగా బొమ్మలో వివరించినట్లు అదేవిధంగా వేయాలి. మిగిలిన నాలుగు రోజా రంగు పోగులను కూడ అదేవిధంగా వేయాలి. బొమ్మలో ప్లెయిన్‌గా వేసిన చోటున వైలెట్ రంగు, గీతలున్న చోటున రోజారంగు అని గుర్తించుకోవాలి. గుర్తుకోసం అలా ప్లెయిన్‌గా వేశాను గాని వైలెట్ రంగు ప్లాస్టిక్ దారం పోగులు 4 వాడాలన్న సంగతి మరువ కూడదు. ఇప్పుడు అదే బొమ్మను అనుసరిస్తూ, అదేవిధంగా అల్లాలి ఇలా అల్లేటప్పుడు నాలుగు పోగులు పరచుకునేటప్పటికి అల్లికలో చిల్లులు కూడ రావు. ఇక్కడ ఒక విషయం గమనించాలి. దారాలు అల్లేటప్పుడు పోగులు ఒకదాని వెంబడి ఒకటి పరచుకున్నట్లుండాలేగాని మెలికలు పడకుండా జాగ్రత్త పడాలి, బొమ్మను బాగా



పరిశీలించి చూస్తే ఎలా అల్లాలో చక్కగా బోధపడుతుంది. సమానమైన బిగుతుతో సందులు లేకుండా నిదానంగా అల్లితే బెల్ట్ గట్టిగా, బాగుంటుంది. వైలెట్ రంగు ప్లాస్టిక్ దారం నాలుగు పోగులు మధ్య పాములా మెలికలు తిరుగుతూ వస్తుంది తర్వాత బెల్ట్ గజం పొడువున అల్లి కొనలో జడ లాగ రెండు పాయలు ఒకటిగా తీసుకుని అంగుళన్నర మేరకు జడ అల్లి ముడి వేయాలి. మిగిలిన పోగులను ముందుకు మడిచి మళ్ళా అదే ప్లాస్టిక్ దారంతో రెండు చుట్లు చుట్టి గట్టిగా ముడి వేయాలి. అల్లిన భాగమే స్ట్రెయిట్ లైటన్నమాట. ఈ జడను బకుల్‌లో దూర్చి జడను వెనక్కు అంటే రాంగ్ సైడుకు త్రిప్పి ప్లాస్టిక్‌దారంతోనే కుట్లును జడను ఒకటిగా చేర్చి జడ మేరకూ పైపైగా ముడి వేయాలి. బెల్ట్ రింగుకు అడుగు పొడవుగల మూడు వైలెట్ రంగు ప్లాస్టిక్ దారాలు తీసుకుని రెండు పోగుల మధ్య మీదుగా మరొక పోగు మధ్య వేసి జడ అల్లాలి. ఈ జడ పొడుగు బెల్ట్ వెడల్పుకు రెండింతలుగా వుండాలి. తర్వాత కడపటి పోగుల్లో 3 పోగులను జడ మొదట్లో దూర్చి రెండు మార్లు గట్టిగా

( 62 వ పేజి చూడండి)

# స్త్రీధర్మం, స్వాతంత్ర్యం

కాదు. మనకు చాలా పూర్వులు స్త్రీలు కూడా విలువిద్య, కత్తిసాము, గుర్రపుస్వారి మొదలైన విద్యలు నేర్చుకున్నా రనేందుకు చారిత్ర కాధారాలున్నాయి. ఉభయ భారతి, గార్గి, మైత్రేయి వంటి మహిళామణులు పురుషులతో సమానంగా వేదశాస్త్రాలు, ఉపనిషత్తులు సాంగోపాంగంగా అభ్యసించారు. స్త్రీ పురుషుల విద్యాభ్యాసాలలో భేదా ఉండాలనే భావం యీ మధ్యకాలంలో ప్రబలినదే కాని, ప్రాచీనకాలంనుంచీ ఉన్నది కాదు. ప్రస్తుత కాలంలో ఇంజనీరింగ్ నుంచి, ఎటామిక్ రిసెర్చి వరకూ స్త్రీలకు అవసరమైనదీ, నిరుపయోగమైనదీ ఏదీ లేదు. అవకాశం ఉన్నంత వరకూ ప్రతి స్త్రీ పురుషునితో సమానంగా విద్యాభ్యాసం చేయవలసినదే ! ప్రస్తుత విద్యా విధానం సరియైనదా ? కాదా ? అంటే అది వేరే విషయం. అది స్త్రీలకు పనికివస్తుందా అంటేనే చెప్పు.

విద్యాభ్యాసానికి లక్ష్యం ఉద్యోగమే కాదు. అవసరం, అవకాశం ఉన్న స్త్రీలు ఉద్యోగం చేయవచ్చు. లేనివారు తమ విద్యను సద్వినియోగం చేసుకోవచ్చు. ఉదాహరణకు—ఇంజనీరింగ్ చదివిన స్త్రీ ఉన్నదనుకోండి. వీలైతే ఉద్యోగం చేస్తుంది. ఉద్యోగం చేయకపోయినా ఆమె విద్య నిరర్థకం కాదు. ఆమె యింటిలో ఒక గదిని వర్కుషాపుగా ఏర్పరచుకుని, తీరిక సమయాలలో రిసెర్చి చేస్తూ తన జ్ఞానాన్ని వృద్ధి చేసుకుంటుంది. ఇంజనీరింగ్ చదివే తన పిల్లలకు సహాయం చేస్తూ ట్యూటర్ల ఖర్చు తగ్గిస్తుంది. లేకపోతే యింట్లో కూచుని, ఇతరుల ఇళ్ళకు, వేరే భవనాలకు ప్లానులువేసి, సలహాలిచ్చి ధనార్జన చేస్తుంది. ఇలాగే యితర విద్యలకు తగిన ఉపయోగం ఉంటుంది.

తీరిక సమయాలలో కుట్లు, చేతిపనులు మొదలైనవి చేసుకుంటూ కాలం గడపాలనే దృక్పథం మారితే కొంతవరకూ పురోగమించా మనుకోవచ్చు.

ఈ వ్యాసం మొదట్లో వ్రాసిన రెండు ప్రశ్నలలో రెండవదానికి మాత్రమే జవాబు యిచ్చాను. మొదటి ప్రశ్నకు సమాధానంలో యిది కొంత భాగమైనా, సమగ్రమైన జవాబు కాదు. ఆ ప్రశ్నకు సమాధానం మరోసారి చర్చిస్తాను. ★

# ఉగాదికి బెంగాలీ స్వీట్సు

## రష్మల్ పా

కావలసిన వస్తువులు :—

½ శేరు పంచదార.
1½ పావుశేరు మైదా.
6 అరటిపళ్ళు.
1 కొబ్బరికాయ.
¾ శేరు డాల్డా లేక నెయ్యి.
ఏలకులు.

చేసే విధానం :—మొదట పంచదార పాకం (రసగుల్లా పాకం) తీసుకొని ఉంచుకోవాలి. తరువాత అరటిపళ్ళు, (తొక్కు తీసినవి), కొబ్బరి కోరూ, మైదాపిండీ, యీ మూడూ నీళ్ళుపోసి బాగా కలుపుకోవాలి. అంటే పొంగడాలు వేసే పిండి మాదిరిగా ఉండాలి. గరిటతో ఎత్తినట్లయితే జారుగా ఉండాలన్నమాట. యిప్పుడు ఏలకుల పొడి వేసి కలుపవలెను. ఎక్కువ పలుచన చేయకండి. బాణలి కాలిన తర్వాత, డాల్డా పోయవలెను. బాగా మరిగాక, కలిపివుంచిన పిండిని గరిటకు ఒక్కొక్కటి చొప్పున అందులో పోయవలెను. (పొంగడం పోసేమాదిరిగానే). వేగుతుండగానే పైకి తేలుతాయి. బాగా వేగిన తర్వాత తీసివేసి పాకంలో వేస్తుండాలి. ఒకపూట నానిన తర్వాత తింటే చాలా బావుంటాయి.

## పంతువా

(ఎరుపుకంద మూలంతో)

కావలసిన వస్తువులు :—

½ శేరు ఎరుపుకంద మూలం.
½ శేరు పంచదార.
½ పావు మైదా.
½ శేరు డాల్డా లేక నెయ్యి.

చేసే విధానం :— కందమూలం బాగా కడిగి ఉడకపెట్టుకోవాలి. ఉడికిన తర్వాత పై పొట్టు తీసివేసి, స్టీలు పళ్లెంలో ఉంచుకోవాలి. తర్వాత మైదాపిండినీ, యీ వుడికించిన దుంపలనూ, కలిపి పళ్ళెంలో బాగా రాస్తూ మెదుపుకోవాలి. అప్పుడు మెత్తగా ముద్ద మాదిరి అవుతుంది. మొదటనే పంచదార పాకం (రసగుల్లా పాకం) తీసి అట్టే ఉంచుకోవాలి. బాణలిలో డాల్డా వేసి మరిగిన తర్వాత, పెద్ద ఉసిరికాయంత ఉండ చుట్టుకుని అరచేతిలో ఉంచి కొంచెం కోలగా (చిన్న సపోటాపండు ఆకారంగా) చేసి అందులో వేయవలెను. దోరగా, వేగాక తీసి పాకంలో వేస్తూండాలి. ఇవి కూడా ఒకపూట నానిన తర్వాత బాగా వుబ్బి, తినడానికి చాలా బావుంటాయి.

## పాయసం

కావలసిన వస్తువులు :—

1 శేరు పాలు (మంచివి).
½ పావు వాసన బియ్యం (పులావ్ బియ్యం).
½ శేరు పంచదార.
1 కొబ్బరిచిప్ప.
ఏలకులు, కిస్‌మిస్, జీడిపప్పు.
6 లవంగాలు.
2 లేక 3 దాల్చిన చెక్కలు.
2 గరమసాలాలో వేసే ఆకులు.
⅛ తులం కుంకుమపువ్వు.

చేసే విధానం :—కొబ్బరిచిప్ప కోరి ఉంచుకోవాలి. ఏలకులూ, లవంగాలూ, దాల్చిన చెక్కలూ, గుండ చేసుకుని ఓ ప్రక్క ఉంచుకోవాలి. పాలలో కొబ్బరికోరు కలిపి స్టీలుపాత్రలో ఎసరు పెట్టుకుని (నీళ్ళు కలపవద్దు) ఎసరు వచ్చింతర్వాత వాసన బియ్యం కడగకుండానే అందులో వేయాలి. గరమసాలా ఆకులూ, జీడిపప్పు కూడా బియ్యంతో పాటే వెయ్యాలి. బియ్యం ఉడికిన తర్వాత పంచదార పోసి 15 నిమిషాలపాటు కలుపుతూండాలి. ఆపైన కొట్టివుంచిన వాసనపొడి, కుంకుమపువ్వు వేసి, 5 నిమిషాలు ఉంచి దింపేయాలి. ఇష్టం ఉన్నవారు కందిగింజంత పచ్చకర్పూరం వేసుకోవచ్చు. అరకప్పు త్రాగేసరికే చాలనిపిస్తుంది. చేసి చూడండి. ఎంత బావుంటుందో !

**ఉ. విమలాపట్నాయక్.**

## ఫ్రూట్ జెల్లీ

ఫ్రూట్‌జెల్లీ తయారుచేసే విధానం నాకు తెలిసినది వివరిస్తున్నాను. జెల్లీ పాకెట్సు బజార్లో అమ్ముతారు. వీటిని జెల్లీ క్రిస్టల్సు అంటారు. ఖరీదు ఒకటిన్నర, రెండు రూపాయల మధ్య ఉంటుంది. ఒక పాకెట్‌కు ఇంచుమించు ఆరు కప్పుల జెల్లీ అవుతుంది.

ఈ జెల్లీ పొడిపొడిగా, గరుకుగా ఉంటుంది. దీనిలో రాస్‌బెర్రీ, స్ట్రాబెర్రీ, పైనాపిల్, లెమన్—ఇట్లా చాలా రకాలు ఉంటాయి. ఒక్కొదానికి ఒక్కో రుచి ఉంటుంది. మనకు కావలసినది తెచ్చుకోవచ్చు. ప్రతి పాకెట్‌మీద 1 పయింట్ వేడినీరు కలపాలి. అని ఉంటుంది. పయింట్ అంటే 16 అవున్సులు.

జెల్లీ చేయటానికి రిఫ్రిజిరేటర్ ఉంటే గొడవే లేదు. కాని సాధారణంగా రెఫ్రిజిరేటర్లు అందరికీ ఉండవు—అంచేత మామూలుగా తయారుచేసే విధానం రాస్తున్నా. ఈ రెఫ్రిజరేటర్ ఆరు పౌనుల ఐస్ చేస్తుంది. అన్నీ సిద్ధం చేసుకున్నాక ఐస్ తెప్పించుకోవాలి. ముందే తెప్పించుకుని జెల్లీ తయారుచేయటానికి ఉపక్రమిస్తే, ఐస్ అవసరం వచ్చేటప్పటికి కరిగిపోయి ఉంటుంది.

16 అవున్సుల మరిగిన నీరు సిద్ధంగా ఉంచుకోవాలి. ఒక స్టీలు పాత్ర (కిలుము పట్టనిది ఏదైనా సరే) వెడల్పాటిది తీసుకుని అందులో జెల్లీ పాకెట్‌లోని పొడి, రెండు టీ స్పూన్ల పంచదార వెయ్యాలి. జెల్లీ పుల్లగా కావలసినవారు పంచదార వేయ నవసరం లేదు. పంచదార, జెల్లీ పొడి కలిసేటట్లు బాగా కలపాలి. తరువాత కాచివుంచిన నీళ్ళు (గోరువెచ్చగా) పాత్రలో పోస్తూ బాగా కలపాలి. ఈ వేడికి జెల్లీ కరిగి ఎర్రగా అవుతుంది. పంచదార పూర్తిగా కరిగిపోవాలి.

ఇప్పుడు వెడల్పు మూతి గల పెద్ద పాత్రను తీసుకొని దాంట్లో క్రింద ఐస్‌వేసి జెల్లీ పాత్ర మూతతో సహా ఉంచి, చుట్టూరా, పైన ఐస్ ముక్కలు వేయాలి. అంటే జెల్లీ పాత్రకు చుట్టూ ఏమూలా ఖాళీ ఉండకూడదు. పూర్తిగా ఐస్‌తో కప్పబడి ఉండాలి. ఐస్ కరిగిన నీళ్ళు జెల్లీ పాత్రలోనికి వెళ్లకుండా, ఇడ్లీ పాత్ర మూత లాంటిది జాగ్రత్తగా అమర్చుకోవాలి. అలా ఐస్‌లో పెట్టిన జెల్లీ గంట, గంటన్నరకు గట్టి పడుతుంది. గట్టిపడ్డ జెల్లీని స్పూన్‌తో గాని, ఫోర్కుతో గాని కొడితే చిన్న చిన్న ముక్కలుగా చక్కగా ఉంటుంది. ఐస్ ఫ్లాస్కు ఉన్నవారు దీనిని దాంట్లో నిలవ ఉంచుకోవచ్చు. లేకపోతే తినేముందే ఐస్‌లోంచీ తీసుకోవాలి. ముందే తీసివేసిన జెల్లీ కరిగిపోతుంది.

రెఫ్రిజిరేటర్ ఉన్నవాళ్ళు, ఐస్ ట్రేలో ఈ జెల్లీ నీళ్లను పోసి, రెగ్యులేటర్‌ను మాగ్జిమమ్‌కు తిప్పి ఉంచాలి. ఒక గంటలో జెల్లీ గట్టిగడుతుంది.

**విజయ**



ఒక విద్యార్థి స్కూల్ ఫైనల్ పరీక్ష తప్పాడు. అతని తండ్రి ఆ పాఠశాల హెడ్మాస్టర్ వద్దకు వెళ్ళి "ఏమండీ, మా వాడు పరీక్షలో ఫెయిల్ అయ్యాడే! ఏసబ్జెక్టులోనన్నా 35 మార్కులకన్న తక్కువ వచ్చాయా". అని అడిగాడు.

హెడ్మాస్టర్ ఇలా అన్నారు: "మీ వాడికి అన్ని సబ్జెక్టులకూ వచ్చిన మార్కులు కూడినా 35 రాలేదు."

—సి. సీతారామయ్య
(మద్రాసు-33)

# ఉగాది విడుదల!











ప్రసాద్ ఆర్టు పిక్చర్సు వారి..

# భార్యా భర్తలు

నిర్మాత: ఎ.వి. సుబ్బారావు · స్క్రీన్ ప్లే, దర్శకత్వం: కె. ప్రత్యగాత్మ

నవయుగ



# వనితా వాణి

## వనితలు, వ్యాసరచన

8—3—61 వ తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో సి. అన్నపూర్ణ గారు "వనితలు వ్యాస రచన" అన్న వ్యాసం బాగా వ్రాశారు. ఆమె అన్నట్లు స్త్రీలు వంట ఇంటి పనికాక వ్యాస రచన చేయుట కథల రూపకంగానో పత్రికకు వ్రాయుట ముదావహము. అన్నపూర్ణగారు చెప్పినట్లు ఒక స్త్రీనే చక్రవర్తినిగాచేసి ఆమె భావాలతో మనకు ఇష్టములేక పోయినా పాఠక లోకాన్ని విసిగించకుండా అని వ్రాసిన ఆమెకు నా అభివందనములు. విభిన్న రచయిత్రులతో ఈ వనితావాణి పున్నమినాటి చంద్రుడులా వర్ధిల్లాలని ఆశిస్తున్నాను.

తంగిరాల రాజ్యలక్ష్మి (బాపట్ల)

* * *

8—3—61 వ తేదీ పత్రికలో సి. అన్నపూర్ణ గారు వ్రాసిన వ్యాసం చదివాను. చాలా బాగుంది.

క్రొత్తవారు రావాలి. క్రొత్త రచనలు కావాలి. పాతవారు క్రొత్తవారిని ఆహ్వానించాలి. పత్రిక నిత్య నూతనంగా శోభించాలి అన్న వాక్యం చాలా బాగా వ్రాశారు. వ్యాసాన్నిబట్టిచూస్తే అన్నపూర్ణగారు పాతవారనే చెప్పవచ్చు. కనుక పాతవారందరు మా లాంటి క్రొత్తవారిని ఆహ్వానించి, ప్రోత్సహింతురని ఆశిస్తున్నాను.

శ్రీమతి కమల శామన్న (సికింద్రాబాద్)

* * *

సి. అన్నపూర్ణగారు వ్రాసిన "వనితలు—వ్యాస రచన" అను వ్యాసము నాకు ఎంతో నచ్చినది. రచయిత్రి వ్రాసినట్లు సోదరీమణులు పాటిస్తే వనితల వ్యాస రచన ఇంకా ముందడుగు వేస్తుందని నా అభిప్రాయము. మావంటి గ్రామ సీమలయందుండు వనితలకు ఆంధ్ర సచిత్ర వారపత్రిక అమావాస్య చీకటిలో టార్చిలైటు మాదిరి సహకరిస్తుందని వ్రాయటానికి నేను సంతోషపడుచున్నాను.

ముత్యాల శకుంతల (జయపురం)

* * *

## సరళ సలహా

1—3—61 వ తేదీ పత్రికలో సరళగారి సలహా చదివాను. సరళగారు ఆవిడ సలహాను వేదాంత ధోరణిలో పోనిచ్చి అసలు సోదరి అడిగిన దానికి జవాబు చెప్పలేదు. కాని ఆ వ్రాసిన సోదరిగారి ఉద్దేశ్యం "సామాన్యపు" బొద్దు మనుష్యులు గురించి అనుకోను. కొందరు విపరీతంగా లావెక్కిపోయి కదలలేని పరిస్థితిలోకి కూడా వచ్చేస్తారు. అలాంటి వాళ్ళను మా వూళ్లో చాలామందిని చూశాను. అటువంటి వాళ్ళ గతి ఏమిటి? వాళ్ళ జీవితాలు ఇంతి పాలేనా? అందుచేత వారికి సన్నమయే ఉపాయం తెలిపి సరళగారు తమ అమూల్యమైన సలహాతో పుణ్యము కట్టుకోమని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడేనా ఆ సోదరిగారి కోర్కెను గురించీ, మత్పువాసులకొరకైనా కోరిక మన్నించి సలహా యిస్తారనుకుంటాను.

పి. శకుంతల (అమలాపురం)

* * *

1—3—61 వ తేది పత్రికలో పడిన 'సరళ సలహా' ఏమీ బాగులేదు. దాన్ని సలహా అనేకంటే సన్నగాఉన్న వారినిచూసి సరళగారి ఓర్వలేనితనం అనచ్చు. వారు (సరళగారు) లావుగాఉండివుంటారు. సన్నపడాలని ఎన్నో ప్రయత్నాలు చేశారేమో పాపం ఫలించలేదు గావల్ను. అందుకని ప్లేటు మార్చేసి ఇలా రాశారు. సన్నంగాఉంటేనేం? ఎంతమందో తమ సంసారాలు సుఖంగా, సరదాగా గడుపుకోటంలేదూ? చకచకా ఎంతో చలాకీగా పనులు చేసుకోగలరు సన్నటివారు. సరళగారు చెప్పినట్టు లావుగా ఉన్నవారు నిదానస్థులే, మరి కూచున్నచోటునుండి అరగంటగ్గాని లేవలేరు. సరళగారు మంచి మంచి సలహాల నిస్తారని అందరికీ మంచి అభిప్రాయం ఉండేది. అందులో సగం మందికి 'ఈ సలహా' చదవగానే ఆ అభిప్రాయం మారిపోయిఉంటుంది. ఇకమీదటనైనా సరళగారు సలహా నిచ్చేముందు కొంచెం నిదానంగా ఆలోచించి మరీ ఇస్తారని తలుస్తాను. ఇంకో విషయం సన్నగా ఉన్నవారే ఆదర్శ దంపతులు అనిపించుకున్నవారు చాలామంది ఉన్నారు.

పార్వతిరావు (దుర్గాపూర్)

* * *

## ఆదర్శ ప్రాయం

మీ వనితావాణి శీర్షిక మా వనితలకు చాలా ఆదర్శ ప్రాయంగానున్నది. మీ (మా) పత్రికద్వారా వనితావాణి ఇంకా అభివృద్ధి పొందగలదని ఆశిస్తున్నాను.

కుమారి ఎ. ఎస్. రాజ్యలక్ష్మి (తణుకు)

* * *

## చిటికెల చప్పుడు

8—3—61 వ తేదీ పత్రికలో వనితావాణి శీర్షికలో ఇండుగు కళావతీదేవి (విజయవాడ)గారు మందరపు లలితగారి 'సైలెన్సు' వ్యాసంపై తమ అభిప్రాయం వ్రాస్తూ, "భోజనాల గదిలో కనీసం వడ్డించేవారినయినా పిలవాలికదా, అందుకు అధమం చిటికైనా వేయాలి. అది మాత్రం గోల కాదా" అంటూ వ్రాశారు. వడ్డించేవారు నిద్రపోయేవారయితే, చిటికెలు కాదుకదా, అరుపులు కూడా వారిని లేపలేవు. నన్నడిగితే విస్తరిచూసి కావలసిన పదార్థాలు వడ్డించటం, సంజ్ఞలనుబట్టి చాలిందీ, చాలనిదీ తెలుసుకోవటం ఏమంత కష్టంకాదు. కళావతీదేవిగారు కేవలం వ్యాసంలో లోటు ఎంచాలని యిది వ్రాశారుగాని, లలితగారి వ్యాసంలో ఎక్కడా, ఏ పొరపాటూ లేదు.

వక్కలంక సక్కుమాంబ (అయినవిల్లి)

* * *

8—3—61 వ తేదీ వార పత్రిక వనితావాణిలో "చిటికెలు వేసినా శబ్దం తప్పదే" అని 'సైలెన్స్' వ్యాసం (15—2—61 పత్రికలో) వ్రాసిన మందరపు లలితగారి వ్యాసాన్ని విమర్శించారు ఇండుగు కళావతీ దేవి (విజయవాడ.) కాని నాకో సందేహం. మానవుడే తలుచుకుంటే సాధించలేనిది ఏముంది? సైలెన్స్ మెయిన్‌టెయిన్ చేయడం అంతకష్టమయినది కాదు. ఒకవేళ ఆ ఆశ్రమములలో వడ్డన చేసేవారు ఎదర వ్యక్తి విస్తరిలో పదార్థం వుందో లేదో. గ్రహించి వారి ననుసరించవచ్చు కదా! అలాటి సమయంలో చిటికెల శబ్దం వింతగా వినపడుతుంది — కపుతుందో నా మాటను సరియైనదనినమ్మగలరనుకుంటాను ఇండుగు కళావతిదేవిగారు.

మిసెస్ తటవర్తి హరగోపాలకృష్ణ (సూర్యాపేట—కుడ్‌కుడారోడ్డు)

* * *

## మాటల్లో మంచితనం

నేను ప్రతివారం పత్రిక రాగానే మొదట వనితాలోకం చూస్తాను ఏం వ్యాసం రాశారోనని. ఈమధ్య వ్యాసాలు చాలా బాగుంటున్నాయి. ఈ వారం 1—3—61 వ తేదీ పత్రిక చాలా ఆకర్షణీయంగాఉంది. అందులో ముఖ్యంగా వనితా లోకంలో పి. సత్యవతిదేవిగారు వ్రాసిన మాటల్లో మంచితనం అన్న వ్యాసం చాలా బాగున్నది. ఇంత మంచి వ్యాసము రాసినందుకు రచయిత్రికి, ప్రచురించినందులకు మీకు నా హృదయపూర్వకమైన అభివందనములు. ఇంకా ఇటువంటి వ్యాసములను ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.... సెలవ్.

—ఎ. పద్మ (న్యూఢిల్లీ) ★

రాము-ఒరేయి గోపీ, నేను నాజన్మలో కాఫీ కొట్ట లేదురా.

గోపి-జన్మించినప్పుడు కాకపోయినా ఇప్పుడు కాఫీ కొట్టుతున్నావన్నమాట.

—జి. రామసుబ్బారెడ్డి (మద్రాసు)




పర్‌బత్ ఫిలింసు వారి

# ఏక్ ఫూల్ చార్ కాంటే
(ఒక పువ్వు నాలుగు ముళ్లు)

మ్యూజిక్: శంకర్ జైకిషన్ డైరెక్షన్: — భప్పీసోనీ

ఆంధ్ర-సీడెడ్: పూర్ణా ప్రొడక్షన్స్ విజయవాడ-2 విశాఖపట్టణం-2

# రాయల రాజ్యంలో

చక్రపాణి నరసింహారావు

అది వర్షాకాలం! ఆకాశమంతా మబ్బులతో నిండిఉంది. కొంచెము సేపటిలో వాన వచ్చేస్తుందేమో! పక్షులన్నీ వేగంగా తమ గూళ్ళకు పోతున్నాయి. వానకూడ ప్రారంభ మయింది. ఆసమయంలో ఒక అడవి దారిని పట్టుకొని ఒక బాటసారి వేగంగాపోతున్నాడు. వానజోరు హెచ్చింది. బాటసారి కూడ వేగం హెచ్చించాడు. బలమైన శరీరం. చేతిలో ఖడ్గం వుంది. దూరంలో కొన్ని గుడిసె లగుపించాయి. బాట సారికి ప్రాణం లేచివచ్చింది. త్వర త్వరగా పోయి ఒక కుటీరములోకి దూరాడు తల దాచుకోవడానికి.

ఆ కుటీరంలో క్షయరోగంతో బాధపడుతున్న ఒక ముసలితాత అగుపించాడు. మరెవరూ లేరు. పాపం బాధతో దగ్గుతున్నాడు. మనబాటసారికి దగ్గడం నరిపడదు. దగ్గేవాళ్ళను చూస్తే ఆయన వళ్ళు భగ్గుమంటుంది.

"తాతా! నా ఎదుట దగ్గవద్దు. నాకు చాలా అసహ్యం దగ్గేవాళ్లను చూస్తే" అన్నాడు బాట సారి మాటలు తాతకు వినపించలేదు. పాపం! ఆయన బాధతో మూలుగుతున్నాడు. మరల మరలా దగ్గుతున్నాడు. బాటసారికి కోపం వచ్చి తనచేతిలో ఉన్న కత్తి తాతమీదకు విసిరాడు. ముసలి నాగ! అమ్మా! అని కేకపెట్టి మరణించాడు.

ఇంతటి క్రూరు లెక్కడైనా వుంటారా? ఆ ముసలితాత కేకవిన్న ఇరుగు పొరుగు వారు చేరి ఆ బాట సారిని పట్టి బంధించి రాజువద్దకు తీసు కొనిపోయారు.

ఆంధ్రసామ్రాజ్యలక్ష్మికి కొలువు కూటమా సభారంగం. అష్ట దిగ్గజము లొకవైపు, మహామంత్రు లొకవైపు కూర్చున్నారు. నవరత్న ఖచితమైన సువర్ణ సింహాసనంపై సాహితీసమరాంగణ సార్వభౌము డైన శ్రీ కృష్ణదేవరాయలు కొలువు తీరినారు. రాయల ప్రక్కనే ఒక ఉన్నతాసనంపైన మహామంత్రి తిమ్మరుసు ఆశీనుడైనాడు. సభా భవనం కిటకిట లాడుతూంది.

ఇంతలో సభాస్థానమునకు హంతకుని బంధించి తెచ్చినిలబెట్టిరి. అందరి దృష్టులు హంతకుని పైననే! ప్రజలు బాటసారిచేసిన దుండగాన్ని మహారాజుకు మనవిచేశారు. తిమ్మ రుసు గంభీరంగా ఆ బాటసారిని చూచి—"ఇందులకు నీ సమాధాన మేమి" అన్నాడు.



"నేనిన్నాళ్ళు కాని దగ్గను. దగ్గే వాళ్ళను చూస్తే నా వళ్ళు భగ్గుమంటుంది. ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోనక ఆ ముసలివాడు మరలా దగ్గి నా కోపానికి బలియైనాడు. అంతే జరిగిన సంగతి" అన్నాడా హంతకుడు. ఆతని ధైర్యానికి, తొణకకుండా, బెణకకుండా ఆత డిచ్చిన సమాధానానికి అందరు ఆశ్చర్యచకితులయ్యారు. జంకు గొంకు లేకుండా వాడిచ్చిన సమాధానంవిని రాయల ముఖకమలంలో చిరునవ్వులు మొలకలెత్తినాయి. "ఈ హంతకునికి శిక్ష విధింపు అప్పాజీ!" అన్నట్లు రాయలు తిమ్మరుసును తిలకించాడు. తిమ్మరుసు తీర్పు వినాలని సభ అంతా మంత్రివైపు ఆత్రంగా చూస్తూంది.

మహామంత్రి లేచి — "ఇతని మనస్సు వికలమైంది. కావలసిన ఆహారాన్నిస్తూ, రాజభటుల సంరక్షణలో కొంతకాలం హాయిగా ఉంచండి మహారాజా! ఇదే వీడికి తగిన శిక్ష!" అన్నాడు. "హంతకునకు రాజసన్మానమా?" అని ప్రజలంతా ఆశ్చర్యపడ్డారు. ఎవరికీ ఏమీ దిక్కు తెలియలేదు. అంతటితో సభ ముగిసింది.

బాటసారి ఒక చక్కని భవనంలో కావలసిన ఆహారం, కోరిన దుస్తులలో హాయిగా గున్న ఏనుగులా పెరుగుతున్నాడు. రాయలపై, ఆతనికి ప్రేమాభిమానాలు ఎక్కువైనాయి. ఆరునెలలు గడచిపోయింది. బహామని సుల్తానొకడు విజయనగర రాజ్యంపై దండెత్తాలని సన్నాహపడుతున్నట్లు వర్తమానం తెలిసింది.

"దీనికి ప్రతీకారమేమిటా"? అని రాజు, మంత్రులు కలిసి ఆలోచించారు. తర్వాత మంత్రి బాటసారిని రమ్మని కబురంపాడు!

బాటసారి ఉత్సాహంతో బయలుదేరాడు, రహస్యమందిరంలో కొచ్చారు. రాయలకు, తిమ్మరుసుకు చేతులెత్తి నమస్కరించి చేతులుకట్టుకొని— "ఎందుకు ప్రభూ, రమ్మన్నారు?" అన్నట్లు నిలబడ్డాడు.

మంత్రిగారు బాటసారితో— "ఓయీ బహమనీ రాజు వద్దకు రాయబారివై పోయిరాగలవా? ఇందులకు నీవే తగినవాడవు. ఏమందువు?" అన్నాడు.

బాటసారి సంతోషంగా "మహాప్రసాదం" అని సుల్తాను వద్దకు బయలుదేరాడు.

భామినీసుల్తాను కొలువుతీరినాడు. ఇరువైపుల విచ్చుకత్తులతో సైనికులు బారులుతీరి నిలుచున్నారు. రాజనర్తకి నృత్యం చేస్తూంది: పాదుషా ద్రాక్షారసం సేవిస్తూ ఆనందంలో వళ్ళుమరచి వున్నాడు. ఇంతలో ఒకభటుడు ప్రవేశించి పాదుషాకు సలాముచేసి "విజయనగరమునుండి తమ దర్శనార్థము రాయబారి విచ్చేసినా"డని తెలిపినాడు. పాదుషాకు మత్తుదిగిపోయింది. "సరే, ప్రవేశపెట్టు" అన్నాడు.




అతని ఆనందానికి అంతరాయం కలిగింది. మన బాటసారి—కాదు రాయబారి ఠీవిగా సభాస్థానంలో ప్రవేశించాడు. అందరి దృష్టి అతనిమీదే! వచ్చినవాడు పాదుషాకు సలామైనా చేయలేదు — సరిగదా, రాయలు పంపిన కమ్మను పాదుషా ముందు విసిరివైచాడు.

తురకరాజు తృళ్ళిపడ్డాడు, సభికుల గుండెలు మండినాయి. భటులు కత్తులపై చేయివైచినారు. మంత్రి మాత్రం కోపాన్ని దిగమ్రింగి, ఆ లేఖనందుకొని బిగ్గరగా చదివాడు.

"ఓ సుల్తానా! మృత్యుముఖములోకి తెలిసి, తెలిసి ప్రవేశించకు. త్రిలింగ దేశాన్ని జయించాలనే ఆశ నీ మూర్ఖత్వానికి చిహ్నం! అది కలలోనిమాట. ఆంధ్ర వీరుల పరాక్రమయశశ్చంద్రికలు నీ అజ్ఞానాంధకారాన్ని దిగమింగుతాయి! నీవు నీ ప్రజలు సుఖంగా వుండాలంటే త్రిలింగాధీశ్వరునికి కోపం తెప్పించే ఏపనిగానీ చేయవలదు......" లేఖ పూర్తిగా చదువకముందే పాదుషా హుమ్మని, పండ్లు కొరుకుతూ దాన్ని మంత్రి చేతినుండి లాగుకొని ముక్కలు ముక్కలుగా చింపి [illegible] వేసి కాలరాచాడు. అంత[illegible] కోపం చల్లారక కన్నులె[illegible] పెదవు లదరుతూంటగా రాయ[illegible] "ఛీ...ఛీ" అన్నాడు. అంతవరకు వింతగా చూస్తున్న మన రాయ[illegible] ద్విగుణీకృత క్రోధంతో "ఖబడ్[illegible] తానా! హుంకరించావు, వళ్ళు[illegible] కావు, రాయల లేఖ[illegible] ముక్కలుచేసి నేలపై [illegible] రాచినావు. మా [illegible] మానించినావు. ఇంతవరకు [illegible] చావు కానీ — నన్ను [illegible] యనదవేలరా? [illegible]

తలచావా? మర్యాదమన్నన తెలియని రాచపీనుగా! ఇక సహించను" అని తన కరవాలాన్ని ఝుళిపించి ఒక్కఉదుటున పోయి భామినీ సుల్తాను శిరస్సును ఖండించాడు. సభాసదులు తమతలలు తడివిచూచుకొన్నారు, ఉన్నాయో లేదోనని. రాజభటులుభయకంపితులైచెల్లాచెదరయ్యారు. రాయలకు విజయం చేకూరింది.

అప్పుడు ప్రజలంతా తిమ్మరుసు దూరదృష్టిని, అతని గొప్పతనాన్ని గురించి కీర్తించారు. "హంతకునికి రాజసన్మానమా?" అని ఆశ్చర్యపడ్డవారు ఈనాడు రాయబారి ధైర్యసాహసాల్ని మెచ్చుకొన్నారు. ★

# బిచ్చగాని కుక్క

రామాపురం అనే గ్రామంలో ఒక కుంటిబిచ్చగాడు ఉండేవాడు. వాని దగ్గర ఒక కుక్క ఉండేది. వాడు కర్రలు చంకన బెట్టుకొని బిచ్చమెత్తుకోడానికి వెళ్ళినప్పుడు ఆకుక్క బుట్ట నోట కరచుకొని వాడివెంట వెడుతూ వుండేది. అది బుట్ట పట్టుకొని వాడు ఆగమన్నచోట ఆగి కూర్చోమన్నచోట కూర్చుని బిచ్చగాడి ఆజ్ఞలు పాటిస్తూ వుండేది. అదంతా ఆ గ్రామస్తులకు చిత్రంగా వుండేది. అందువలన ఆ గ్రామస్తులు దాని బుట్టలో ఓకాని డబ్బో-బియ్యమో తప్పకుండా వేస్తూ వుండేవారు. ఆవిధంగా వచ్చినదానితో ఆ బిచ్చగాడు జీవిస్తూ వుండేవాడు. కొన్నాళ్లకు బిచ్చగాడు జబ్బుపడి చచ్చిపోయాడు.

పాపం! ఆ బిచ్చగాడి కుక్క ఆ నాటినుండి ఒంటరిదైపోయింది. ఎవరైనా దయతలచి అన్నంపెడితే తినేది. లేకపోతే అలాగే ఎక్కడైనా ఒకమూల పడివుండేది. అది బిచ్చగాడి కుక్కగా పేరుపడినందున యితరులు ఎవరైనా ఎగతాళి చేస్తారన్న భయంతో దాన్ని దగ్గరకు తీసి పెంచుకోటానికి ఎవరూ సాహసించలేకపోయారు.

**దొంతంశెట్టి విశ్వేశ్వరరావు**

ఆ వూరిలోనే కామయ్య అనే సంపన్నగృహస్థుడు వుండేవాడు. ఆయన భార్యపేరు పార్వతమ్మ. ఆ దంపతులకు లేకలేక పుట్టిన కొడుకే రాము. అతి గారాబంగా పెరిగాడు. పది సంవత్సరాలు వుంటాయి.

ఒకరోజున రాము తన స్నేహితులతో కలిసి ఆవూరి చెరువు పక్కన వున్న ఖాళీ స్థలంలో బంతిఆట ఆడుకుంటూ వుంటే బంతి చెరువులో పడింది. ఆ బంతిని బయటకు ఎలా తీయాలో తెలీక వాళ్ళంతా అలాగే బంతిని చూస్తూ నిలబడిపోయారు. అలా తిరుగుతూ ఆ సమయానికి అక్కడకు వచ్చిన బిచ్చగాని కుక్క బంతి చెరువులో పడటం చూసి గబుక్కున చెరువులోకి దూకి యీదుకుంటూ వెళ్ళి బంతిని నోటితో కరచిపెట్టి తెచ్చి వాళ్ళముందు పడవేసింది. వాళ్ళ సంతోషానికి అంతు లేకపోయింది. ఆ క్షణంలో రాముకు దానిపై అంతులేని ప్రేమ కలిగింది. దాన్ని యింటికి తీసుకుపోయి పెంచుకోవాలనుకున్నాడు.

రాము బిచ్చగాడి కుక్కను లోపలకు తీసుకొనిరావడం పార్వతమ్మ చూచి మండిపడ్డది. అది బిచ్చగాడి కుక్కని, దాన్ని పెంచుకుంటే అంతా నవ్వుతారని, అసహ్యించుకుంటారని—ఎన్నోవిధాల నచ్చజెప్పింది. రామును ఒప్పించటానికి ఎంతో ప్రయత్నించింది. రాము మొండిపట్టు పట్టాడు. దాన్ని విడిచిపెట్టడానికి ఒప్పుకోలేదు. "అయితే నాన్నగారు రానీయ్ నీపని చెప్తాను" అంది కోపంగా.

రాముకు నాన్నదగ్గర చనువు, భయం రెండూ వున్నాయ్. వాళ్ల అమ్మ నాన్నగారితో చెప్తాననగానే రాముకు ఎందుకో భయంవేసింది. వెంటనే ఆ కుక్కను తీసుకొని బయటకు వచ్చాడు విడిచిపెట్టాలని. ఆ కుక్క దీనంగా తనవైపు చూస్తూ తోకాడిస్తూంటే—రాముకు దాని మీద ఎంతో జాలివేసింది. అంతలో రాముకు ఒక మెరుపులాంటి ఆలోచన తట్టింది. వాళ్ళ ఇంటిముందు విశాలమైన వాకిలివుంది. ఆ వాకిటిలో ఒక పెద్ద చింతచెట్టు వుంది. ఆ చెట్టు మొదటలో పెద్ద తొర్ర వుంది. రాము లోపలకు వెళ్ళి గోనెగుడ్డ తెచ్చి ఆ తొర్రలో పరచి కుక్కను దానిమీద కూర్చుండపెట్టాడు. ఆకులో అన్నం తెచ్చాడు. చిన్న మట్టిదాకలో నీళ్ళు వుంచాడు. బిచ్చగాడికుక్క ఆప్యాయంగా రాముపెట్టిన అన్నంతిని మంచినీళ్ళు త్రాగింది. దాని... అక్కడే వుండి

# బిచ్చగాని కుక్క

మని సైగజేసి యింట్లోకి వెళ్ళి పోయాడు రాము.

కామయ్య, పార్వతమ్మ, రాము ప్రతిరోజూ బిచ్చగాడి కుక్కకు చింతచెట్టు దగ్గర అన్నం పెట్టటం, అది ఆచెట్టు తొర్రలో మకాం వేయడం గమనించారుగాని, ఆకుక్కను యింట్లోకి తీసుకురావడం లేదనే సంతృప్తి వలన అయితేనేమి, రాము మీద వుండే వాత్సల్యం కొలదీ వాడిని చిన్నబుచ్చటం ఎందుకనే భావంవలన అయితేనేమి, వారు రాముచేసే ఆపనికి అభ్యంతరం చెప్పలేదు.

ఇలా కొన్నిరోజులు గడిచాయి. ఒకరోజున రాము ఉదయం నిద్ర నుండి లేచేసరికి జోరుగావర్షం కురుస్తూంది. చలిగాలి తీవ్రంగా వుంది. అది రానురాను గాలివానగా మారింది. కామయ్యగారు కూడ గాలివానవలన పొలంలోకి వెళ్ళకుండా యింట్లోనే వుండి పోయారు. గాలి తీవ్రతకు తలుపులు కొట్టుకుంటూంటే పార్వతమ్మ కిటికీ తలుపులు, వీధి తలుపులు మూసి వేసింది. రాము ఇంట్లోవున్నాడన్న మాటేగాని, అతనిధ్యాస అంతా 'టైగర్' (బిచ్చగాని కుక్కకురాము పెట్టిన పేరు) మీదనేవుంది. తనైతే చలిదుస్తులు వేసుకొని వెచ్చగా వున్నాడుగాని పాపం 'టైగర్' ఎముకలు కొరికి వేస్తున్న చలిలో కుండపోత వర్షంలో ఎలా వుందో! తడిసిపోయిందేమో! ఇలాంటి ఆలోచనలతో అతనిమనస్సు గిజగిజలాడి పోయింది. బయటకు వెళ్ళి చూడాలనిపించింది. లోపలకు తీసుకురావాలని మనస్సు తపించింది. కాని నాన్న యింట్లో వున్నాడు. అమ్మ ఏమంటుందో? నాన్న కోప్పడతాడేమో? ఏమి చేయటానికి తోచటం లేదు. ఏమి చేయటానికి అతని చిన్నారి హృదయం సాహసించలేక పోతూంది. మనస్సు వెనక్కూ-ముందుకూ వూగులాడుతూంటే గదిలో మంచంమీద ముడుచుకొని వుదాసీనముగా కూర్చున్నాడు.

బయట గాలివాన ఉధృతం హెచ్చింది. ఊళ్ళో ఎవరూబయటకు రావటంలేదు. తలుపులు బిడాయించుకొని ఇళ్ళల్లో కూర్చున్నారు. రాము మాత్రం గాలివానను కసితీరా మనస్సులో తిట్టుకున్నాడు. మధ్యాహ్నమయింది. ముగ్గురూ భోజనంచేశారు. రాముకు 'టైగర్' మీదే ధ్యాసవుండి పోయింది. 'దానికి ఆకలేస్తూ వుంటుంది. వర్షానికి తడిసి పోయివుంటుంది' అనుకున్నాడు. నెమ్మదిగా వంటింట్లోకి వెళ్ళాడు. వారు భోజనంచేయగా మిగిలిన అన్నం, కూర ఒకగిన్నెలో పెట్టుకొని ఎవరూ చూడకుండా వచ్చి వీధితలుపు తీయబోయాడు. పార్వతమ్మ ఎలా చూసిందో ఏమో "ఏమిటి రాఅది" అనేసరికిఅదరిపోయి బిత్తరపడి నిలబడిపోయాడు. గిన్నెలోని అన్నంచూచి, ఆమె అంతా గ్రహించి "ఆమాయదారి కుక్క నీకెక్కడ దాపురించిందిరా! గాలివానలోబయటకు వెడితే ఇంకేమైనా వుందా! ఏమండోయ్! చూశారా! ఆ దిక్కుమాలిన కుక్కకి అన్నం వేయడనికి యీ కుంభవర్షంలో తడిసి వెడతాడట" అంది భర్తతో. రాము బెడిసిపోయాడు. "ఏరా తన్నులేమైనా కావాలా? పోనిలే అని వూరుకుంటూంటే పిచ్చిపిచ్చి వేషాలు వేస్తున్నావు. అసలు ఆ కుక్కని అక్కడనుండి వెళగొడితేనేగాని నీ రోగం కుదరదు. గాలివాన తగ్గనీ, దాన్ని తోలేస్తాను" అన్నాడు కోపంగా తండ్రి.

రాము బిక్కపోయి, బిత్తరపోయి, బిక్కముఖం వేసి మంచం మీద వ్రాలి పోయాడు. హృదయం బరువెక్కింది. నిద్రముంచుకొచ్చింది.

ఇక 'టైగర్' ఆ తొర్రలో అలాగే ముడుచుకొని ఓమూలగా పడుకుంది. రాము కన్పిస్తాడేమోనని అప్పుడప్పుడు మూసివున్న తలుపుల వైపు ఆశగా చూచేది. గాలివాన ఉధృతం హెచ్చుతున్న కొలది దానికి ఆదుర్దా ఎక్కువయ్యేది. సాయంకాలం అయింది. ఆకలితో చలితో బాధపడుతూ మూల ముడుచుకు పడుకున్న టైగర్ ఏదో శబ్దం విని ఉలిక్కిపడిలేచి నిలబడింది. బయటకు తొంగిచూచింది. అంతే దానికి గుండె దడదడ కొట్టుకో ప్రారంభించింది. ఆ పెద్దచింత చెట్టుగాలివానకు రాము ఇంటిమీదకు ఒరిగిపోతూవుంది.

(63 వ పేజీ చూడుడు)

## ఉగాది స్మరణ

శ్రీ ముంగర

పసిడిబుగ్గల పాపల్లార!
భావిభారత పౌరుల్లార!!
షప్పూ బెల్లం తిన్నారా? ఉగాది
పచ్చడి తిన్నారా?
మేలిమిపలుకుల బాలికలార!
భావిభారత మాతల్లార!!
వేడుక చూశారా? ఉగాది
పండుగ చేశారా?
శార్వరికి వీడ్కోలు ఇచ్చారా?
ప్లవకి సుస్వాగతం చెప్పారా?
ఉగాదిరాక - జగతికి బాకా
ఉగాదిపాట-ప్రగతికి బాట!

# వెన్నెల

## గోవిందరాజు శ్యామసుందర్

ఉత్తరం చదివి బల్లమీద పడేశాను "... ... రేపురాత్రి బయలుదేరి వస్తున్నాను."

నీ ప్రియమైన మరదలు,
రుక్మిణి."

ఈ వాక్యాలు మాత్రమే సరిగ్గా గమనించగలిగాను. ఒక్కసారిగా ఏడేళ్లచరిత్ర కళ్లకు కట్టినట్లయింది....

*  *  *

కమలతో నా పెళ్లి కథలోలాగ జరిగి పోయింది. మేళతాళాలు, బంధువుల హడావుడి, పిల్లల సంబరం-ఇవన్నీ మూడు రోజుల్ని, అన్ని క్షణాలుగామార్చేశాయి. మమ్మల్నిద్దర్నీ దీవిస్తున్నప్పుడు మా మామయ్య, అత్తయ్యల ముఖాలలోని ఆనందాన్నీ, సంతృప్తినీ చూడగలిగిన నా కళ్లు చమర్చాయి. మా అమ్మ నాకు బుద్ధి తెలియకముందే మరణించింది; నాన్న నాలుగు సంవత్సరాలు నిండకమునుపే గతించాడు. నన్ను పెంచి పెద్దచేసి నా ఆస్తి, వ్యవహారాలను చూసిపెట్టిన మామయ్యా, అత్తయ్యా వీరిద్దరే నాకు తలిదండ్రులవంటి వారయ్యారు. వారి కూతుళ్ల చదువు సమస్యగా మిగిలిపోయినప్పుడు నేనే కలుగజేసుకున్నాను. పెద్దది కమల. స్కూల్‌ఫైనల్ పాసయ్యి ఇంటిదగ్గరే ఉంది. కమల చెల్లెలు రుక్మిణిని కూడా చదువు మాన్పించివేస్తానంటే నేనే పట్టుపట్టి కాలేజీలో చేర్పించాను. ఎంత వాదించినా అత్తయ్యా, మామయ్యా ఇద్దరూకూడా నేను చేసిన ఈ పనికి హర్షించారని నాకు బాగా తెలుసు.....

కమలను పెళ్లిచేసుకుంటానని చెప్పినప్పుడు మామయ్య ఏమంటాడో అని భయపడ్డాను. కాని ఆయన సంతోషానికి అంతులేదు. వెంటనే ముహూర్తం పెట్టించేశాడు. పెళ్లికి కావల్సిన ఏర్పాట్లన్నీ అత్తయ్య స్వయంగా చేయించింది. పెళ్లి ఇంకా పదిరోజు లుండనగానే నన్ను గుంటూరునుంచి రప్పించి విడిది ఏర్పాటు చేయించింది. కళ్లముందు పుట్టి పెరిగిన వాడి కీ మర్యాదలన్నీ ఏమిటని నేను అడ్డుపెట్టినా, పెళ్లి పెళ్లేనని నా అభ్యంతరాలన్నిటినీ తోసేసింది. ఈ తతంగాలలో మళ్లా పెళ్లి వరకూ కమలను సరిగా చూడలేకపోయాను. "నన్ను చేసుకోడం నీ కిష్టమేనా కమలా?" అని నేనడిగినప్పుడు ఆమె నావరించిన సిగ్గు నన్నుముగ్ధుణ్ణి చేసింది. మా ఇద్దరిమధ్యా అంతవరకూఉన్న చనువు మాయమయిపోయింది. సరే నన్నట్లుగా తల ఊపినతర్వాత నేనుకూడా మాట్లాడలేకపోయాను... ...

వెన్నెలలో డాబామీద కొబ్బరిచెట్లనీడలు స్పష్టంగా పడుతున్నాయి. వచ్చినబంధువులు చాలామంది వెళ్లిపోయారు. ఇల్లు చాలామట్టుకు సద్దుమణిగి ఉంది. దూరాన వూరిదీపాలు కొన్ని మిణుగురు మంటున్నాయి. తీయగా ఎదురుచూస్తున్న నేను గాజులశబ్దం విన్నాను. కమల మెల్లిగా అడుగులు వేస్తూ, నా దగ్గరకువచ్చి ఆగిపోయింది.

"కమలా !" అన్నాను నేనే చివరకు.

"ఊఁ !" అని వంచిన తల పైకెత్తి చూసింది. వెన్నెలలో ఆమెకళ్ళు మెరిశాయి.

"మనం అదృష్టవంతులం......" తడబడే గొంతుకతో అన్నాను. కమల చిరునవ్వు నవ్వింది. సిగ్గుతో బుగ్గల్ని రెండుచేతులతో కప్పేసుకుంది

"మాట్లాడవేం?" అని అడిగాను.

"మీరు... ..." అని ఏదో చెప్పబోయింది. నేను కమల మాటల కడ్డువస్తూ, "ఎప్పుడూలేని ఈ బహువచనప్రయోగం ఇప్పు డెక్కడ్నుంచి వచ్చింది? పెళ్లయినా నేనింకా నీ బావనే" అన్నాను.

"సరే బావా! అలాగే పిలుస్తాలెండి......పిలుస్తాలే!" వెన్నెలలో మా నవ్వు ఆకుల గలగలలో కలిసిపోయింది... ...

*  *  *

రైల్లో వెడుతూ ఉండగా మెల్లిగా అన్నది, "బావోయ్! ఇంతవరకూ ఇష్టంవచ్చినప్పుడు హోటలుగడ్డి తిని దున్నపోతులా పడి ఉండేవాడివి! ఇంక ఇటువంటిదేదీ కుదరదు తెల్సా?" ఇంత మెల్లిగా చెప్పినా ఇది మాతో ప్రయాణం చేస్తున్నాయనకు వినబడి ఆయన చిరునవ్వుతో మా వైపు చూశాడు. నేనుకూడా ఆయనకు వినబడేట్టు మెల్లిగా, "నీకు పుణ్యముంటుంది! వూరికెళ్లిన తర్వాత కొత్తచీపురుకొనిస్తా. అంతవరకూ నాపరువు తీయక ! ఎవరన్నా వినపోతారు !" ఇంకేముంది, కమలకు కళ్లవెంబడి నీళ్ళు తిరిగాయి. గంటసేపు వేడుకునేవరకూ మూతి ముడుచుకు కూర్చుంది......

*  *  *

గుంటూరు స్టేషనుకి కిశోరు, ఆచారితో సహా, ఇంచుమించు నాస్నేహితులందరూ వచ్చారు. పెళ్లికి రాలేపోయినవారు కొందరు నన్నుడికించడానికి వినబడీ వినబడనట్లుగా "నీకంటే మీ ఆవిడే బావుం"దని, ఇందులో పెద్ద ఆశ్చర్యపడవల్సిన దేమున్న"దనీ, "మనవాడి అందం మనకి తెలీదుట్రా!" అనీ పరిపరివిధాలుగా అన్నారు. కమల ఎంత కాదన్నా గడుసరికాబట్టి, ఈ పరిహాసాలకి చలించకుండా మృదువైన చలోక్తులతో మమ్మల్నందర్నీ నవ్వులలో ముంచేసింది... ...

మా ఇల్లు, మా స్నేహితుల భార్యలకు కూడా ఒక కేంద్రమయిపోయింది. కమల వీణ వాయిస్తే వినటానికనీ, కుట్టుపని తెలుసుకోటానికనీ ఎప్పుడూ ఎవరో వచ్చిపోతూ ఉండేవారు. కమల ఇట్టే అందరికీ సన్నిహితురాలైపోయింది.

మా సంసారంలో రెండేళ్లు రెండు క్షణాలలా గడిచిపోయాయి. 'అంబి' పుట్టాడు. మా జీవితంలోని కొక క్రొత్త వెలుగు ప్రవేశించింది. అత్తయ్య మామయ్యల ఆనందానికి అంతులేదు. వీలైనప్పుడల్లా వచ్చి వెడుతూ ఉండేవారు. అంబి రుక్మిణిని చూస్తే వదిలిపెట్టేవాడు కాదు. రుక్మిణికి అంబి అంటే ప్రాణం.

"పిల్లలంటే ఇంత ఇష్టపడే దానివి పెళ్లెందుకు చేసుకోకూడ"దని కమల రుక్మిణిని ఏడిపిస్తూ ఉండేది. రుక్మిణి దీనికి నవ్వి, "చూస్తూ ఉండు, వీడు నా దగ్గరే పెరుగుతాడు! ఏరా అంబీ?" అని బుగ్గ గిల్లేది......

*  *  *

రుక్మిణి ఇంటరుపరీక్షలు జరిగిన కొద్దిరోజులకే మా కొక ఘోరమైన విపత్తు సంభవించింది. ఆ ఊరిలో విజృంభించిన మశూచికం తగిలి మా అత్తయ్య మామయ్య లిద్దరూ ఈ లోకాన్ని వదిలి వెళ్లిపోయారు. చిన్నదైనా రుక్మిణే మమ్మల్ని ఓదార్చి ధైర్యం చెప్పవలసివచ్చింది. తన తల్లిదండ్రుల మరణం రుక్మిణిలో డాక్టరవాలన్న నిశ్చయాన్ని దృఢపరిచింది. నేనా కమలా తప్ప దగ్గరవాళ్లెవరూ లేకపోవటంవల్ల రుక్మిణి చదువు భారమంతా నామీద పడింది. మెడికల్ కాలేజీలో చేర్పించాను....

*  *  *

అంబికి నాలుగో ఏడనగా లక్ష్మి పుట్టింది. ఆడపిల్ల కావాలనుకున్న కమల సంతోష మింతా అంతా కాదు.

"పిన్నీ నాకు చెల్లాయి పుట్టింది!" అంబి గంతులువేశాడు. పాపాయి నెత్తుకున్న రుక్మిణితో, "అంబిగాడ్ని ముద్దుచేసి నెత్తికెక్కించుకున్నావు. దీన్నికూడా అలాగే తయారుచేసేట్లున్నావు!" అన్నది కమల నవ్వుతూ.

# వెన్నెల

"నీ పిల్లలు చెడిపోతారని అంతభయమైతే నేనసలెత్తుకోనే ఎత్తుకోను!" రుక్మిణి నవ్వుతూనే పాపనింకా దగ్గరగా హత్తుకుంది......

*      *      *

రుక్మిణీ అంబీ ఇద్దరూ అస్తమానం పాపాయి నాడిస్తూ ఉండేవారు.

"దాన్నే ఎప్పుడూ ఎత్తుకు కూర్చుంటే నీ చదువు సాగినట్టే!" అని కమల చివాట్లు వేస్తూ ఉండేది. రుక్మిణి లెక్కచేసేది కాదు. నిజానికి రుక్మిణి అన్ని పరీక్షలలోనూ మంచిమార్కులే తెచ్చుకునేది. అది కమల కెక్కువ సంతోషం కలిగించినా, "చూడు బావా ఇది మరీ గడుగ్గాయయిపోతోంది!" అని రుక్మిణిని ఏడిపించడానికని కమల నాతో ఫిర్యాదుచేసేది.

"నీకు తగ్గచెల్లెలేగా !" నేను నవ్వి వూరుకునేవాడిని......

*      *      *

పాపకి రెండేళ్ళు నిండేయి. వచ్చీరాని మాటలతో అందరినీ ఆనందపరిచేది. కమలకు కొన్ని రోజులుగా జ్వరం వస్తూ, తగ్గుతూ ఉండడంవల్ల పిల్లల బాధ్యత రుక్మిణికి కొంచె మధికమయింది. జ్వరం తగిలినప్పుడు "మందుచీటీ రాసిస్తా. పుచ్చుకో" అనేది రుక్మిణి.

"నీ డాక్టరీ విజ్ఞానం నామీద ప్రయోగించకు బాబూ!" కమల ఉడికించేది. రుక్మిణికి చిరుకోపం వచ్చినా అంతకంటే ఎక్కువ శ్రద్ధతో మందు ఇప్పించేది. ఈ జ్వరాలు మాటిమాటికి రావడంచేత కమల బాగా నీరసించిపోయింది. చాలామంది డాక్టర్లకు చూపించాముకాని వారంతా జబ్బేమీ లేదనీ, కేవలం బలహీనతేననీ అన్నారు. పని చేయడం తగ్గించమని మేమెంత చెప్పినా వినేదికాదు కమల. రుక్మిణికూడా చెప్పిచూసింది. కాని కమలు నవ్వేసి ఊరుకునేది......

*      *      *

రోజులు గడుస్తూనే ఉన్నాయి. రుక్మిణి డాక్టరు చదువు పూర్తిచేసి మద్రాసు ఆస్పత్రిలో ఉద్యోగం దొరికితే వెళ్లింది. వీలున్నప్పుడల్లా గుంటూరువచ్చి పిల్లల్నిచూసి వెడుతూ ఉండేది. కమల అప్పటికే రుక్మిణి పెళ్లిప్రయత్నాలు చేయవలసిందని నాతో చెబుతూ ఉండేది. నేను, ప్రత్యేకంగా చేయగలిగిందేముందని వాదించేవాడిని, కాని వీలైనంతమట్టుకు వరాన్వేషణ చేస్తూనే ఉండేవాడిని......

అప్పటికి పదిరోజులుగా కమలకి బాగా జ్వరంగా ఉన్నది. రుక్మిణికి రాస్తానంటే తనే వారించింది. ఒకనాడు మధ్యాహ్నం ఆఫీసులో ఉండగా పక్కఇంటి అబ్బాయి పరుగెత్తుకుంటూవచ్చి చెప్పాడు కమలకు చాలా ప్రమాదంగా ఉందని. ఇంటికి వెళ్లి కమల స్థితి చూసేప్పటికి నిలువునా నీరైపోయాను. వెంటనే ఆస్పత్రికి తీసుకెళ్లి చేర్పించాను. ఏదో వాతమన్నారు. కంగారులో రుక్మిణికి టెలిగ్రాం మిద్దామనుకుని ఇవ్వలేకపోయాను......

*      *      *

ఆ రాత్రి కమల శాశ్వతంగా కన్నుమూసింది. తర్వాత ఏమిజరిగిందో కూడా తెలీలేదు. "అమ్మ ఎప్పుడు వస్తుందని" అడిగే పిల్లల ప్రశ్నలకు సమాధాన మేమిచ్చానో జ్ఞాపకంలేదు. కిశోర్ రుక్మిణికి టెలిగ్రాం పంపాడు. అందులో కమలకు 'సీరియస్'గా ఉందన్నాడేకాని నిజం చెప్పలేదు. టెలిగ్రాం పంపినరోజే రుక్మిణి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

"ప్రియమైన బావకి.

ఈమధ్య గుంటూరునుంచి వచ్చినవాళ్లెవరో అక్కయ్యకు జబ్బుగా ఉందిట అని చెప్పగా విన్నాను. అందుకనే అక్కయ్యకు వ్రాయకుండా నీకు నేరుగా వ్రాసే అవసరం కలిగింది. అంత జబ్బుగావుంటే ముందే నాకీ విషయం తెలిపి ఉండవలసింది. అంబి, లచ్చి ఎలా ఉన్నారు? నేను రేపు రాత్రి బయలుదేరి వస్తున్నాను.

నీ ప్రియమైన మరదలు,
రుక్మిణి."

ఉత్తరం చదివి బల్లమీద పడేశాను. మళ్లీ గతంలోకి వచ్చాను. ఏమీ తోచక ఉత్తరం మళ్ళీ చదివాను. మళ్లీ బల్లమీద పడేశాను.

అంబివచ్చి, "నాన్నా పక్కింటి మావ బిల్లలు పెట్టాడు! అన్నీ నేనే తినేశా! లచ్చికి పెట్టలేదు" అని మొదలుపెట్టినవాలకం చూసికాబోలు, "నిన్న అమ్మనెక్కడికో తీసుకెళ్ళావు. ఎప్పుడొస్తుంది నాన్నా?" అని అమాయకంగా అడిగాడు.

"ఎందుకు మీరంతా ఏడుస్తున్నారు? నాక్కూడా ఏడుపొస్తోంది. బిస్కత్తు తిను. నే నొకటి తింటాను. తింటే ఏడుపురాదు. లచ్చి ఏడ్చినప్పుడు అమ్మబిస్కత్తే పెడ్తుంది.నువ్వూ నేనూ తిందామా?" వాడి మాటలకి నాకు దుఃఖం పొర్లుకొచ్చింది.

కిశోర్ భార్య సుశీలతో వచ్చిన ఇద్దరు ముగ్గు రాడవాళ్ళు వాళ్ళిద్దర్నీ మరిపించి అవతలకి తీసుకు పోయారు.

*　　　*　　　*

రుక్మిణి ఆ రాత్రే బయలుదేరి వచ్చేసింది. నేను స్టేషనుకి వెళ్లలేదు. కిశోరే వెళ్లి రుక్మిణిని తీసు కొచ్చాడు. నన్ను చూడగానే రుక్మిణి బావురు మన్నది. పిల్లలిద్దరూ ఒక్కపెట్టున్న "పిన్నీ !" అంటూ కావలించుకున్నారు.

"కమల తనవెంటే న న్ను కూ డా తీసుకెడితే బావుండేది రుక్మిణీ !" అన్నాను నేను.

"ఛా! నువ్వే ఇట్లా ఏడిస్తే ఎలా బావా!" "రుక్మిణి గద్గదమైన స్వరంతో అన్నదేకాని ఏడుపు నాపుకోలేకపోయింది. రుక్మిణిగనక లేకపోతే పిల్లల నేవిధంగా సమాధానపరచాలో నాకు తెలిసిఉండేది కాదు. తన సెలవు పొడిగించుకుని నెల రోజుల దాకా అక్కడే ఉండిపోయింది. ఎ ప్పు డు తిరిగి వెడతావని నే నడగలేదు.

ఒకరోజు మధ్యాహ్నం నిద్రపోయి కళ్ళు తెరిచి చూసేప్పటికి రుక్మిణి నా కాళ్ళదగ్గిరగా కూర్చుని ఉంది. ఇద్దరం ఏమీ మాట్లాడలేదు. కొంతసే పయినతర్వాత రుక్మిణి "పిల్లల సంగతేమిటి బావా" అని అడిగింది.

"ఏమో !" అన్నాను శూన్యంగా.

"అదికాదు బావా! వాళ్లని చూసేవా రెవరు? నీకు 'నా' అనేవా రెవరూ లేరుకదా నేను తప్ప ..' అర్ధోక్తిలోనే ఆగిపోయింది.

నాకు రుక్మిణి ధోరణి అర్థంకాలేదు. "అయితే నన్నేం చేయమంటావు ?"

"ఇప్పుడు బావగా పిలుస్తున్నాను. అసలు బావగా చూసుకోనిమ్మంటాను" తల వంచుకుని జవాబిచ్చింది. నేనేమీ అనలేక చివాలున లేచి కూర్చున్నాను.

"అవును బావా !" నా కాళ్ళు పట్టుకుని తల నింకా దించేసింది. రుక్మిణి చేతులు తీసివేసి నేనే అడిగాను, "రుక్మిణీ ! ఏమంటున్నావో తెలుసా!" అని.

"తెలిసే అంటున్నాను" అన్నది నెమ్మదిగా.

నేను లేచి కిటికీవైపుకు వెళ్లి బ య టి కి చూస్తూ నుంచున్నాను. నా ఆలోచనలు సుడి గుండంలో తిరుగుతున్నట్లు తిరుగుతున్నాయి. ఆవేశంతో కిటికీ ఊచల్ని పట్టుకున్నాను. ఇంతలో ఒక చిన్నపిల్లల గుం పు కేరింతలతో అరుస్తూ, ఆడుకుంటూ వీధిలోనుంచి వెళ్లారు. సందు తిరిగి మాయమైపోయేవరకూ వా రి వై పే చూస్తూ ఉండిపోయాను. ఆతర్వాత బరువుగా వె న క్కి తిరుగుతూ ఉండగా, మా ఎదురింటి అరుగుమీద దిగాలుగా నుంచునిఉన్న అంబి కన్పించాడు. ఎదుట నున్న బొమ్మలు వ దిలి ఆ పిల్లలు వెళ్లినవైపే చూస్తూ కూర్చునిఉంది లక్ష్మి. నాలో ఏదో కదిలింది. వెనక్కి తిరిగాను. రుక్మిణి మంచం చివర కూర్చుని నేలవైపు చూస్తోంది.

"నువ్వు చె ప్పి న ట్లే చేద్దాం, రుక్మిణీ" అన్నాను.

ఆ పైసంవత్సరం మా కిద్దరికీ పెళ్లయింది. నే వద్దన్నా వినకుండా రుక్మిణి తన పనికి రాజీ నామా యిచ్చింది. కనీసం గుంటూరులో ప్రాక్టీ సైనా మొదలుపెట్టమని కిశోర్ చెప్పాడు. నేనేమీ మాట్లాడలేదు.

వివాహం జరిగిన రాత్రి డాబాపైన కలుసు కున్నాం. ఏమి మాట్లాడాలో తెలీక ఒక అరగంట సేపువరకూ ఇద్దరం మవునంగా ఉండిపోయాము.

"అంబీ, లచ్చీ పడుకున్నారా ?" అని నేనే అడిగాను చివరకు.

"ఇప్పుడే పడుకోపెట్టి వచ్చా."

"నువ్వుకూడా వెళ్లి పడుకో."

"అవును వా ళ్ల ద గ్గి రే పక్క వేసుకున్నాను. ఇది చెబ్దామనే వచ్చాను."

ఎవరి గదులలోకి వాళ్ళు వెళ్లిపోయాము.

రోజులు గడిచిపోతూనే ఉన్నాయి. నా ఉద్యో గంలో నేను మునిగిపోయాను. రుక్మిణి ప్రాక్టీస్ పెట్టిందన్నమాటేగాని ఎప్పుడూ అం బీ, లక్ష్మి వారిద్దరిలోనే నిమగ్నురాలై పోయింది. వాళ్ళు కూడా ఎప్పుడు తమ పిన్నిని అంటిపెట్టుకుని ఉండేవారు. . . . .

ఒకనాడు లక్ష్మి నాదగ్గరకు వచ్చి "నాన్నా సుచిలత్తయ్యకు పాప పుత్తిందిట !" అని చెప్పింది వచ్చిరాని మాటలతో. నా కీ సం గ తి తెలిసినా "అలాగే ! నువ్వెళ్లి చూశావా ?" అని అడిగాను ఎత్తుకుని.

అప్పుడే రుక్మిణీ, అంబి లోపలికి వచ్చారు.

"ఓ ! చూచా ! అన్నయ్యా, పిన్నీ తూడా వత్తేరు" లచ్చి సంతోషంగా చెప్పింది.

"కిశోర్ సాయంత్రం ఇక్కడకి వస్తానన్నాడు" రుక్మిణి నాతో అన్నది.

"నాన్నా మనకికూడా పా పా యి తే బలే బావుంతుంది కలూ ! ఏం నాన్నా !" అని లక్ష్మి ఉత్సాహంగా అడిగింది.

ఈ ప్రశ్నకు నేనూ, రుక్మిణీ ఇద్దరం ఉలిక్కి పడ్డాము. రు క్మి ణి ఏదో మాటచెప్పి వాళ్లిదర్నీ లోపలికి తీసుకెళ్లిపోయింది. లక్ష్మి ప్రశ్న నన్నెంతో కలవరపెట్టింది. ఆ తర్వాత రుక్మిణి మొహం చూడలేక బయటికి వెళ్లిపోయాను.

సాయంత్రం కిశోర్ వచ్చాడు. "ఆస్పత్రికి పోయి మీ అమ్మాయిని చూద్దాం పద !" అన్నాను. బయలుదేరుతూ ఉండగా లక్ష్మి లోపల్నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి, "నేనూ వత్తా నాన్నా!" అన్నది.

"అబ్బ ! చూశావుగదూటే ! రేప్పొద్దున పిన్నితో వెడుదువుగాని" అని నేనన్నాను.

"అయితే నాకొక పాపని తెచ్చిపెట్టు !" అన్నది లక్ష్మి ఏడుపుమొహం పెట్టి.

"సరే, సరే ! ఇప్పుడు ఏడుపు మొదలుపెట్టక, పుణ్యం ఉంటుంది" నా కంగారుని కప్పిపుచ్చ డానికి ప్రయత్నిస్తూ లక్ష్మిని ఎత్తుకున్నాను. కిశోర్ నావైపదోకవిధంగా చూశాడు. కాని ఏమీ అనలేదు.

ఆస్పత్రినుండి తిరిగి వచ్చేప్పుడు అక్కడే ఉన్న రుక్మిణి దగ్గర వదిలి నేనూ, కిశోర్ వచ్చే శాము.

"ఏరా ! ఇందా కలా కంగారుపడ్డావేమిటి ? అడగొచ్చా ?" కిశోర్ పరిహాసంగా అడిగాడు. నేను మౌనంగా ఉండటం చూసి యింకా పరిహాసంగా మాట్లాడటం మొదలుపెట్టాడు. నేనిది భరించ లేక "నోర్ముయ్ !" అని అరిచాను. కిశోర్ హడిలి పోయి "క్షమించు ! కాని, దానికింతకోపం దేనికీ ?" అని అడిగాడు.

ఉపాధ్యాయుడు- రాముా, హుండీ అంటే ఏమిటిరా ?

రాము-మా బామ్మ వత్తుల డబ్బా సార్.

ఎనమండ్ర సూర్యనారాయణరావు
(గంగవరం)

"నువ్వే నన్ను క్షమించాలి కిశోర్ !" బాధగా అన్నాను.

"ఒరేయ్ ! క్షమాపణల కేమిటిగాని, అనవ సరంగా ఇంత ఆవేశం ఎందుకు ? నీ ధోరణే నా కర్థం కావడంలేదు. నీ మనస్సు బాగా లేక పోతే క్లబ్బు కెళదాం. లేదా పార్కులో కూర్చుందాం!"

పార్కుకే వెళ్లాము. కొంచెం సందేహించిన తర్వాత కిశోర్‌తో ఉన్న సంగతి చెప్పాను.

"మీరింత పిచ్చివాళ్లనుకోలేదురా !" అన్నాడు కిశోర్ అంతా విన్న తరువాత.

"అలా అనకురా, కిశోర్ ! రుక్మిణి నన్నెందుకు చేసుకుందో నీకు తెలీదు. కేవలం పిల్లలకోసమే. ఆమె కొకవిధంగా అన్యాయం జరిగిందని నేను గ్రహించ గలుగుతున్నాను. కాని . . . "

కిశోర్ నా మా ట ల కడ్డువచ్చాడు. "నువ్వు గ్రహించగలిగితే అదే చాలు. నాకు తోచింది నేను చెబుతున్నానబ్బాయ్. మించిపోయిందేమీ లేదు. అంతా మీ చేతుల్లోనే ఉంది. ఇక మీ యిష్టం. ఇంటికిలే, పోదాం పద !" అని లేచి నుంచున్నాడు.

*　　　*　　　*

వేసవికాలమవడంచేత మ ం చ ం డాబాపైన వేసుకున్నాను. రుక్మిణీ, పిల్లలూ లోపల పడు కుంటున్నారు. భోజనం ముగించి వెన్నెలలో కొబ్బరిచెట్లవెనక చం ద్రు ణ్ణి చూస్తూ నుంచు న్నాను. గాజులశబ్దం విని తిరిగాను. రు క్మి ణి మంచినీళ్లచెంబు పెట్టి వెళ్లిపోబోతోంది.

"రుక్మిణీ !" అన్నాను. ఏమి టన్నట్లు ఆగింది. మళ్లీ "రుక్మిణీ !" అని మొదలుపెట్టానే కాని ఆయోమయంగా ఆగిపోయాను.

"ఏ మై నా చెప్పదలుచుకున్నావా బావా ?" రుక్మిణి మెల్లిగా అడిగింది.

"రుక్మిణీ నీకు ద్రోహం చేశాను. మరెవర్న యినా పెళ్లిచేసుకొని ఉంటే నీ కీ వింతదాంపత్యం ..... ఉండేదికాదు. నిన్నెలా .... క్షమాపణ కోరు కోవాలో తెలీటంలేదు." తడబడుతూ వచ్చాయి మాటలు. రు క్మి ణి సమాధానమేమీ ఇవ్వకుండా చెంపకి చేతినాన్చి ఆకాశంలోకి చూస్తూ నోరు కుంది. కొంతసేపయినతర్వాత, "బావా ! నాకు లచ్చి, అంబీ అంటే ప్రాణం. వారి తల్లిలేని లోటును తీర్చాలనే నా కోరిక. కాని నిన్ను పెళ్లి చేసుకున్నది అం దు కు మా త్ర మే కాదు.... " అన్నది చివరకి, నావైపు చూడకుండానే.

"రుక్మిణీ !" అని ఆమెవద్దకు వె ళ్లా ను కాని ఇంకేమీ అనలేకపోయాను.

వెన్నెలలో ఆకులు గాలికి గలగలమన్నాయి..... ★

# సినిమా

## చల్లబడే గులాం

బాధాసర్పదష్టమైన జీవితంలో నిద్ర, సంగీతం జీవాతువులకు రెండు వరాలని తాత్వికుల నిర్దేశం హాయిగా నిద్ర పోవడం, తీయగా పాడుకోగలగడం పురాకృత పుణ్యమని వేవరాలకయినా తూగదని సామాన్యుల ఉద్దేశ్యం

అయితే శ్రేయమైన ఆవరాలను తనతోటివారికి పంచియిచ్చే త్యాగధనులు చాలా అరుదు తన గాన మహిమతో, మధుర సుధా లోకం సృష్టించి హాయిలో శ్రోతలను ఓలలాడించి లాలపోసి, జోల పాడి నిద్ర పుచ్చగలిగిన శ్రోతృకర్ణామృతం ఖాన్ సాహెబ్ బడే గులామ్ ఆలీఖాన్

ఈ మనసు చల్లబడే గులామ్ ఆలీగాన్ కచేరి ఇటీవల త్యాగరాయనగరంలో మార్చి 5 వ తేదీ సాయంకాలం జరిగింది పురప్రముఖులు, రచయితలు, సినీ సంగీత దర్శకులు, గాయకులు అనేకులు ఈ కచేరీకి హాజరైనారు

''ఆలీఖాన్ సంగీతానికి భాష్యం చెబుతాడు. శాస్త్రం సుగమంచేసి, విడమరచి టీక చెప్పుకుపోతాడు సంగీతాకారుడు, గీతాకారుడైన భగవంతుడు గీతకువలెనే సంగీతానికి అనేకులు భాష్యం చెప్పారు ఖాన్ సాహెబ్ చెప్పింది అందరికీ అర్థమవుతుంది'' అన్నారు సంగీత దర్శక పితామహా అనదగిన శ్రీ గాలి పెంచల నరసింహారావు

## ఆరుద్ర ముద్ర

భావావేశ పరవశుడయిన ఆరుద్ర అందమైన కవి. అలనాడు 'త్వమేవాహం'లో 'నీవు ఎక్కడలమకొన్న

(59 వ పేజీ చూడండి)



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'భార్యాభర్తలు'లో ఒక మధురసన్నివేశం.



ఎం. జి. యం. చిత్రం 'బెన్‌హర్' లో నాయికా నాయనులు

# ఎం. జి. ఎ. చిత్రలాంఛనం

చలనచిత్ర ధరిత్రిలో ఎం జి ఎం ఒక విశిష్ట స్థానం ఆక్రమించుకున్న సంస్థ వారి ప్రతిష్ఠను ఇనుమడింపజేసే చిత్రరాజం బెన్‌హర్ ప్రపంచమంతా ప్రశంసలందుకున్న మేటి చిత్రం మార్చి 6 వ తేదీని ఓడియన్‌లో పత్రికా రచయితలకు ఈ చిత్రం ప్రదర్శించారు.

క్రైస్తవుల జీవనగీత బైబిల్‌లో 'ఓల్డ్ టెస్టమెంట్'కు చెందినది బెన్‌హర్ కథ అందుకు నవలా రూపం ఇచ్చినది అమెరికన్ రచయిత జనరల్ లూయీ వాలెస్ మూలకథకు, మామూలు కథకు కొన్ని చిన్న మార్పులు చేసి మెట్రోగోల్డ్విన్ మేయర్‌వారు ఈ పురాణకథను తెరకు అనువదించారు ఇది పంధొమ్మిది వేల అడుగుల నిడివిగల చిత్రం ఎడారిఓడలా సాగుతుంది కథ సాంద్రంగాలేని కారణంచేత కథనం మరీ పొడుగు కావడంచేత సన్నివేశాలు బరువుగా ఉన్నాయి మందగమనం కనిపిస్తుంది.

కథ టూకీగా యిది.

జూడా బెన్‌హర్ (చార్ల్‌టన్ హెస్టన్) అందం, వయస్సుకల యువకుడు పుట్టుకచేత అతను యూదు జాతీయుడు ఆ యూదుజాతీయత అతని కథకు కొంత మాతృక అయింది క్రైస్తవులకే ప్రత్యేకమనుకునే కొన్ని ఉదార గుణాలు బెన్‌హర్‌కు కూడా ఉన్నాయి అతను జెరూసలెమ్ నివాసి

ఒకరోజు అతని ప్రాణస్నేహితుడు మెసాలా రోమన్ కన్సల్‌గా నియుక్తుడౌతాడు. బెన్‌హర్ అమితానందం పొందుతాడు వారి స్నేహం మరింత దృఢతరం అవుతుంది కాని ఒకసారి మెసాలా యూదు తిరుగుబాటుదారులను అణగద్రొక్కడానికి వారి గుట్టుమట్లు తనకు చెప్పవలసిందిగా బెన్‌హర్‌ను కోరుతాడు కాని బెన్‌హర్ నిరాకరిస్తాడు మెసాలా ప్రభుభక్తి పరాయణత్వంకోసం ఈపని తాను చేయలేనంటాడు బెన్‌హర్ వారి స్నేహమనే పాలకు ఈ భేదాభిప్రాయం విషబిందువై, సౌమనస్యం వైమనస్యంగా వికటిస్తుంది. ద్వేషం పెల్లురేగి మెసాలా కళ్లకు బెన్‌హర్ విరోధిగా కనుపిస్తాడు. అధికార గర్వం తింద్రించి పాషండుడై బెన్‌హర్‌ను బంధించి అతని కుటుంబంతోసహా హింసలకు గురిచేస్తాడు

కసితీరక బెన్‌హర్‌ను బానిసలతోపాటు 'గాలీస్'కు పంపుతాడు అది ఓడలు నడిచేందుకు రెక్కలు విరుచుకుని తెడ్లు వేసే కఠిన శిక్ష ఇక కుటుంబాన్ని చీకటి గుహలలోకి ప్రవాసం పంపుతాడు. ఓడలలో పీడలపాలు కాబోతూ ఎడారిదారులలో బానిసలందరితోపాటు బెన్‌హర్‌నూ బంధించి నడిపిస్తుంది మెసాలా దురహంకారం ఒకచోట బెన్‌హర్ శోషతో సొమ్మసిల్లిపడిపోతాడు అప్పుడు జీసస్ అనే మహోదయుడు తన దివ్యహస్తంతో బెన్‌హర్‌కు మంచినీళ్లు అందించి అతన్ని బ్రతికిస్తాడు జీసస్ దివ్యతేజస్సు చూసి రాజభటులు అతన్ని వారించలేరు బెన్‌హర్ హృదయాంతరాళంలో దయాంత రంగుడైన జీసస్ ముద్ర శాశ్వతంగా పడిపోతుంది

ఇలా మూడు సంవత్సరాలు గడుస్తుంది అప్పటికి బెన్‌హర్ క్రూరహింసలకు గురిఅవుతూ, చావలేక బ్రతుకుతూ, బ్రతకలేక చస్తూ, ఒక యుద్ధ నౌకలో బానిస సరంగుగా ఉంటాడు అప్పుడొక యుద్ధ సందర్భంలో బెన్‌హర్ పడవ మునిగిపోతుంది ఎలాగో తప్పించుకున్న బెన్‌హర్ తనతోపాటు తనను అష్టకష్టాలు పెడుతున్న రోమన్ కమాండర్ (జాక్ హాకిన్స్)ను కూడా రక్షించి, ఒక

నేడే చూడండి

ఉదయా
స్టూడియో వారి

# సీత
(లవ-కుశ)



డైరెక్షన్
యం. కుంచాకో

మాటలు, పాటలు
అనిసెట్టి

సంగీతం
ఎమ్. రంగారావు

నిర్వహణ
కె. జె. మోహన్

వాహినీ విడుదల

BAKTHA

తీవ్ర ఆధారంగా ఒడ్డుకు చేరుస్తాడు. దీనితో బెన్‌హర్ జీవితంలో నూతనదశ ప్రారంభమవుతుంది. పొంచి వున్న మంచికాలం వస్తుంది. రోమ్‌కు అతను రప్పించబడతాడు. రోమన్ కమాండర్ మంచితనంవల్ల స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది. బెన్‌హర్ వంచిన తలయెత్తి నిలబడతాడు. అతను తిరిగి జెరూసలెమ్ వస్తాడు. తన కుటుంబం అంటే తల్లి చెల్లెలు ఎక్కడ వున్నారో, ఏమైనారో అనే ఆవేదనతో అతను వస్తాడు. తన బ్రతుకు చితుకుల మంటచేసి, గతుకుల బాటగా పాడు చేసిన మెసాలాపై పగ తీర్చుకోవాలనే పట్టుదల అతనికి కలుగుతుంది. అక్కడ తన ప్రేయసి ఎస్తర్ (హేయాహారారత్) ను, తన ఇంటిని ఇన్నాళ్లు కనిపెట్టిన తన తండ్రి గుమాస్తాను కలుసుకుంటాడు. ప్రేయసి వల్ల తన తల్లి చెల్లెలు చెరలో చచ్చిపోయారని తెలుసుకుంటాడు. కాని నిజానికి వారు చీకటిగుహలో కుష్ఠువ్యాధి సోకి దురదృష్టంకొద్దీ కుష్ఠువ్యాధిగ్రస్తులు తలదాచుకునే లెపర్స్ వాలీ అనే లోయకు పారిపోతారు.

బెన్‌హర్‌లో ప్రతీకారవాంఛ మిన్నుముట్టిపోతుంది. మెసాలాను చారియట్‌రేస్‌లో ఓడించి పగ తీర్చుకోవాలని వస్తాడు. మెసాలా కూడా అదే పగతో వస్తాడు. తన రథానికి కత్తి యిరుసులు తొడిగి పక్కనే ఉన్న బెన్‌హర్ రథ చక్రాలు కోసుకుపోవాలని ఒక పన్నాగం పన్నుతాడు. మెసాలాకు నల్ల గుర్రాలు, బెన్‌హర్‌కు తెల్ల గుర్రాలు పూన్చిన రథాలు ఆయత్తమవుతాయి.

పగలు పొగరేగిన ఆ దశలో—బెన్‌హర్, మెసాలా రథాలు వాయువేగ మనోవేగాలతో కుప్పించి దూకి పరుగులెత్తాయి. బెన్‌హర్‌ను వంచించబోయిన మెసాలా రథం తల్లక్రిందులై పోతుంది. మెసాలా పడిపోతాడు అతని మీద ఎం తో హరిఖురఘట్టన జరిగి క్షతగాత్రుడవుతాడు మెసాలా. చివరి ఘడియలలో అతనిలో పరివర్తన కలిగి మానవత్వం పునరంకురిస్తుంది. ఆ తుదిక్షణంలో చూడవచ్చిన బెన్‌హర్‌తో అతని తల్లి, చెల్లెలు సజీవులై ఉన్నారని చెబుతాడు మెసాలా.

తిరిగి మరో విధమైన ప్రతీకారచింత రేగి బెన్‌హర్ రోమన్ పౌరసత్వం విసర్జించాలనుకుంటాడు. కాని ప్రేయసి ఎస్తర్ అది కూడదని వ్యాధి బాధితులయిన తల్లిని, చెల్లెలిని జీసస్ అమరసందేశం వినడానికి తీసుకుపోతే ఆ దుర్గతి తప్పుతుందని హితవు చెబుతుంది.

అలాగేవారు బయలుదేరి వెడతారు. అప్పటికి అపరభగవానుడయిన జీసస్ అవతార సమాప్తి ఆసన్నమవుతుంది. తన బలిపీఠమయిన సిలువను తానే మోసుకుంటూ అవిశ్వాసప్రపంచంలో చరమదశ చవి చూస్తూ వధ్య స్థలానికి వెడుతూవుంటాడు. ఇది చూసిన బెన్‌హర్ ఈ మహనీయుడే అలనాడు తనకు జీవనమిచ్చిన ప్రాణదాత అని గ్రహిస్తాడు. కరుణ, భక్తి, ప్రేమ ఈ మూడు రసాలు ముప్పిరిగొని బెన్‌హర్ పరుగునవెళ్లి జీసస్‌కు మంచి నీళ్లు అందిస్తాడు. కాని మానవుల అమానవం నోటిముందు నీటిని తన్నివేస్తుంది.

జీసస్ సిలువకు నిలువునా బలిఅయిపోతాడు.

లోకంలో పెంజీకటి పెల్లుబేగి ప్రచండంగా ప్రకృతి విజృంభించి పెద్ద ఉరుములతో, మెరుపులతో గాలివాన వస్తుంది. బెన్‌హర్ తల్లి, చెల్లెలు వ్యాధి విముక్తులయిపోతారు.

ఈ దివ్యానుభూతితో బెన్‌హర్ హింసను విసర్జించి, ఆస్తికుడై పోతాడు. ఇదీ కథ.

దీనిని దృశ్య కావ్యంగా, దర్శనీయమూ, శ్రావ్యమూ అయిన ఛాయా పంచికగా చిత్రించారు దర్శకుడు విలియమ్ వైలర్. సంభాషణలు ఈ చిత్రానికి పెట్టని ఆభరణాలు కాగా. బెన్‌హర్‌గా చార్ల్‌టన్ హెస్టన్, మెసాలాగా...చేసిన నటన చాలా ఉదాత్తంగా ఉంది. 19,000 అడుగుల నిడివి కావడం వల్ల కథనం మందంగా సాగిందనడం నిర్వివాదం. కాగా చిత్రంలో ప్రభావసంగీతం(B ck-gr$_{0}$und Music) చాలా ఉచితంగా బాగా ఉంది.

అన్ని సన్నివేశాలలోకి అద్భుతమైనది చారియట్ రేస్. అనదృశంగా దీనిని చిత్రించారు వాస్తవికత తొలుకాడేటట్లు ఈ ఘట్టమూ, జీసస్‌ను సిలువకు బలిచేసే ఘట్టమూ, బెన్‌హర్ బానిస బ్రతుకూ చిత్రించారు.

అయితే జనరల్ లూయీవాలెస్ నవలలో మనకు కనుపించే బాల్తసార్, బెన్‌హర్, మెసాలాలకు మధ్య కొంత నటించిన ఈజిప్టు మనకు ఈ చిత్రంలో లేరు.

నిడివి ఎక్కువయిందనే మాట అలా ఉంచితే, నటన, దర్శకత్వం, కథనం, చిత్రీకరణ ఈ చిత్రంలో ఉన్నంత ఉత్తమంగా ఇటీవల ఏ చిత్రంలోనూ లేవు

బెన్‌హర్ అన్ని విధాలా ఉత్తమ చిత్రం. ఇటువంటి ఉత్తమ చిత్రం మెట్రోగోల్డ్విన్ మేయర్ వారికి తిరుగులేని యోగ్యతా పత్రం. ★

# సరిగమలు

(56 వ పేజీ తరువాయి)

రైలు ఎప్పుడూ ఒక జీవిత కాలం లేటు' అని నరమానవ జీవితంలో లోటును ఘాటుగానే అయినా సూటిగా చెప్పాడు. ఆనాటినుండీ ఆరుద్రను కవిగా మన్నించింది జనత.

చిత్రలోకంలో కాలుపెట్టిన తరువాత ఆరుద్ర కొత్త రీతిలో గుబాళించాడు. సరికొత్త దస్తూరి గుత్త గొన్నాడు. అందరూ చెప్పేదాన్ని అందరికీ రానివిధంగా అందంగా చెప్పడం మొదలుపెట్టాడు. పద సంపదలో భావ వ్యక్తుల చిత్తరువులు నిలిపాడు. తెలుగు నుడిలో జిలుగును వెదజల్లాడు.

"ప్రేమ లేఖలు" చిత్రంలో ఆరుద్ర తన ముద్రను తొలిసారిగా వేశారు. "ఎడబాటంటే ఎదలో ముల్లు' వంటి మాటలు 'అతనే అనగలడు' అనిపించుకున్నారు. "పడుచుదనం రైలుబండి పోతున్నది' వంటి పాటలు అతని దస్తూరిలో కస్తూరి కలిపాయి.

అయితే 'అంత్యప్రాస అతని పాటకు శ్వాస' అంటారు కొందరు. సజీవంగా ఉండే పాటలే అతను సృష్టించాలనుకొనడం అందుకు కారణం కావచ్చు.

## నిశ్చింతామణి

'రేలంగి' లాగానే అతని ఊహలూ, ఉద్దేశ్యాలూ కలిసి మెలిసి ఆడుకుంటూ, పాడుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తాయి.

"నాకు కరుణరసం తొణికిసలాడే వృద్ధపాత్రలు ధరించాలని ఉంది'

'ఏమిటిసార్—వెధవది చిన్నప్పట్నాగా నే(మే)ను నాకు చెప్పిన మాట వింటంలేదుగానీ, లేపోతే మాంచి పయిలా పచ్చీస్ వేషాలు వెయ్యాలని ఉంది'

'నాతో యిప్పుడు హీరోయిన్‌లుగా నటిస్తున్న వాళ్ళ తాతయ్యగా నటించాలని ఉంది...ఒట్టు'

..... "

'బాగా సన్నపడాలని మా చెడ్డ కోరిగ్గా ఉంది' .తిరిగ్గా ఆ విషయమే ఆలోచిస్తున్నాను.'

. ........

'లావుగావుంటే మహాలావు హాస్యం పుడుతుంది. మనం శ్రమపడి దాన్ని పోషించక్కర్లేదు.

ఇట్లా ఉన్నమాట అంటం, అన్నమాటని కిందిమాటతో కొట్టెయ్యడం ఇది రేలంగి సరదా. అదే అతనిలో హాస్యం. చింతలేనిరేలంగి నిశ్చింతామణి.

## గాలి పెంచల

పిల్లగాలిని పిలిచి చల్లదనం మేళవించి ఉల్లమునే కళ్లంలో అనుభూతిని తూర్పారబట్టి హాయిని తేర్చి పాత్రలలో కూర్చి స్వర రాగసుధా సంక్రాంతికి సంగీతసస్యంగా సంసారులకు అందించే స్వర కృషీవలుడు 'గాలిపెంచలవా'డనిపించుకుంటాడు.

ఆ గాలి పెంచలనే సన్నిహితులు పెంచలయ్య అని, స్నేహితులు నరసింహారావు అనీ పిలవడం కద్దు.

తెలుగు తెరకు కమ్మని సంగీతం సంతరించిన వారిలో పెంచలయ్య అగ్రగణ్యులు. అలనాటి సీతారామ జననం రోజులనుండి నేటి సీతారామ కళ్యాణం వరకు పెంచలయ్య పంచిపెట్టిన పంచామృతం జనం మరువలేదు తొలిసారిగా బాలరాజులో గమకంతో తార స్థాయిలో రాగమాలికను వినరిన ఘనత ఆయనదే. దేవత మున్నగు చిత్రాలలో 'సంగీత సహాయకుడు' అనే పేరుకు వెనకాల మరుగైనా, మెరుగైన సంగీతం, తెలుగు సంగీతంవినుపించినవారుపెంచలయ్యే! 'జాగేలా వెరపేలా' 'రైతుజనముల', ఎవరినే, నేనేవరినే (లిలక్ కామోద్—బాలరాజు) బాలరాజా, తీయని వెన్నెల రేయి, రాగమయీ, ఇతర జావళీలు (సీతారామ కళ్యాణం) గాలిపెంచల నరసింహారావు కట్టిన బాణీలే.

పండితుడు-అయిన శ్రీ గాలి పెంచలను చిరకాలం తర్వాత మళ్లీ నేషనల్ ఆర్ట్ థియేటర్ సంస్థ ఆదరించి 'సీతారామ కళ్యాణం' సంగీత దర్శకత్వం కట్టబెట్టింది ఇప్పుడాయన వారు తీస్తున్న 'గులేబకావళి'కి కూడా సంగీతం సమర్పిస్తున్నారు. ★

# హరి వంశము

## సాందీపనిపర్వం—7

నందిముఖం పూర్తి కాగానే తిరిగి వటువులచేత మంగళస్నానములు చేయించినారు. తిరిగి కాళ్ళకు పసుపు పారాణులు దిద్దినారు. తిరిగి ముఖమున పడకపెండ్లి కొడుకుల బొట్టు పెట్టినారు. తిరిగి "ఉష్ణేనవాయువ" ఇతి కేశ విధాన పర్యంతం చౌవలత్ కర్తకాండను నడిపించినారు. కుమారులకు ఆయుష్యాభివృద్ధికొరకు శీతవాతోష్ణాద్యుశమన ద్వారా దేహాలంకరణార్థం వస్త్రధారణం చేయించినారు. రేవతస్వేతి మంత్రములచేత వస్త్రములు అభిమంత్రించి కుమారులకటితటములచుట్టును మూడు వరుసలు తిరుగునట్లు కట్టించినారు. ముహూర్తమునకు సమయం ఆసన్నం అవుతున్నది. గర్గుడు ముందుగానే గుడమును, జీలకర్రను తెప్పించి పిష్టముగా నొనర్చి దగ్గర ఉంచుకొన్నాడు. అతని ఆ తొందరను చూడగా వ్యాసునకు నవ్వు వచ్చినది. ఆయన అన్నాడు:

"గర్గ! ప్రభువునకు ఉపనయనమనగా, కాలమువించిపోవుట ఎక్కడ! కాలము ముహూర్తమునకు కట్టుబడి యుండదా?"

"అవును! భగవాన్! అవును" అన్నాడు గర్గుడు.

అని "కుమారస్య ఆముష్యాభివృద్ధి ద్వారా సోమేంద్రమరుత్ ప్రసాద సిద్ధ్యర్థం మేఖలా ధారణం" అంటూ ఆవలి తంత్రమునకు ఉపక్రమించినాడు. దర్భలతో మేఖలలు అల్లినారు. మూడు పేటలుగా దర్భలను పొదిగి, జడకువలె అది అల్లబడినది. కుమారులకటితటులయందు త్రిప్రదక్షిణంగా గర్గుడు "ఇయందు రుక్తా"దితి మంత్రమును పఠిస్తూ, కుమారులచేత పఠింపచేస్తూ మేఖలను ధరింపజేసినాడు. నాభిదేశమువద్ద గ్రంథిని ఏర్పాటుచేసినాడు. ఆ తర్వాత మరల కుమారులచేత "ఇయందురుక్తా" మేతి మంత్రమును పఠింప చేసినాడు.

తరువాత కృష్ణాజినధారణం కుమారులకు ఆయుష్యాభివృద్ధి కొరకు, త్రిగుణీకృత అగ్నిష్టోమ అతిరాత్రాప్తోర్యామ సాంతపనవాజపేయ పౌండరీక అశ్వమేధాది శతక్రతు సంపూర్ణ సకల ఫలావాప్త్యర్థం, కృష్ణాజినధారణం చేయిస్తారు. ఉత్తర లోమకంగా ఉత్తరీయార్థముగా క్షత్రియులకు రురుమృగాజిన ధారణం శాస్త్రం విధిస్తున్నది. కుమారులచేత అప్పుడు "మిత్రస్యేతి" మంత్రములు పఠింపజేస్తారు. భగవంతునిచేత వ్యాసుడే ఆ మంత్రాన్ని అప్పుడు పఠింప చేసినాడు. "మిత్ర స్యచక్షుం ధరుణంబలీయః తేజోయశస్వి! స్థవిరం సమిద్ధం అనాహనస్యం వసనం జరిష్ణు పరేదంవాజి, అజినం ధదేహావ్" భగవంతుడు ఈ మంత్రమును ఉచ్చరించగా అంతలో ముహూర్తము సన్నికృష్టమైనది. గర్గుడు వటువుల తల్లిదండ్రుల చేతులలో గుడజీరపిష్టమును ఉంచినాడు. ముహూర్తమనగా ఈ గుడజీర పిష్టమును కుమారుల మాడుపట్టున ఉంచుట. అప్పుడువసుదేవుడు పొందినఆనందమేఆనందము. తానుఅప్పుడు స్వయముగా "ధ్రువన్తే రాజావరుణో ధ్రువన్దేవో బృహస్పతి:" మంత్రమునుసలక్షణంగా పఠిస్తూ, గుడజీరపిష్టాన్ని సభార్యుడై ముందు బలరాముని శిరస్సున, తరువాత శ్రీ కృష్ణదేవుని శిరస్సుపై వుంచినాడు. ఆ ముహూర్త కాలంలో సూర్యాది నవగ్రహాలు అనుకూల్య ఫలసిద్ధిని సూచిస్తూ, ఎచ్చట వుండవలెనో, అచ్చట ఉచ్చస్థితిలో నిల్చివున్నాయి.

ముహూర్తము ముగియగా భగవంతునిలో పెద్ద మార్పు వచ్చినది. ఇప్పుడు తాను చతుర్వింశత్యక్షర మంత్రోచ్చారణ ద్విజాశ్రమాధికారాన్ని పొందినవాడైనాడు. వేదమాతయైన గాయత్రి అప్పుడు ఆయనకు ప్రత్యక్షమైనట్లు వున్నది. తండ్రి తన్ను చేతులలోనికి తీసుకొనడము, అగ్ని ప్రదక్షిణము చేయించడము, సమీపమున అభిముఖముగా కూర్చుండబెట్టుకొనడము, బ్రహ్మోపదేశమును చేయుటము. ఆయన ఎరుగునో ఎరుగడో! బ్రహ్మోపదేశము

పూర్తికాగా భగవంతుడు ఉచ్చైర్వాక్యైః "బ్రహ్మ చర్యం ఆగామ్ ఉప మానయస్వ! దేవేన సవిత్రా ప్రసూత" అన్నాడు

వసుదేవుడును మంత్రముగ్ధుడై కుమారుణ్ణి సంబోధించి, దక్షిణ హస్తాన్ని గ్రహించి

"కోనామాసి" అని ప్రశ్నించినాడు.

శ్రీ కృష్ణుడు : శ్రీ కృష్ణ వర్మనామాస్మి.

వసు కస్య బ్రహ్మ చర్యాసి శ్రీ కృష్ణవర్మన్.

శ్రీ కృష్ణుడు : ప్రాణస్య బ్రహ్మ చర్యాస్మి.

వసు : శ్రీ కృష్ణ వర్మేషితే దేవ సూర్యబ్రహ్మచారీతద గ్గోపాయస మామృతత్తైషతే సూర్య పుత్రస్స దీర్ఘాయుస్సమామృతయాగ్ స్వస్తి మగ్నిర్వాయు సూర్యశ్చంద్రమాపోనో సంచరంతితాగ్ స్వస్తి మనుసంచర శ్రీ కృష్ణవర్మన్.

శ్రీ కృష్ణుడు : అధ్వనాం అధ్వపతే, శ్రేష్ఠస్య పారం అసేయ

భగవంతుడు దర్భాస్తరణముమీదనుంచి లేచినాడు. అగ్నికి ప్రదక్షిణము చేసినాడు. తిరిగి ఆచార్యునకు, అనగా తండ్రికి దక్షిణ పార్శ్వమున ఉపవిష్టుడైనాడు. వసుదేవుడు తిరిగి అగ్ని కర్మను ఆచరించినాడు. కుమారులచేత ఆహవనము చేయించినాడు. ఇంద్రునకు, అగ్నివరణ సోమాదితి విశ్వేభ్యో దేవతలకు, దేవతలకు, అగ్నీంద్రమరుదాదిత్యవసురాది దేవతలకు అంగీరసస్తుష్ట ఋషి ప్రాజాపత్యాగ్ని దేవతలకు, మేధా దేవతలకు, వరుణునకు, అగ్నీవరుణులకు, సమస్కార పూర్వకముగా ఆహుతులు వ్రేల్చబడినవి. హోమ ప్రతిష్ఠా సిద్ధికోసం, వృద్ధికాములు జయాది హోమం ఆచరించినారు.

జయాది హోమం పూర్తికాగానే, భగవంతుడు మరల పీటలమీదనుండి లేచినాడు. ఆయనతోపాటు తక్కిన వటువులు గూడ లేచినారు. భగవంతుడు ఆచార్యుడైన తండ్రికి ఎదురుగా దర్భాస్తరణముమీద ఆసీనుడుకాగా, తక్కుంగల వటువులు గూడ నటులనే ఆసీనులైనారు. అప్పుడు బాదరాయణుడు, సర్వవేదవిత్తు, సానందబాష్పనేత్రుడు, సానందగద్గదకంఠుడు, వసుదేవునితో ఇట్లా అనినాడు· "వసుదేవ! ఎవ్వడు సర్వ వేదమయుడో, వాడు నిన్ను ఇప్పుడు గాయత్రిని ప్రసాదించగా అర్థించబోతున్నాడు నీ ఆచార్యత్వము సార్థకమవుతున్నది"

భగవంతుడైన వ్యాసుడు ఈ మాటలు అన్నంతలో సదస్సు అంతయు సావధానమైనది. భగవంతుడు తన దక్షిణపాణిచేత ఆచార్యుడైన జనకునియొక్క, వసుదేవునియొక్క దక్షిణ పాదమును అవలంబించినాడు. సవ్యపాణిచేత సవ్య పాదమును అవలంబించినాడు. అప్పుడు ఆయన ముఖము సర్వవేదములు జ్యోతిర్మయములై వెల్లుతున్నట్లు వెల్గిపోయింది. వేదము తానే అయినవాడు, వేదమును మత్స్యమై ఉద్ధరించినవాడు, వేదోద్ధరణంకోసం సోమకుడనే దానవుణ్ణి సంహరించినవాడు, తన్ను కొనియాడుటకొరకే విన్పించిన వేదములు కలవాడు పరుడు, పరముకన్నను పరుడు శ్రీ కృష్ణదేవుడు ఈ అవతారములో తనకు తండ్రియైన వసుదేవునిముఖమును లక్షించి "భో!ఆచార్య! మమసావిత్రీం అనుబ్రూహి" అన్నాడు. ఆ అభ్యర్థనము వేదమాతను ఆవాహనము చేస్తున్నట్లు వున్నది. భగవంతుడు లోక సంరక్షణార్థము వేద సంరక్షణార్థము ఎన్ని జన్మలు తనకు తానై కలించుకొనలేదు. ఎన్ని జన్మలలో తాను అదితి, కశ్యపులకు బిడ్డయై జన్మించలేదు. భగవంతుడు ఆ అభ్యర్థనము చేయగా వసుదేవునకును, దేవకికి ఆత డక మండపము సిద్ధాశ్రమమేమో అనిపించినది. త్రివిక్రముడైన వటువు మరి గుజ్జయి తమ ముందు నడమాడుతున్నట్లు, మాయావటుడై అర్థిస్తున్నట్లు అవభాసించింది. దేవకి మనస్సులో అనుకొన్నది : నేను ఇతనికి ఎన్ని జన్మలుగా తల్లిని. అయినను ఈ అపేక్ష తుదిపట్టడములేదు. మరి దీనికి మొదలుగూడా లేదో!" వసుదేవుడు ఏమీ అనుకొనలేదు. తాను బహుజన్మాలుగా ఈ మాయామానవునికి గాయత్రిని ఉపదేశము చేసినాడు. అటులనే యిప్పుడును చేయుచున్నాడు. అప్పుడు తనకు వేదమాత యైన గాయత్రి ఎటుల దర్శన మిచ్చినదో ఇప్పుడును అటులనే దర్శన మిచ్చుచున్నది. ఆమె ఛాయ ముక్తావిద్రుమ హేమ నీలధవళంగా ఉన్నది. ఆమె ముఖచ్ఛాయయు నట్లే యున్నది. ఆమె ఆ ముఖము తీక్ష్ణముగా నున్నది. తలపై ఇందునిబద్ధరత్నమకుటం ఉన్నది. తల్లి, గాయత్రి తత్వార్థ వర్ణాత్మిక అనుకున్నాడు వసుదేవుడు. ఆమె వరద, అభయ, భక్తులను రక్షించునది. చేతులలో అంకుశమును, కశమును, శుభ్రమైన కపాలమును, గదను, శంఖమును, అరవిందయుగళమును ధరించినది. ఆమె సాంఖ్యాయనసగోత్రి. ఆ గోత్రమునకు ఋషి విశ్వామిత్రుడు. సవితృడు దేవత. "ఓసి! వేదమాత! నిన్ను నేను స్తుతిస్తున్నాను. నీవు నాయందు, నా యీ పుత్రుల యందు దయచూల్చు" అనుకున్నాడు వసుదేవుడు. వసుదేవుడు తన యెదుట కూరుచుండిన పుత్రుణ్ణి, దేవదేవుణ్ణి చూచుకున్నాడు. ఆ మూర్తి ఏమి? ఆ మూర్తి అనంతమై యున్నది. సహస్రమూర్తులుగా వెల్గిపోతున్నది. వేయి పాదములు, వేయి చేతులు, వేయి కన్నులు, వేయి బాహువులు, వేయి వూరువులు,—ఇదియేమి మూర్తి! తనకే ఆశ్చర్యమైనది! వేయి నామములు గల పురుషుడు, శాశ్వతుడు, సహస్రకోటి యుగములను ధరించినవాడు, తన ముందు ఉన్నాడు. ఇతనికా నేను ఆచార్యుడను? ఇతనికా నేను గాయత్రిని ఉపదేశించు ప్రథమగురువును? వసుదేవుడు భగవంతుని చెవికి దగ్గరకు ముఖముగా జరిగినాడు. పురోహితుడు, గర్గుడు వారిపై తలలమీదుగా వస్త్రమును కప్పినాడు. అప్పుడు వసుదేవుడు భగవంతునికి గాయత్రిని ఉపదేశించినాడు. తరువాత బలరామునికి ఉపదేశించినాడు. తక్కిన వటువులకు గూడ గాయత్రీ ఉపదేశములు జరిగినవి. ఆ ఉపదేశమును పొందిన ఆ వటువులలో శ్రీ కృష్ణదేవుడు త్రయీవిద్యకు వలె ప్రకాశించినాడు.

ఇప్పుడు వటువులు దండధారణం—చేయించవలసి ఉంది. క్షత్రియ, వటువులకు న్యగ్రోధదండధారణం విధి. గర్గుడు న్యగ్రోధశాఖలు తెచ్చి వాటిని పసుపులో తడిపిన అంగవస్త్రములను చుట్టి దండములను సమకూర్చి తెచ్చినాడు. ఖాదిరదండములను గూడ క్షత్రియులకు యోగ్యములుగా ధర్మశాస్త్రవేత్తలు చెప్పివున్నారు గాని, గర్గుడు, న్యగ్రోధదండములనే ఇక్కడ నిర్ణయించినాడు కుమారులకు ఆయుష్యాభివృద్ధి ద్వారా గోనర్వాదిభయనిర్హరణార్థం దండధారణం విధించబడింది. సుశ్రవ ఇతి మంత్రములను కుమారులచేత పరింపజేసి, న్యైయగ్రోధదండములను వటుల చేతులకు గర్గుడు వారి తండ్రులచే ఇప్పించినాడు. దక్షిణ హస్తములతో వటువులు దండములను ధరించినారు. లలాటసమ్మతంగా దండధారణం జరగవలసి ఉంది. శాస్త్రం చెప్పిన రీతిగా గర్గుడు ఇక్కడి తంత్రము లన్నింటిని నడిపించినాడు.

అప్పుడు వసుదేవుడు తన బిడ్డలచే వ్రతధారణం చేయించినాడు. ★



## ప్లాస్టిక్ దారాలతో బెల్ట్

(42-వ పేజీ తరువాయి)

ముడి వేయాలి. బెల్ట్‌కు ఈ రింగును దూర్చాలి. రింగు ముడి బెల్ట్ వెనుక భాగానికి రావాలి. పిల్లలు నిక్కరుకు వేసుకోగా మిగిలిన బెల్ట్‌ను ఈ రింగులో దూర్చడానికి అనువుగా వుంటుంది. ఈ బెల్ట్ చూచేందుకు చాల ఎట్రాక్టివ్‌గా ఉంటుంది. బజార్లో అమ్మే సాదా ప్లాస్టిక్ బెల్ట్స్ కంటె కూడా ఇది చాల బాగుంటుంది. పిల్లలు కూడా ఇష్టపడుతారు. అల్లేటప్పుడు మాత్రం బెల్ట్ పట్టుకునేందుకు ఇంకొకరి సాయం కావలసి ఉంటుంది. అల్లిక సులభంగా బోధపడేందుకి బొమ్మలో పోగులు ఎడంగా వేశాను. అల్లేటప్పుడు దగ్గర దగ్గరగానే అల్లాలి. ★



## అడ్డం

1. వేళాకోళం.
4. ఇంక వాటము కుదిరితే తలుపులు. బహు వచనము.
7. మాట.
9 పొట్టిగా, బలంగా ఉన్నవారిని ఇలా ఉంటా రని వర్ణించడం కద్దు.
10 మంచి కానిది.
11 ఇంద్రజాలము—వా రడిగారని చెప్పేది.
12 కంకరలో కూడా ఒక దినుసు.
14 పగడము.
15 సెలయేరు కవులలో 'లీవు.'
17 టిబెట్ ముఖ్యపట్టణం చివర ఉంటే సరదా.
18. రక్తానికి సంబంధించిన—విశేషణము.
19 నిరంజనుడి లోపల ఉన్న నీలిచెట్టు.
21. తర్వాత.
22 డమారం, టముకు—వాదప్పులు చేయుడు.
23. కమలాకరుడు గట్టిపడిపోయిన దానికి రెండు రెట్లు.
24 మీరూ కాదు, వారూ కాదు—మరెవరు ?
25 బరంపురం సంతలో కనుపించే సంతోషం.
27 డాబుగాగురువునే పరీక్షించి దట్టంగా ఉండే దాన్ని కనుక్కోవాలి !
31. లేని మాటను ఉన్నట్టు ఊహించి అర్థం చెప్ప గలిగించేది—ఇందులో ఆహారము ఉంటుంది.
32 జీతాలు.

## నిలువు

2 బిత్తరి—కాని తలక్రిందులుగానట్టిదే.
3 రసం, సరళంతో హాస్య మవుతుంది.
5 వాన సక్రమంగా కాకపోతే గంధమే.
6 నేలమీది అలంకరణము.
8. గంగా ప్రవాళంలో అర్థముంటే ఒక పెద్ద పాత్ర—నీరు తోడేది.
9. పూరితో సంబంధం కల కట్టడం !
10. వర్ణాలు కల తీపి వస్తువు !
13. సింహము.
14. ఆలిండియా రేడియో చేసేది ఇదే.
16. తలక్రింద అయిన మర్యాద.
20. కరండవాహినిలో సమూహమే కాక మిగిలేది కూడా.
21. దీనికీ బియ్యానికీ కూడా ఒకటే మంత్రం.
26. గుడ్డి—విశేషణం.
28. బుడుగును ఇంకా పొట్టి చేసి పరుషం చేరిస్తే అలాగే ఉంటాడు !
29. ఆలోచన తలక్రిందులుగా వ్రాయాలి.
30. తంతాము! అనే మాట దురుసేగాని వా రందు లోనే పడిపోయారు.

---

## 43.వ గళ్ళనుడికట్టుకు జవాబులు



---

# బిచ్చగాని కుక్క

(51 వ పేజీ తరువాయి)

ఇంకొక అయిదు నిమిషాలకు అది ఆ పెంకుటిల్లుమీద పడిపోతుంది. వెంటనే అది బిగ్గరగా మొరుగుతూ వీధితలుపులమీద ముందర కాళ్ళతో తన శక్తికొలదీ గట్టిగా బాదసాగింది. నిద్రపోతున్న రాము 'టైగర్' మొరుగుడు, వీధి తలుపులమీద దడదడ శబ్దంవిని ఉలిక్కిపడిలేచి పరుగెత్తుతూ వెళ్ళి వీది తలుపులుతీశాడు. కుక్క తోకఆడిస్తూ కొంతదూరం వెనక్కు వెళ్ళి నిలబడింది. రాము పరుగెత్తుకొని దానిదగ్గరకు వెళ్ళాడు. రాము బయటకు పరుగెత్తడం చూచి కామయ్య పార్వతమ్మ కంగారు పడుతూ రాము కోసం బయటకు పరుగెత్తుకొచ్చారు. అంతే! పెళపెళ ధ్వనులతో వాకిట్లోని చింతచెట్టు దబుక్కున యింటిమీదపడింది. పెద్దశబ్దం చేస్తూ పెంకుటిల్లు చాలాభాగం కూలిపోయింది.

కామయ్య పార్వతమ్మ కుక్క వలన కలిగినమేలు గ్రహించారు. ఈ రోజున అది తలుపుతట్టి తమను రక్షించకపోతే తమబిడ్డతో సహా అలాసజీవసమాధిఅయిపోయేవారే. ఆ క్షణంలో వారికి దానిమీదఅంతు లేనిప్రేమ కలిగింది. దాని విశ్వాసానికి ఆశ్చర్యపడ్డారు. ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నారు. ☆



"అబ్బే, ఇప్పుడు పనిలో వున్నాను. తర్వాత కలుసుకుందాం..."

-చిత్రకారుడు : యిమంది నరసింహారావు (గాకినాడ)

## ప్రేమ అంటే....

తెలుగు విద్యార్థి: విమలా! ప్రేమ మాలా! కరుణించవేల?

సైన్సు విద్యార్థి: (పేరు విమల) ఏమిటీ కాకిగోల?

తె. వి.—కాకిగోల కాదు, ప్రేమగోల!

విమల—ప్రేమఅంటే ?...

తె. వి.- ప్రేమా? ప్రేమే. అంటే 'లవ్'. ముహబ్బత్ ...

విమల-ఆపు. ప్రేమ పర్యాయ పదాలు కాదు నేను అడిగినది. దాని భౌతిక రసాయనిక ధర్మాలు ఏమి?

తె. వి.-ప్రేమకు రూపం లేదు. అందుకే భౌతిక ధర్మాల ప్రసక్తిలేదు, ఉండదు. అది మదిరం కన్న అధికంగా మత్తు కలుగజేసేది; మధువు కన్న మధురం.

విమల-అయితే మధువు కలిపిన మదిరం త్రాగు.

—సి. వి. రమణ (మదనపల్లి)

## పొట్టి కథలు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

### 'ఒకడికి అంగుడిలేదు, ఒకడికి మింగుడులేదు'

రైలుబండిలో ప్రయాణం చేస్తున్న ఆసామీ బండి ఒక స్టేషన్‌లో ఆగితే ఒక జేబులోంచి ఒకగడియారం, తరువాత రెండో జేబులోంచి మరో గడియారం తీసి చూచాడు. అతడు ప్రతిస్టేషన్‌లోను అదేవిధంగా వరుసగా రెండు గడియారాలు తీసి చూడడం సాగించాడు.

తోడి ప్రయాణీకుడు ఉండబట్టలేక "ఏమండి, మీరేమైనా పరిశోధన చేస్తున్నారా? అలా రెండు గడియారాలు వరసగా చూస్తున్నారు" అని ప్రశ్నించాడు.

గడియారాల మనిషి అన్నడిట. "లేదండి. ఒక గడియారానికి నిమిషాలముల్లు లేదు. రెండోదానికి గంటలముల్లు లేదు. అందుచేత టైమ్ తెలుసుకోడానికి..."

కె. నారాయణరెడ్డి, (ఇంటుర్తి)

## పెద్ద ఆకారాలూ చిన్న వికారాలూ

(12-పేజీ తరువాయి)

అరిచి, ఏడ్చి అలసిపోయిన నా ఇష్టసఖి నన్నొచ్చి గట్టిగా కావలించుకొంది. వాళ్లమ్మ కూడా నా దగ్గరికొచ్చి "నా బిడ్డను కాపాడావు తల్లీ ... దానికి చిన్నప్పట్నుంచీ తొండను చూస్తే చచ్చేంత భయం. ఇంకాసేపుంటే భయంతో చచ్చేపోతుం దనుకున్నాను. నా బిడ్డను నాకు దక్కించావు. నీ మేలు మర్చిపోను'' అంటూ నా చేతులు రెండూ కండ్ల కద్దుకుంది.

''అసలు మీ రెలా కనుక్కున్నారు ! ఆ సీతాకోక చిలక్కోసం తొండ వచ్చిందనీ'' అంటూ అందరూ నా చుట్టూ చేరారు—

''ఆమెవి 'జీనియస్ బ్రెయిన్స్' అయ్యా'' అన్నాడు డైరెక్టరు నన్ను అభినందిస్తూ.

''అసలది కాదండీ . . '' అంటూ మళ్లీ ముందు కొచ్చాడు అవతారం.

''విన్నారుగా ! డైరెక్టరుగారు చెప్పింది ! ఫూ'' అన్నాను సీరియస్‌గా ముఖంపెట్టి. అంతా ఒక్కసారి గొల్లున నవ్వారు నా 'విట్టు' కు.

నా ఇష్టసఖి రెస్టు కోరడంవల్ల నా సలహామీద ఆరోజు షూటింగ్ కేన్సల్ చేశారు. ఇంటికి వెళ్లడానికి కార్లో బయలుదేరుతున్న నా దగ్గరికి నా ఇష్టసఖి పరుగెత్తుకొచ్చింది.

''క్షమించండి. బల్లి భయంతో పరుగెత్తిన మిమ్మల్ని చూసి నవ్వినందుకు వెంటనే తగిన శాస్తి చేశాడు దేవుడు. భయంతో చచ్చిపోవాల్సిన నన్ను మీరే బ్రతికించా రీ రోజు'' అంటూ ఎంతో కృతజ్ఞతతో నమస్కరించి వెళ్లిపోయింది నా ఇష్టసఖి.

బల్లి అంటే భయంతో గజగజలాడే నేను తొండంటే భయపడే మరొక ప్రాణిని రక్షించగలిగానా ! నాలో నేనే నవ్వుకున్నాను. ★

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

